"ఓం"

"సర్వం లింగమయం జగత్"

యోవేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతేచ ప్రతిష్ఠితః ।
తస్య ప్రకృతి లీనస్య యః పరస్స మహేశ్వరః ॥

న వీరశైవ సదృశం మతమస్తి జగత్రయే ।
సర్వభోగ ప్రదం పుణ్యం శివసాయుజ్యదాయకం ॥

# శతకత్రయము


అనువాదకులు :

వే॥ పం॥ డా॥ పెద్దమఠం రాచవీరదేవర
"తీర్థ" & M. O. L. గారు
హైదరాబాదు.



ప్రకాశకులు :

వీరశైవ గ్రంథమాల
ఇంటి నెం. 3-3-139, కాచిగూడ
నెహ్రూ హైస్కూలు వద్ద
హైదరాబాదు - 500 027

శ్రీ మగ్గెయ మాయిదేవ విరచిత (ప్రణీత)ంబైన
"శతకత్రయ" మను గ్రంథోక్తము నందలి కొన్ని
(పలు) సూక్ష్మ విషయములను, వీరశైవులు ఈ
సిద్ధాంతములను తప్పకుండ తెలిసికొని
యాచరించుటకు బ్రయత్నించదగును

## తీర్థ క్షేత్రములను బర్యటించుట సర్వథా నిషేధము

నిజమైన వీరశైవ ధర్మ ప్రవర్తకుడైనవాడికి తాను నివసించియున్న స్థానమే పుణ్యక్షేత్రముగాను, అథవా తనకంటెను మహాజ్ఞాని, ధర్మము - నీతి - దయ - శిష్టాచరణాదులను విడువకుండగా పాటించు మహానుభావుడున్న స్థానమే మహా పవిత్రమైన పుణ్య క్షేత్రముగాను భావించుకొని తానున్నచోటే పవిత్ర క్షేత్రముగా పరిగణించవలెను. అందుచేత పెద్దలు అనుభవజ్ఞులైన వారీవిధముగా నాదేశించియున్నారు.

శివభక్తంగిరి కాశిహంపె మొదలాద క్షేత్ర తీర్థంగళం
బివునెందుం పెసర్గొళ్ళ నాలిసనతీవా కాంక్షెయిం పోగను।
త్సవదింనోడనకృత్యకృత్యముమనేనం మాడనిష్టార్థమం
నెవదింబేడననన్యభావ పరిపూర్ణాత్మం శివావల్లభా ॥20॥

నెలనుం నీరు మనాహ బెట్టమనిదేం కొండాడువర్ క్షేత్రమేం
దెలె పుణ్యామళ తీర్థమెందు గిరియెందయ్యా శివజ్ఞానయో
గలసద్భక్తి విహీనరప్ప భవిగళ్ సుక్షేత్రముం తీర్థముం
కులశైలం శివభక్తనెందు తిళియర్ నోడా శివావల్లభా ॥25॥

"పాదాగ్రరేణవోయత్ర-పతంతి శివయోగినః।
తదేపసదనంపుణ్యం-పావనం శివమందిరం॥
ఇదం తీర్థ మిదం క్షేత్రం భ్రమంతి తమసానరా॥

శివానంద మహాసముద్రమునందు ముళిగి లింగైక్య స్థళ
మును బడసిన శివయోగికి

"మాయాశక్తి తిరోధానాచ్ఛివేభేదవికల్పనా।
ఆత్మనస్తద్వినాశేతు నాద్వైతాత్కించిదిష్యతె॥

అను ప్రమాణము ననుసరించి మాయ నశించి, భేద
భావము నశించుటచేత అటువంటి వారికి తీర్థక్షేత్ర గమనము-
సైవము-జ్ఞానము-ధ్యానము-సమాధి-మంత్రము-జపము - పూజ -
హోమము - వ్రతము. వీనిని ఆచరించుట గాని-వాటి వలన ఫల
ప్రాప్తినిగాని (సిద్ధినిగాని) ఐహిక-పారమార్థిక సుఖములను సహ
వేడడు ఏలనన సర్వముతానై యున్నాడు అనగా

"శివం విశ్వ గురుం సాక్షా-ద్వ్యజయేన్నిత్యమాత్మని ।
ఏకత్వేన చిదాకారే తదిదం సహభోజనం. ॥22॥

అను ప్రమాణము మేరకు సర్వము తానెయై యున్నాడు. సహభోజన స్థలాపన్నుడై చిత్స్వరూపుడగుటవలన తీర్థక్షేత్రాది గమనము శివయోగికి అనవసరమని తాత్పర్యం.

ప్రమా:- "దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సనాతనః" అను ఉపనిషత్తు వాక్య ప్రమాణము ననుసరించి దేహమే దేవాలయము జీవుడే పరమాత్ముని యంశ స్వరూపమని భావించి గుర్తించిన బిదప ఇంక తీర్థయాత్రలందు బర్యటించుట వృథా కాలక్షేపము ఆయుక్షీణమే యగునుగదా? పోగా ఎవరికి శరీరదార్ఢ్యము ఆర్థిక స్తోమత గలవారే తీర్థక్షేత్రములను దర్శింతురు. ఈ రెండును కొరవడిన నిరుపేదలకు శరీర శక్తి హీనులకు పరమాత్ముని యందు భక్తి లేదని చెప్పదగునా? అలాగైతే ప్రాచీన కాలమున నుండి మనకాదర్శ ప్రాయులైన యోగిపుంగవులు, ఋషీశ్వరులు (అగస్త్య - దూర్వాస-అత్రి-దధీతి-వశిష్ట-విశ్వామిత్ర మొ॥వారు మరియు మార్కండేయుడు-ధృవుడు-ప్రహ్లాదుడు-మీర) వీరంత ఏ తీర్థక్షేత్రముల దర్శించి భగవద్భక్తికి బాత్రులైరి? మానవుని మనస్సు పరిశుద్ధముగా నుండి ఎల్లవేళలో భగవంతుని యందు

దృఢమైన భక్తి యుండినయెడల పరమాత్ముడే భక్తుని చెంతకు అన్వేషిస్తు వచ్చుననుటకు సాక్షాత్తుగా ధృవుడు-మార్కండేయుడు ప్రహ్లాదులే మనకు ప్రమాణముగా నున్నారు. ఇంతకు తేలిందేమిటి యనగా "యద్భక్తా యత్రతిష్టంతి తత్రతిష్టామి పార్వతి" అని ఆగమ ప్రమాణము ఇకపోతె

"అనన్యాశ్చితయంతోమాం-ఏజనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం-యోగక్షేమం వహామ్యహం॥

అని శివగీత - భగవద్గీత ప్రమాణములు మనల్ని మాటి మాటికి హెచ్చరించుచున్నవి. "యజ్జుహోషి యద్దదాసి-యత్కరోషి యదశ్నాసి-తత్సర్వం మదర్పణం కురుకౌంతేయ" అనియు మరియు "ఉరతబసతాకామకరతానామషూ౯వ" అనియు మన మనోదృష్టి ఎల్లప్పుడు పరమాత్ముని ధ్యాన నిమగ్నమై యుండిన జాలును. ఏ తీర్థక్షేత్రగమన మనవసరమని మదీయ విచారము. విజ్ఞానదృష్ట్యా వెళ్ళవచ్చునేమో కాని పరమాత్ముడా తీర్థక్షేత్రాదులయందు నెలకొనియున్నాడు. నేనున్నచోట లేడనుట శుద్ధ పొరపాటు. అది వాడి అజ్ఞానమేసరి. "ఇందుగలడందులేడని సందేహము వలదని పెద్దలు నుడివియున్నారు.

కలడందురు దీనులయెడ, కలడందురు భక్తగణములపాలిట,
కలడందురు పరమయోగి గణములపాలిట,
కగడందురన్నిదిశలను,

"నసేవో విద్యతేకాష్ఠే-నపాషాణేనమృణ్మయే।
భావేసన్నిహితస్సాక్షా- త్తస్మాద్భావోऽత్రకారణమ్॥

దైవేమంత్రేతథాతీర్థే-దైవజ్ఞేభేషజేగురౌ।
యాదృశీభావనావాస్తి-సిద్ధిర్భవతితాదృశే॥

ప్రమాణము :- శివగీత-ద్వాదశ-అధ్యాయము
శ్లో॥ 17 - 20 వరకు

ఉపాసనమితిప్రోక్తం-తదంగానిబ్రువేశృణు।
తీర్థక్షేత్రాదిగమనె-శ్రద్ధాంతత్ర పరిత్యజేత్॥ ॥17॥

స్వచిత్తైకాగ్రతాయత్ర-తత్రాసీత సుఖంద్విజః।
కంబలే మృదుతల్పేవా-వ్యాఘ్రచర్మణి వాస్థితః॥ ॥18॥

వివిక్తదేశేనియత-స్సమగ్రీవ శిరస్తనుః।
అత్యాశ్రమస్థస్సకలా-నీంద్రియాణి నిరుధ్యచ॥ ॥19॥

భక్త్యాథస్వగురుంనత్వా-యోగం విద్వాంచయోజయేత్।
యస్త్వవిజ్ఞానవాన్-భవత్యయుక్త మనసాసదా॥ ॥20॥

వ్యాఖ్యానము :- ఉపాసన చేయువాడు చిత్తైకాగ్రతయున్న చోటనే యుపాసన చేయుట మర్హముగాని, తీర్థక్షేత్రాదులకు వెళ్ళుట అనవసరమని యాదేశించబడినది. విజ్ఞానియైనవాడు కంబళి యాసనము నందుగాని, మరోమెత్తని యాసనము నందుగాని, పులి చర్మము పైనగాని, నిర్జన ప్రదేశమున నియమము గలవాడై, సమంగా నుంచబడిన శిరము-దేహము-కంఠము గలవాడై, చక్కగా విభూతి రేఖలను, రుద్రాక్షలను ధరించి, సమస్తేంద్రియములను దన స్వాధీనము నందుంచుకొని దృఢమైన భక్తితో దాను విశ్వసించిన దన గురువునకు దన మనస్సులో నమస్కరించి, ధ్యానయోగము నాచరించవలెను. స్వాధీనములో లేని మనస్సుతో నెవడు విజ్ఞానము లేనివాడో వాని ఇంద్రియములు స్వాధీనములో లేని గుఱ్ఱములను దోలు సారధివలె యగును. (20) ఈ విధానము వీరశైవ భక్తులకు నియతముగా విధించబడినది. కావున జ్ఞానయోగులు తీర్థయాత్రలు జేయుట నిషేధించబడినది.



తెలుగు వ్యాఖ్యాన కర్త

వే॥ పం॥ పెద్దమఠము రాచవీరదేవర గారు

"తీర్థ", M.O.L.




శ్లో॥ న వీరశైవ సదృశం మతమస్తి జగత్త్రయే ।

సర్వభోగ ప్రదం పుణ్యం శివసాయుజ్యదాయకం ॥



డాక్టరేటు, వీరశైవ విద్వన్మణి బిరుదు ప్రదానోత్సవ సందర్భముగా శ్రీ పండిత పెద్దమఠం రాచవీరదేవరకు సమర్పించబడిన వర్ణచిత్రం.

అక్షర బిల్వార్చన.

వీరశైవ సాహితీ భగీరథా!

శైశవం నుండి వీరశైవ భావాలను పుణికి పుచ్చుకున్న మీరు వీరశైవ ధర్మ ప్రచారానికి అంకితమై వీరశైవ భక్త సమాజాల స్థాపనద్వారఆపవిత్రఆధ్యాత్మికతత్వవాహినిని దశదిశలకు వ్యాపింపచేసి తరించిన అపర "భగీరథులు" మీరు వీరశైవుల అభ్యున్నతి కోసం అహరహం శ్రమిస్తున్న అపర జంగమ దేవరలు మీరు.

పండిత రత్నా!

గీర్వాణాంధ్ర హిందీ కన్నడ భాషలలో అపారపాండిత్యాన్నార్జించిన మీరు ఎందరో పౌరులకు మార్గ దర్శనం చేయడమే కాక, వారిని విజ్ఞాన వంతులుగా తీర్చిదిద్దిన పాండితీ శిరోమణులు. 1988 గురుపూజోత్సవ సందర్భంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పక్షాన ఉత్తమ పండిత సత్కారాన్ని నాటి ముఖ్యమంత్రి గౌ॥ ఎన్. టి. రామారావు గారి కరకమలముల మీదుగా అందుకున్న మీరు చరితార్థులు.

పుంభావ సరస్వతీ!

మీ కలం నుండి దాదాపు నలభై కావ్యాలు వెలువడి, "గద్య" కథానిక, వ్యాస. కథ రంగాల్లో విశిష్టమైన స్థానాన్ని,

ప్రశస్వమైన కీర్తిని ఆర్జించిపెట్టి, "పుంభావ సరస్వతీ" బిరుదును సార్థకం చేసాయి. "వీరశైవ దర్పణం" అనేది ధార్మిక పత్రికను నడిపి పత్రికా రంగంలో ఆధ్యాత్మిక సౌరభాన్ని ఆస్వాదింపజేసిన ఘనులు మీరు.

**మానవతా శిరోమణీ!**

మానవ సేవయే మాధవసేవ అనే ఆర్యోక్తిని ఆకళింపు చేసుకొని కేవలం ఆధ్యాత్మిక విషయాలకే పరిమితం కాకుండా అనేక పీఠములకు, దేవస్థానములలో జరిపే నిత్యాన్నదాన పథకాలకూ, ఆలయ నిర్మాణాలకు, శివపేటిక నిర్మాణానికి ఆర్థికంగా సహకరించిన మీ మానవతా దృక్పథానికి మా హృదయాంజలి!

**"వీరశైవ విద్వన్మణీ"**

మీ ఆధ్యాత్మిక సేవ మరెన్నో రీతులలో వికసించాలని మీ కలం నుండి మరెన్నో కావ్యాలు వెలువడి ధార్మిక చింతనను పెంపొందింప జేయాలని, మీ జననీజనకులైన నాగమాంబ, పెద్ద మఠం వీరయ్య గార్ల జీవిత లక్ష్యంగా మీ ధార్మిక కృషి జరగాలని కాంక్షిస్తూ, ఆ బసవేశ్వరుడు మీకు మరింత ఆయురారోగ్యాలు ప్రసాదించాలని కోరుతూ ఈ "అక్షర బిల్వార్చన"తో మీకు "వీరశైవ విద్వన్మణీ" బిరుద ప్రదానంతో మిమ్మల్ని

సత్కరించుకుంటూ తెలుగు జాతి పక్షాన అభినందనలు తెలియ జేసుకుంటున్నాం.

రచన: సాధన నర్సింహచార్య
సుందరయ్య విజ్ఞాన కేంద్రం
హైదరాబాద్.
6-6-1999.

ఆత్మీయ సాంస్కృతిక సమితి.
సికింద్రాబాద్.

---

శైవ-వీరశైవ వాఙ్మయోత్సవ సందర్భంగా
డా॥ పండిత పెద్దమఠం రాచవీరదేవర గారికి.
విద్వజ్జనసమక్షమంలో

వీరశైవ "విద్వన్మణి" బిరుదు ప్రదానం.
ఆత్మీయ సాంస్కృతిక సమితి, సికింద్రాబాద్.
శైవ-వీరశైవ వాఙ్మయోత్సవములు.
6-6-1999.

---

ఆత్మీయ సాంస్కృతిక సమితి
డా॥ పెద్ద మఠం రాచవీర దేవర గారికి
పైబిరుదములనొంగనైనది.



వీరశైవ సాహిత్య పరిషత్‌వారు(బెంగుళూరు) డాక్టరేట్. వీరశైవ విద్వన్మణి రాచవీరదేవర గారిని సన్మానించిన చిత్రం



శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం డా॥ బిరుదురాజు రామరాజు గారి అధ్యక్షతన
**డాక్టరేట్. వీరశైవ విద్వన్మణి** పెద్దమఠం రాచవీరదేవర గారికి జరిగిన సన్మానోత్సవం

ఓం శివాయనమః

శివశ్రీ పండిత పెద్దమఠం రాచవీరదేవర గారు రచించిన

"శతకత్రయ" కావ్య ఆవిష్కరణ

సందర్భమున రచించిన

కవితారూప రచయిత పరిచయము

# విజయోస్తు

వీరశైవమాహేశ్వర వీరగోత్ర సముద్భవులు
వీరయార్య నాగాంబల గర్భశుక్తి మౌక్తికమా !
సాధుమూర్తి షడక్షర స్వాముల యంతేవాసిగ
విరూపాక్ష గురువర్యుల పరమశిష్య వరునిగాగ
వీరశైవ ధర్మాలను విస్పష్టముగా గ్రహించి
తెలిసికొనిన ధర్మసూక్ష్మ మెలకువలను తెలుపుటకై
దశాబ్దమ్ము "వీరశైవధర్మ" పత్రికను నడిపియు
ధార్మిక గ్రంథాలనెన్నొ ఓర్మితోడ రచియించిన
రాచవీరదేవరాభిధానా! సుయశోధనా!

సారస్వత పరిషత్తున సాహిత్య విశారదులై
హిందీ ప్రచారక సభను హిందీ భాషాభూషణులై
కన్నడ భాషయందు "జాణ" గీర్వాణ వాణియందు "తీర్థ"
(ఆంగ్లభాషను సముచితముగ) నభ్యాసము గావించియు
పంచభాషా ప్రవీణులన బరగిన భాషా కృషీవల!

ప్రాచ్యభాష పరీక్షలలో ప్రౌఢతర పరీక్షయైన
M. O. L. పట్టము చేపట్టినట్టి విద్యాధిక
సంస్కృతాంధ్ర భాషలలో చక్కని పాండితి గడించి
పండిత మండలికి నీవు మండన ప్రాయుడవైతివి
అరయ పండిత పరషత్తున కధ్యక్షులుగా నుండియు
పండిత తతి సమస్యలకు పరిష్కారమును చూపియు
సభ్య పండితాళిచేత సముచిత మన్ననల గొనిన
పరహితార్థ చింతనాపర! పండిత శ్రేయస్కర!

హైద్రాబాద్ నగరమందు హైస్కూల్ కాలేజిలలొ
సంస్కృతాంధ్ర పండితుడిగ సదుద్యోగమును సలుపుచు
అధికారుల విద్యార్థుల ఆదరాభిమానములను
అధికముగా చూరగొనిన ఆదర్శాధ్యాపకా
ఉత్తమ సేవకు గుర్తుగ అత్యుత్తమ పండితుడుగ
రాష్ట్రస్థాయి పురస్కార దాజము నిను వరియించెను.

అం. ప్ర. వీరశైవ మహాసభ యొసగిన సత్కారము
వీరశైవను "సాహిత్య సార్వభౌమ" యను బిరుదము
వీరగోత్ర విభూషితులు విబుధులును జగత్ గురువులు
"ధర్మనిరత" సత్కారము దయ ననుగ్రహించినారు
శ్రీ కాశీవాస జ్ఞాన సింహాసనాధిపతులు
ప్రసన్నులై నొసగినారు "పండితరత్న" బిరుదమ్మును
శివాచార్య స్వాములైన శ్రీశైల జగద్గురువులు
"పుంభావ సరస్వతి" యను పూజనీయ బిరుదమిడిరి

సంస్కృతాంధ్ర కన్నడ భాష సాహిత్య ప్రసంగాలను
పలుమార్లు రేడియో కేంద్రాల ద్వార ప్రసంగించి
వివిధ విషయ జ్ఞానసుధను వీనుల విందొనరించియు
శ్రోతల మెప్పును పొందియు ఖ్యాతి గడించిన "దేవర"
సంస్కృత కన్నడ భాషల సారస్వత సాగరమును
తఱచితఱచి సుధారసపు ధారలు ప్రవహింపజేసి
వీరశైవ సాహిత్యపు వెల్లువతో తెలుగు భాష
సుసంపన్న మొనరించిన సురుచిర రచనాధురీణ

వీరశైవ లోకానికపార సేవలందించియు
వీరశైవు లభిమానము విరివిగాను కొల్లగొనిన

వీరగోత్ర కలశాంబుధి వరరాకా సుధాకరా
వీరవ్రత: "రాచవీరదేవర విజయోస్తు మీకు"

ఎం. శంకరయ్య స్వామి
M A. MOL.
విశ్రాంత తెలుగు పండితులు
అధ్యక్షుడు : వీరశైవాగమ పరిషత్తు హై.
అర్చక పరీక్షల అడ్వైజరీ బోర్డు మెంబర్
ఎండోమెంటు డిపార్టుమెంటు ఆం. ప్ర.
నెం. 6-132/3 బోయవాడ, ఇబ్రాహింపట్నం మం॥
జిల్లా. రంగారెడ్డి PIN : 501 506
STD : 08414 Phone , 22316




సికింద్రాబాద్ వీరశైవ సమాజం పక్షమున బసవేశ్వర జయంతి సందర్భంగా నిర్వహించిన సభలో ప్రసంగిస్తున్న డాక్టరేట్, వీరశైవ విద్వన్మణి ..డిత పెద్దమఠం రాచవీరదేవర మరియు యం. శంకరయ్య, డా॥ లింగయ్య స్వామి.



**డాక్టరేట్, వీరశైవ విద్వన్మణి** పెద్దమఠం రాచవీరదేవరకు ఆత్మీయ సాంస్కృతిక సమితి వారు
సమర్పించిన **అక్షర బిల్వార్చన** చిత్రపటం

# శ్రీమగ్గెయ మాయిదేవకవి

## శ త క త్ర య ము

( శివాధవా - శివావల్లభా - మహదైపురీశ్వరా )

కవిపరిచయము :-

మగ్గెయమాయి దేవుడి గ్రామము, పెద్దమొగ్గె. ఇది విజాపురు జిల్లాలో, ఇది చరిత్ర (ఇతిహాస) ప్రసిద్ధమైన పల్లె టూరు. (ఐహొళె) వద్దనున్నది. వీరు ఆగ్రామము యొక్క పెద్ద-మఠము (హిరియ మఠము)వారు, శివచార్యులు. వీరి తండ్రి పేరు సంగమేశ్వరుడు, వీరి మూల పురుషుడు ఉపమన్యు శివాచార్యుడు. వీరు ఐవళ్ళి క్షేత్రమునందున్న సోమనాథస్వామి యొక్క అనుగ్రహముతో జన్మించిరి, భీమనాథుడు, కాశేశ్వరుడు, బొప్పనాథుడు, నాకరాజు, సంగమేశ్వరుడు- కవిమాయిదేవ ఇది ఉపమన్యు శివాచార్యుని వంశపరంపరాగతమైనది, వీరు జ్ఞాన సింహాసనమైన కాశి పీఠమునకు జెందినవారు, వీరిది స్కంద గోత్రము. పంచవర్ణ సూత్రము.

గ్రామము పెద్దమొగ్గె ఐనను నివసించునది ఐవళ్ళి మొగె గ్రామ నివాసియగుటవలన మగ్గెయమాయిదేవ ప్రభు అని పేరు. మాయిదేవ, మొగ్గెయమాయిదేవ, మాయిదేవవిభు, అని

పేరుగలదు. మాయిదేవ, మగ్గెయమాయిదేవ మాయిదేవవిభు, మాయిదేవ ప్రభు, కల్యాణ మాయిదేవ, అని నామాంతరములు న్నవి. గ్రామమును మగ్గె, మొగ్గె అని రెండు విధములుగా వాడుకలోనున్నది. వీటిలో మొగ్గెయనునదే ఉచితమైనదని చెప్పనగును, అందుచేత కవి నివసించిన గ్రామము పేరు ఐవళ్ళి ఐహోళె, అనియు ఐపురియనియు, చెప్పుకొందురు. (వాడుక గలదు) ఇది ప్రాచనమైనది. పవిత్రమైనది, చరిత్ర ప్రసిద్ధమై నది గూడ.

ఈ కవి పుంగవునకు ఐపురి సోమనాదుని పైన అంతు లేని (అపరిమితమైన) భక్తి గలదు. తన ఆరాధ్యదేవత యొక్క పేరు ప్రసిద్ధికెక్కెవైరాగ్య శతకము ప్రత్యేకించనైనది. ఆశతకము మొదట, జెప్పిన పది పద్యములలో అనేక విధాలుగా భక్తి చేత వర్ణించియున్నాడు. (స్తుతించాడు) కవి హృదయమె ఐపురి గ్రామము. అక్కడ దివ్యతేజస్సుతో ప్రకాశించు దివ్యలింగిమే- సోమేశ్వరుడు.

మాయిదేవ విభువు సమస్తాగమ పారంగతుడు కన్నడము సంస్కృతము ఈఉభయ భాషా విశారదుడు, గీత-సూత్ర శతక కర్త "శివానుభవసూత్రము". శతకత్రయము, షట్ స్థలగద్య-

ప్రభుగీత-విశేషార్థ ప్రకాశిక-ఏకోత్తర శతస్థల షట్పది, మొగ్గెయమాయిదేవ వచనము, ఇవియేడు ఈ కృతులు. వీటిలో శివానుభవ సూత్రము, విశేషార్థ ప్రకాశిక, ప్రభుగీత, ఈ మూడు సంస్కృత గ్రంథములు మిగతా నాల్గు కన్నడకృతులు, ప్రభుగీత, మాయిదేవ వచనము ఈ రెండు అముద్రితములు. ఈ పుస్తకములు కవియొక్క పాండిత్య ప్రతిభకు హెగ్గుర్తులు. "సత్యశుద్ధశివాద్వైత విద్యాతంత్ర స్వతంత్రధీః,, అని "శివానుభవ" సూత్రమునందు కవి చెప్పుకొనియున్నాడు సత్యశుద్ధమగు శివాద్వైత సిద్ధాంపమునందు స్వతంత్ర ధీమంత, అప్రతిమ ప్రతిభావంత, వేదాంతమును, కన్నడమునకు దెచ్చిన కీర్తి నిజగుణ కవినుండి జరిగిన శివసిద్ధాంతమును, కన్నడమునకు దెచ్చిన మొదటికవి" శతకత్రయము ద్వారా ప్రవేశపెట్టిన కీర్తి మాయిదేవ ప్రభువర్యునిది.

**కవికాలము:-**

ఈ కవికాలము పదైదవ (15) శతమానము యొక్క పూర్వార్ధముతోని విజయనగరమును పరిపాలించిన ప్రభువైన ప్రౌఢదేవ రాయలవారి కాలము. ఈ కాలము క్రీ-శ. 1048 నుండి 1448 అని చెప్పవచ్చును, విజయనగరముయొక్క

సంగమ వంశమునందు మరియు రాజుల (ప్రభువుల)లో ప్రఖ్యాతి గాంచినవాడు ప్రౌఢదేవరాయలని శాసనోక్తముగలదు.

క్రీ. శ. 1948 లో రచించినట్టి చన్నబసవ పురాణములో శ్రీ విరూపాక్ష పండితుడు ఇట్లు చెప్పియున్నాడు.

"ఎతెరామకేళ్ళిన్ను సకలాగమంగళిగ్లె।
నెలెయెనిసి ప్రౌఢనిం పూజెయింకొండుషట్।
స్థల మార్గమం సకల శివభక్త సంతతిగె కరతలా।
మలకవాగిలి శివోలనుభవసూత్రవాది శాస్త్రంగళం।
గెలవనింపేళ్ద నిజశివ సమాధియల్లిమిగె।
నలవినిందల్లిమిగ్గెయమాయి దేవ ప్రభువరనిందముక్తనహను

(కాండము 5. అధ్యాయము 10).

ఈ పద్యమునుండి కవివరేణ్యుని కాలము దెలియు చున్నది. కవి యొక్క శాస్త్ర ప్రజ్ఞె, రాజ గౌరవము. అనుభవ సూత్రము మొదలుగాగల గ్రంధ కర్తృత్వము, శివయోగ సంపత్తు షట్స్థలసంపత్తు, ఉండెననిదెలియుచున్నది. పోగ వీరికి శాస్త్రగ్రంధములను రచించి దెలియజెప్పెడి స్తోమత (సామర్థ్యము) వీరికుండినది. శివయోగ్గ సమాధి యందలి రహస్య మును చక్కగా నెరింగినవారు ఇంతెగాకుండ క్రీ. శ. 1550లో

నుండిన తోంటద సిద్ధలింగయతివరెణ్యులు తమ పాల్కురికి సోమేశ్వర పురాణమునందు.

"మాయి దేవరు నెలద మెలెనెళలు బీళద
జయ స్తంభవన్నునట్టు ఇష్టలింగవన్ను శరీరద
మేలెధరినదవరిగె భవబంధ విల్లెంబుదన్ను
సిద్ధాంతమాడితోరిసి. షట్స్థల మార్గవన్ను
విస్తరిసి నిరూపిసిదరు,, ఎందు హెళిద్దారె.

లక్కదండేశుడు, చామరసుడు, గురుబసవయ్య, బొమ్మరసు, చంద్ర-కవి, మొదలగు కవీశ్వరులు ఈ కవికి సమకాలీకులు.

ఈ కవి విజయనగరము యొక్క ప్రఖ్యాతిగాంచిన ప్రౌఢదేవరాయల వారినుండి మరియు వేంకటపతికి అల్లుడైన శ్రీ రంగరాయుడి నుండి గౌరవ మర్యాదలను బడసి (పొంది) ప్రసిద్ధి జెందియున్నాడు. ప్రభావశాలియైయున్నాడు. సంస్కృతము, కన్నడ-ద్విభాషలయందును పండితులై ఉద్గ్రంధములను రచించియున్నాడు. విజయనగరము యొక్క ప్రౌఢదేవరాయల వారి ఒడ్డోలగమున మరియు ఆతనికాలమున ప్రౌఢకవియై ప్రకాశించెను.

# శతక సాహిత్యము

సాహిత్య ప్రక్రియలో శతకహిత్యము ఒకటి-కన్నడ వాఙ్మయములో శతకసాహిత్యము అధికముగ వృద్ధి గాంచినది. వందపద్యములతో పరిమితమైనదె శతకమనబడును. ఈ శతకమునందు కావ్యగుణమున్నను శతకరచయిత కవియైనప్పటికి. శతకముమాత్రము కావ్యమనబడదు, కావ్యమునకు గావల్సిన కథావస్తువు. వర్ణన, శతకమునందుండదు, శతకతత్వము-నీతి అనుభవములకు మాత్రమే ప్రత్యేకించబడినది, భక్తి-జ్ఞానము-వైరాగ్యాదులను బోధించుటకు సాధన వస్తువైనది. శృంగార రసమునకు అవకాశముండదు. మానవ జీవితమునకు ఇందులో కావల్సినంత ఆవకాశముండును. సాధన మార్గమునకు వల్సినంత శక్తి దీనికుంది. పద్యరచనలో ప్రసన్నతగలదు. పరిమితి కిమించి వంద పదైదు (115) నుండి వంద ఇరువదైదు (125) పద్యములవరకుండవచ్చును. ఈ సంఖ్యను సాధారణముగా మించియుండదు,

నీతిని నిరూపించుటకు, గుణ ధర్మమును సంగ్రహించుటకు, అనుభవాభివృద్ధికి. ఇదొక మంచి సాధనము, ఉపయుక్తమైన భూమిక, శతకకారునికి శక్తియున్న (బుద్ధిబలమున్న)

యెడల ఈ భూమికయందు కావల్సినంత జీవనోపయుక్తమగు కృషియొనర్పవచ్చును. చక్కని సూక్తులను ప్రకటింపవచ్చును జాతి-సామెతలను నిర్మింపదగును. ఉన్నవాటిని తనఛందస్సునకు సమకూర్చవచ్చును. ఆరాధనా మూర్తిని స్తుతించ వచ్చును దీనితో పాటు గుణ ధర్మములను, వ్యవహారములను బొగడ వచ్చును.

శతకకారులెందరు? శతకసాహిత్యమెంత? అని చెప్పుటకు వీలులేదు. ఈ విషయమున సంగ్రహించిన కన్నడ సాహిత్య ప్రపంచమున ఇదమిత్థమని తేల్చిచెప్పుట కవకాశములేదు. అదే ఆంధ్ర ప్రదేశమున శతకసాహిత్యము పరిశోధింపబడినది-దీనిలో జిజ్ఞాసువులకు. విమర్శకారులకు కావల్సినంత సహాయము లభిస్తుంది. కన్నడ శతకసాహిత్యమును తాత్సారముతో జూడదగదు, అందులో అంతటి శక్తి గలదు. జీవితమునకు గావల్సినంత జ్యోతీ గలదు

కన్నడమున పదకొండవ (11) శతాబ్ద (శతమానము) లో నాగవర్మాచార్యుని "చంద్ర చూడామణి" శతకము మొట్ట మొదటిదని దెలియుచున్నది, అక్కడినుండి ఇక్కడి వరకు హరిహరాదకవులు మున్నగువారు శతకములను రచించి యున్నారు.



ఆకాశవాణి, దూరదర్శన్ ఆత్మీయ సాంస్కృతిక సమితి వారు '**శతకత్రయ**' కావ్య ఆవిష్కరణ సందర్భ సభలో శ్రీ పండిత పెద్దమఠం రాచవీరదేవరను **డాక్టరేట్. వీరశైవ విద్వన్మణి** బిరుదములతో సన్మానించినప్పటి చిత్రం.



ఆత్మీయ సాంస్కృతిక సంస్థ ఆధ్వర్యంలో సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరిగిన సభలో '**శతకత్రయం**' కావ్య రచయిత డా॥ పండిత పెద్దమఠం రాచవీరదేవరను సన్మానిస్తున్న దృశ్యం. చిత్రంలో జొన్నవిత్తుల లక్ష్మీనరసింహశర్మ, ఆచార్య తిరుమల, ఆచార్య బిరుదురాజు రామరాజు, శ్రీమతి లక్కరాజు నిర్మల, ఓలేటి పార్వతీశం, ఆచార్య ముదిగొండ శివప్రసాద్‌లు ఉన్నారు.



పండిత పెద్దమఠము
రాచవీరదేవర గారు
హైదరాబాదు నగర
ఉస్మానియ విశ్వవిద్యా
లయం నుండి తెలుగు
ఎం. ఓ. ఎల్. పట్ట
భద్రులైననాటి ఛాయా
చిత్రము.



డాక్టరేట్, వీరశైవ విద్వన్మణి బిరుదు ప్రదానోత్సవ సందర్భముగా జరిగిన సభలో శ్రీ పండిత పెద్దమఠం రాచవీరదేవరకు మెమెంటోను అందజేస్తున్న శ్రీ జి.వి. సుబ్రహ్మణ్యంగారు

॥ శ్రీ గురుభ్యోనమః ॥

॥ శ్రీ వీరభద్రేశ్వరాయనమః ॥

శ్రీగురువే మహాగురువె శాంతికళాగురువే శివాత్మ వి
ద్యాగురువే పురాగురువె విశ్వజగద్గురువే విశుద్ధ చే
ష్టాగురువే సుధీగురువె భక్తియశోగురువే ప్రసాద తే
జో గురువే కృపాగురువె మద్గురువే గురువే శివాధవా ॥1॥

ఆవతారిక : ఇట్లు మగ్గెయ మాయిదేవాచార్యుడు సమస్త జన హితోపదేశము కొరకుగాను భక్తి-జ్ఞాన-వైరాగ్య వైభవమును వివరింప నుద్దేశించి తత్ప్రతిపాదకమగు ఈ శతకత్రయమును బోధింప నుజ్జగించి, "యోగురుస్సశివః ప్రోక్తో యశ్శివస్సగురుస్మృతః" అనే ఆగమ వాక్య ప్రమాణము ననుసరించి శ్రీగురువునకును శివునకు శుభముగా భావించి, శ్రీగురువునకు నమస్కార రూపమగు మంగళాచరణమును గ్రంథారంభమునందు గావించి మొట్టమొదట భక్తి ప్రతిపాదకమగు శివాధవ శతకమును, వక్కాణించుచున్నాడు.

నివేచనపూరిత విచారము : ఇట "జయ" అనియు క్రియాధ్యాహారము, ఈవృత్తమున శివాత్మ విద్యాగురువే అను పదము నుండియు ప్రసాద తేజోగురువే అను పదము నుండియు, సుధీగురువే అను పదమునుండియు, భక్తి యశోగురువే అను పదమునుండియు,

సంబంధము గలదు. విషయము, ప్రయోజనము, అధికారమునను, అనుబంధ చతుష్టయమును, సూచింపబడినది. ఇక్కడ లింగ స్థూలాంగస్థల, సంయోగముచే నంబధము గురు, లింగ, జంగమ, పాదోదక, ప్రసాద, పంచకము లేక రూపమనియు, ప్రతిపాదించునదే విషయము, స్వరూప సాక్షాత్కార రూపంబగు మోక్షమె ప్రయోజనము, సర్వాచార సంపన్నుండై, షడర్థ సంగ్రహచరణ గలవాడై, ముముక్షువైన భక్తుడే ఇట "అధికారి" అని ఇవే "అనుబంధ" చతుష్టయము లనబడును.

గురువు తన నాశ్రయించిన వారికి యుపదేశ బలముతో శివ జ్ఞాన సంపదను అనుగ్రహించును. పూజ్యుడైన గురువు శాంతి కళతో గూడినవాడై, లింగాంగసామస్య విద్యను బోధించును. దేవ, దానవ, మానవులందరికి ప్రప్రథమమున నున్నవాడు. సమస్త ప్రపంచమునకు పూజనీయుడు గురువు. నిర్మలమగు ఆచార సమృద్ధియుతుడు, శివభక్తిని వ్యాపింపజేసిన, యశస్సుచేతనలంకృతుండైన గురువు, అధవా శివానుగ్రహము వలన లభించిన అధికమైన తేజోమండితుడైన గురువు, దయాసాగరమూర్తి తండ్రి కన్న మిన్నగా నెన్నబడు గురువు (మాతృదేవోభవ, పితృదేవో భవ, అచార్యదేవోభవ అని వేదము చాటినది) జ్ఞానభక్తికి ప్రభువైన పరశివ స్వరూపుడైన గురువు సర్వోత్కృష్టుడగు గాత "మగ్గెయ" అని గ్రంధకర్తయైన మాయిదేవ శివాచార్యులవారు, తాము ప్రారంభించిన గ్రంథము నిర్విఘ్నముగా పరిసమాప్తి యగుటకై భక్తజనుల హితోపదేశమునకై శ్రీగురువునకు

పరమశివునికభేదభావమును గల్పించి స్తుతించి, మంగళాచరణ మును గావించియున్నాడు.

జయ బసవేశ భక్తజనభాగ్య శుభోదయ వీరశైవ ని
ర్ణయ పరమావతార శరణాగత రక్షక బిద్ఘన ప్రభా
మయ జగదాదిదేశిక పురాతన పుంగవ శాంభవైపురా
శ్రయ జయ సోమనాథ జయదేవ జయావిరతం శివాధవా ॥2॥

అవతారిక : ఇక ఆచార్యుడు తన గురువున కభివాదమును సమర్పించినవాడై వీరశైవ సాంప్రదాయ ప్రవర్తకుడైన బస వేశ్వర, చనబసవేశ్వర, ప్రభుదేవవరులను, పురాతనులను, మూడు పద్యములతో స్తుతించియున్నాడు. షట్స్థల సంపదకు, మహత్తునకు, శాంతికళకు, శివాత్మవిద్యకు, ప్రాచీనతకు, విశాల మైన ప్రపంచమునకు, నిర్మల చరిత్రకు, శ్రేష్ఠమైన బుద్ధికుశ లతకు భక్తికి, కీర్తికి, ప్రసాద తేజస్సునకు, అనుగ్రహములకు, నాకు గురువైన ఆచార్యునకు జయము శ్రేయస్సు గలుగుగాక!

ప్ర॥ సం॥ ఆధారముగ : శివభక్తులకు భాగ్యస్వరూపుడయ్యు లోకమునకు శుభంకరమగు తన అభ్యుదయము గలవాడును, వీర శైవాచారమును గావించుటకై యుత్కృష్టమైన అవతారమెత్తిన వాడును, తనకు శరణాగతులైన వారిని రక్షించువాడును, శివజ్ఞాన మనే తేజస్సుచేత పరిపూర్ణుండై, లోకమందంతటికిని, ఆదిగురు వయ్యు, ప్రమధపుంగవుడయ్యు, శివజ్ఞానమనెడు, ఆకాశమే తాను

నివసించే పట్టణమై యుండిన నీవు సర్వోత్కృష్టుడవుకమ్ము, అని పరాశక్తితో గూడిన ఓ స్వామి, స్వయంప్రకాశ స్వరూపుండవైన నా స్వామి, చిచ్ఛక్తి స్వరూపిణియగు పార్వతిదేవికి పతిదేవుడైన, శివస్వరూపుడవైన ఓయీ బసవేశ్వరా! సర్వోత్కృష్టుండవై ప్రకాశించుము. అని యీపై రెండవ పద్యమున కవీశ్వరుడు బసవేశ్వరుని స్తుతియించియున్నాడు. ఇట "ఐపురీశ్వరా!" అను పద వివరణమును "ఐకారః కథ్యతేజ్ఞానె వాగ్భవేగజశిక్షణె" అని నానార్థ రత్నమాలయందు గలదు.

బసవకుమార భాక్తిక పురస్సర షట్స్థల ధీర చిత్సుధా
రసభరితాంతరంగ సకలాక్ష సమర్పిత లింగతత్ప్రసా
ద సుఖవిశేషతృప్త శివయోగ పదైక సమాప్త నీనె ర
క్షిసు గడ జీయ చన్నబసవయ్య కృపానిధియే శివాధవా ॥3॥

అవతారిక : ఇక నాచార్యుడు స్వగురు నమస్కారానంతరము వీరశైవ సాంప్రదాయ ప్రవర్తకులైన శివభక్తులలో అగ్రస్థానమును వహించినట్టి (పురోగాగ్రేసరః నరప్రష్ఠాగ్రతస్సర పురస్సరా) అని నిఘంటువు. "షట్స్థలధీర - షట్స్థల మార్గము నెరింగినట్టి (ధీరోమనిషీజ్ఞః ప్రాజ్ఞః" అని నిఘంటువు) షట్స్థల జ్ఞానమును బోధించునట్టి యాతడెప్పుడైనను, "విద్యాయాంరమతే యస్మాద్వీర ఇత్యుచ్యతేబుధైః అన్నట్లుగా షట్స్థలజ్ఞాన విద్యలో రమించువాడనియు.

టిప్పణి : శ్రీ బసవేశ్వరుని వలన శివదీక్షోపదేశములను బడసి శిష్యుడై, శివ భక్తులలో అగ్రేసరుడయ్యు, భక్తస్థలము మొదల్కొని ఐక్యస్థలమంతముగాగ షట్స్థల విద్యయందు పండితుడయ్యు, శివజ్ఞానామృతము నుండి నిండిన అంతరంగముగల, శివాధవా-చిచ్ఛక్తికి భర్తయైన పరమ శివ స్వరూపుండైన, బసవేశ్వరునకు బుత్రుండవైన, చనబసవేశ్వర నీవు వెంటనే మమ్ము గాపాడుము.

టిప్పణి : శ్రీ బసవేశ్వరుడి నుండి శివదీక్ష ప్రసాదములను బడిసి, శిష్యశ్రేష్ఠుడవయ్యు, భక్తగణములలో నగ్రగణ్యుడవై, భక్త గణములలో నగ్రగణ్యువై, భక్తమహేశాది షట్స్థల విజ్ఞానమునందు పండితుడవై, శివజ్ఞానామృతము చేత, పరిపూర్ణుడవై' సమస్తేంద్రియముల ద్వారాగతమైన సుఖములను ఆయా లింగములకు నివేదించి వాటి ప్రసాదానందమును దాననుభవించుట వలన దృప్తి జెందినట్టి శివయోగ సుసంపన్నుండవై, చిచ్ఛక్తికి భర్తయైన పరశివ స్వరూపుండవైన ఓ ప్రభు! చన్నబసవేశ్వరా! నన్ను రక్షింపుము. అనియు గ్రంథకర్త చన్నబసవేశ్వరుని ప్రార్థించుచున్నాడు.

ప్రభువె మహాగురుప్రభువే లింగకళాప్రభువే చరాఖిద
ప్రభువె శివాత్మవిత్ప్రభువె యోగివర ప్రభువే చిదంగనా
ప్రభువె సదామల ప్రభువె రక్షిసు దేవ గుహేశ్వరాల్లమ
ప్రభువె నిరంజన ప్రభువె మత్ప్రభువే ప్రభువె శివాధవా ॥4॥

టిప్పణి : గురు - లింగ - జంగములను వస్తుత్రయమునకు చేతనమై వాటికి ప్రభువైన నీవు శివతత్త్వము నెరింగిన జ్ఞానులకు

ప్రభువైన వాడ, శివ యోగివరేణ్యా! జ్ఞానశక్తికి భర్తవైన నీవు సదా నిర్మల మనస్కుండవైన ఓ స్వామి! మాయారహితుడవైన ప్రభువా! దహరాకాశమునకు అధీశ్వరుడవైన అల్లమప్రభు! మాస్వామి చిచ్ఛక్తి సతిగా నున్న మహాప్రభు! నన్ను కాపాడుము, అని అల్లమ ప్రభువును ఈ గ్రంధకర్త ప్రార్థించియున్నాడు.

అవతారిక : ఇట్లు ఆచార్యులైన బసవాది పురాతనులను కొనియాడి నూతన పురాతనులను స్తుతించుచున్నాడు.

బసవననొర్మె చన్నబసవణ్ణననొర్మె గుహేశ్వరాల్లమ
ప్రసవ యశోమయ ప్రభువనొర్మె సమాహితమాద భాక్తికం
మనగె పునః పునస్మరిసి కీర్తిసి పాడి భవప్రపంచమం
నుసుళువురయ్య వీరనియమవ్రత-ధర్మవరర్ శివాధవా ॥5॥

తా॥ వీరశైవ ధర్మమునందాసక్తి గలవారు, ఒకసారి బసవేశ్వరుని మరోసారి చన్నబసవన్నను, మరోతూరి ప్రఖ్యాతిగాంచిన అల్లమ ప్రభుదేవుల వారిని, యెల్లప్పుడు భక్తితో ధ్యానించి, కొనియాడి, కీర్తించి, పాడి, జీవిత సాగరమును తరింతురు.

బసవపురాతనర్చరిసి తోరిద షట్స్థలమార్గదోళ్ ప్రవ
ర్తిసుత అనూన భక్తిరతియిం తను విత్త మనంగళం సమ
ర్పిసి గురు లింగ జంగమకె వంచనయిల్లదె మాడి కూడి రా
జిసువ మహాత్మరం నినెపుదే ఘనముక్తిపదం శివాధవా ॥6॥

తా॥ బసవ పురాతనులు అచరించి చూపిన, షట్స్థల మార్గమునందు ఆచరించి కొరవడని భక్తిచేత, గురు లింగ జంగ ములకు తను-మన-దనములను వంచన లేకుండ (నిర్మల మనస్సు చేత) సమర్పించి సేవ యొనర్చి, కలసి మెలసి, యుండు పెద్ద లను, మనసార స్మరించుటె గొప్ప దైన ముక్తికి మూలమైనది.

ఏనెనలుంటు భక్తియ మహాత్మతెయం శృతి శాస్త్ర పంక్తి
"యోగేన వరా" ఎన్నుత్తమళ భక్తియ వైభవమం పొగళ్దు
సన్మానిసితాగి యోగపదదిందుపరిష్ఠ మెనిప్ప భక్తిసౌఖ్యాను
భవైక్యనిష్కళ పదక్కెణె యావ పదం శివాథవా ॥7॥

తా॥ నాలుగు వేదములు, ఆరు శాస్త్రములకంటెను, నిర్మల మైన భక్తి యోగము అవి గొప్ప వైభవముతో గూడియున్నదని, పొగడినవి, భక్తి మహత్వమును వర్ణించుట యసాధ్యము, సాయుజ్య యోగమున కంటేను శ్రేష్ఠమగు భక్తి సౌఖ్యానుభవము నిష్కళతకు నెలవు, మిగత యేవి గూడ ముక్తి పదమునకు సమమైనవిగావు.

భక్తి శివప్రసాద జననీభవనం శివన ప్రసాదవా
భక్తిగె జన్మభూమి విమలాంకుర బీజదవోల్ పరస్పరం
వ్యక్తమిదింతు నోళ్పొడదు తానె నిరంతరమప్ప ముక్తియా
ముక్తియె శుద్ధనిష్కళ నిజైక్యపదం పరమం శివాథవా ॥8॥

తా॥ శివభక్తి శివప్రసాదమునకు మూలము, శివప్రసాదము శివభక్తికి నిలయము (జన్మభూమి వంటిది) బీజాంకుర న్యాయము వలె ఈ రెండును అన్యోన్య సంబంధము గలవి, భక్తి యనునది అదొక యెడతెగని ముక్తి, ఇంక ముక్తి యనునది శుద్ధమైన స్వస్వ రూప సాక్షాత్కారము వంటిది, నిష్కళనిజైక్యపదము.

స్థూలమిదీగ సూక్ష్మమిదు తత్పర సంజ్ఞయిదెందు పేళ్వ
తత్వాళియోళారిగావుదుపలక్షణవీక్షణ సాధ్యమెంతెనల్
స్థూలమనీక్షిపర్ సురరు సూక్ష్మవనీక్షిపరాత్మ యోగిగళ్
మేళనలింగమం శరణరీక్షనుపర్ సతతం శివాధవా ॥9॥

తా॥ తాత్వికులు స్థూల సూక్ష్మ కారణములనగా సకల-సకల నిష్కల-నిష్కళమని మూడు విధములుగా నున్నదనియు వాటిలో, సకలమును దేవతలు, సకల నిష్కలమును, ఆత్మయోగులుగాను, (యోగిపుంగవులు) నిష్కలమును, షట్స్థల శాస్త్ర సంపన్నులు నిరీక్షింతురు కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ, అంతఃకరణములు, ఇష్ట-ప్రాణ-భావలింగములను అరాధింతురు.

ప్ర : వాతులాగమములోని బ్రహ్మవాక్యము "అస్మదాద్య మరైర్దృశ్యం, స్థూలం, సూక్ష్మంచయోగిభిః। తతఃపరంతు యన్నిత్యం జ్ఞానమానంద మవ్యయం వ్యత్రతన్నిష్ఠైస్తత్పరైర్భక్తైః ర్దృశ్యంతద్వ్రతమాస్థితైః॥"

తపద జితేంద్రియత్వద విరాగద యోగద మౌనద వ్రత
ప్రవరద నిత్యకర్మద సమాధియ సంజెయ మంత్రమాలికా
జపద శరీర నిగ్రహద హోమద నేమద తీర్థయాత్రెయా
క్షపిత సమాయ జాడ్యదొళగిప్పనె భక్తిపరం శివాధవా ॥10॥

తా॥ శివభక్తుడు లింగవ్రతమునకు విరుద్ధముగా (ప్రతికూలముగా) నున్న తపస్సుజేయుట, ఇంద్రియనిగ్రహము, వైరాగ్యము, యోగము, మౌనము, మొదలగు భిన్నమగు వ్రతముల ననుష్ఠింపడు, మరియు సమాధి, సంధ్యావందనము, మంత్రము, జపము, శరీరనిగ్రహము, హోమము, నియమము, తీర్థయాత్రలు జేయుటయను, నీమాయా జాడ్యములకు లోనుగాడు.

క్షయిసదె సర్వకామిత సమృద్ధి సమన్విత తత్తదైహికా
శ్రయఘన సౌఖ్యమం బిడదె భోగిసి తత్స్వనిజస్వరూప
నిశ్చయ పదమం శరీరదవసానదొళొంది మహా మహేశ్వరర్
బయసదె భోగ మోక్షపరరప్పుదు చిత్రవలా శివాధవా ॥11॥

తా॥ మహామహేశ్వరులు, తమ కోరికలను అణచివేయగూడదు. ఐహిక, దైహిక, ఘనసౌఖ్యములను విడువగూడదు. లింగమునకర్పించి, వాటి ననుభవించవలెను. అట్టివారికి అంత్యకాలమున స్వస్వరూపము యొక్క నిశ్చయ భావము గలుగుచున్నది.

అర్థించకుండానే భోగ-మోక్షములు లభించును. ఇది మహదా శ్చర్యముగదా!

ప్ర : "స్వేచ్ఛా నిగ్రహిణస్సర్వే-స్వేచ్ఛాచారగణేశ్వరా॥
శివేనసహతేభోగాన్-భుక్త్వాయాంతి శివంపదం॥
అని ఆదిత్యపురాణములో జెప్పబడినది.

ప్రాణముమం శరీరము మనర్థముమం గురులింగజంగమ
శ్రేణిగె కొట్టు తన్ముఖసమాగత కాంతికర ప్రసాద
కళ్యాణ సుఖ ప్రపూర్ణపరిణామవనైదిదవర్గె నిత్య
నిర్వాణపదం బళిక్కు శితవర్గె పరిభ్రమణం శివాదవా ॥12॥

తా॥ గురు - లింగ - జంగములకు ప్రాణము-తను-మన-ధనములను సమర్పించి, దాని నుండి లభించిన శుద్ధ, సిద్ధ, ప్రసిద్ధ ప్రసాదముల ననుభవించి, అనందముతోనిండి, తృప్తి బొందిన వారికి శాశ్వతమైన మోక్షము లభించును. మిగత ప్రసాదము లభించిన వారికి బండి చక్రమువలె తిరుగుట తప్పదు.

కింకర భావమం బలిదు లింగముఖం చరలింగవెందు
నిశ్శంకతెయిం సువర్ణవసనాన్న పురస్సర వస్తు వాహనా
లంకరణంగళం సలె సమర్పిసి వీర శివాగమోక్త
చిహ్నాంకితరాదవర్గె మణివంతుటె భక్తిపదం శివాధవా ॥13॥

తా॥ దాసోహంభావము దృఢపడి లింగముఖమే చర లింగమని గుర్తించి సంశయించకుండ, బంగారము, బట్టలు, అన్నము, వస్త్ర వాహనములను, నాణ్యములను, మనఃపూర్వకముగా సమర్పించి, వీరశైవ శివాగమములలో నిరూపించబడిన లక్షణములున్నవారికి నతమస్తకులగుటే భక్తి మార్గము. భక్తిస్థలము.

పరవధువం పరద్రవిణమం పరహింసెయనై దె దూరదిం
పరిహరిసి స్వదేశిక నిరూపితమప్ప షడర్థ సంగ్రహ
చరణెమొ శేకలింగ నిజనిష్ఠె సమాహితమాదూడంతదే
పరమ మహేశ్వరస్థలద లక్షణవృత్తిపదం శివాధవా ॥14॥

తా॥ పరస్త్రీ, పరధనముల నాశింపక, పరులను హింసించకుండ ఉండుట, తన గురుదేవుడుపదేశించిన, జ్ఞాన,-జ్ఞేయ-అనుష్ఠేయ అధికార-సాధన-సాధ్య-అనునీ షడర్థ సంగ్రహములలో సదానిరతుడై ఏకలింగనిష్ఠా పరుడైయుండునదే శ్రేష్ఠమైన మహేశ్వర స్థలమార్గము.

లింగ ముఖార్పణీయవహ సర్వవిశుద్ధ పదార్థజాతమం
స్వాంగ వచో మనఃకరణ కాయక వాచికా మానసక్రియా
సంగత సావధాన సువివేకదినర్పిసి తత్ప్రసాదమం
పింగదె భోగిపల్లి బళికా స్థలసిద్ధి దిటం శివాధవా ॥15॥

తా॥ త్రివిధ మరియు షడ్విధ లింగములకు సమర్పించుటకుచితమైన పడిపదార్థములను తన యొక్క త్రికరణముల చేత అర్పణము, అనుసంధానము, అవధానములతో క్రమక్రియల చేత సుజ్ఞానముతోడను, సమర్పించి, అట్టి ప్రసాదమును విడువకుండ అనుభవించినట్లయితే, తప్పకుండ ప్రసాది స్థలము సిద్ధించును, ప్రసన్నత గూడ ప్రాప్తించును.

**ఆణవ మాయ కార్మిక మలత్రయ సంగతి దూరమాగి ని**
**ర్వాణ పదైక హేతువహా సద్గురునాథ నిజోపదేశదిం**
**ప్రాణద లింగద స్థితి సమంజసమాగి సుసాధ్యమాదొడా**
**ప్రాణవె లింగమాద పరమస్థళసిద్ధి కణా శివాధవా** ॥16॥

తా॥ ముక్తికి ప్రధాన కారణము, మూలచేతనము అగు శ్రీగురునాథుని చేత వేద - మంత్ర - క్రియాదీక్షలనుబడసి అనుక్రమముగా ఆణవ మాయా, కార్మికములను, మూడు మలములను బోకార్చి, ప్రాణలింగము యొక్క ప్రజ్ఞను సమంజసముగా సాధ్యమైనప్పుడు ప్రాణమే లింగమగును. అట్లయిన అతడే ప్రాణలింగి యనబడును. అది పరమ స్థలసిద్ధి. ఇందుకు ప్రమాణము "ప్రాణేష్వంతర్మన సోలింగమహుః" అని బృహదారణ్యకములో ఉక్తమైనది.

పంచవిధేంద్రియప్రకృతి సంగసుఖం తనగెంబ బుద్ధియం
వంచిసి లింగవే పతి తదీయ మహాసతి తానెనిప్ప ని
ర్వంచకభావమం బలిదు చిత్పరిణామ పరానుభూతియిం
దం చెరిసల్కెవిశిష్ట శరణస్థలసిద్ధి కణా శివాధవా ॥17॥

తా॥ శ్రోత్రాది పంచేంద్రియములనుండి ప్రాకృతికముగ గలుగు శబ్దాది విషయసంగ సుఖమును తన కోరికయని భావింపక "తానే సతి. లింగమే పతి"యని భావించి, నిర్మల మనస్కుడై కపటము లేక, తనయొక్క విచారము దృఢపడి, చిత్పరిణామమగుపరాను భూతిచేత గూడి చరింపనుత్కృష్టమైన శరణస్థల సిద్ధియగును.

తనగవసానభూమి శివలింగమదక్కవసానభూమి తా
నెనిసి బహిఃప్రపంచరచనాక్రియెయం నెరె బిట్టు చిత్పరా
జ్ఞానుభవదిందహం త్వమితి శబ్ద విభేదవడంగి తోడ్పడా
తనె పరమైక్యనిష్కళ మహాస్థలయుక్తి పదం శివాధవా ॥18॥

తా॥ తనకు అవసాన భూమి శివలింగము, శివలింగమునకు దానుగా స్థిరపడుటకు స్థలమని దెలిసి, బాహ్య ప్రపంచపు వ్యవహారములకు దూరముండి చిత్పరమగు, సూక్ష్మమైన, అనుభవముచేత, నేను-నీవు, అంగలింగమను భేదములేని వాడే నిరతిశయమగు నిష్కలమగు మహ ఐక్యస్థలమును దెలసికొని అచరించువాడే "ఐక్యస్థలి" యనబడును.

ఆచరణాదిలింగ గురులింగ శివాహ్వయలింగ జంగమా
ఖ్యోచితలింగ నిర్మళ నిరర్గళ నిశ్చల ముక్తిద ప్రసా
దాచళలింగ నిష్కళ మహాఘనలింగ మయేంద్రియ ప్రభా
సూచిత షట్స్థలాత్మక శరీరధరం శరణం శివాధవా ॥19॥

తా॥ ముక్కు-నాలుక-కండ్లు-చర్మము-చెవి-హృదయ ములలో క్రమము ననుసరించి ఆచారలింగము-గురులింగము-శివ లింగము - జంగలింగము - ప్రసాదలింగము - మహాలింగములను ధరించి, అట్టి లింగముల ప్రభావముతో ప్రకాశించునట్టి షట్ స్థలాత్మకమగు శరీరమును దాల్చిన (బొందిన) వాడే శివ శరణుండనబడును.

భాక్తిక ముఖ్య షట్స్థల సమాచరణామలయోగ మార్గ సం
ప్రోక్త విచారసార పరిణాను మహత్తర సౌఖ్య సిద్ధియుం
ముక్తిపదం స్వభావపదమాగి విరాజిపనయ్య సద్గురు
ప్రోక్తరహస్యవాక్య పరమార్థవిదం శరణం శివాధవా ॥20॥

తా॥ తన సద్గురువు చేత పరమార్థ రహస్యమును దెలిసి కొనిన "శివశరణుడు" భక్తాది అరుస్థలముల ఆచరణచేత గలిగిన నిర్మలమైన శివయోగము యొక్క విచారసార పరిణామ మహత్తర సౌఖ్యసిద్ధిని బొందువాడు మరియు సహజ ముక్తి యందు ప్రకాశించును, అనగా జీవన్ముక్తుడై విరాజిల్లుచున్నాడు.

పరమ షడంగయోగ నిరవద్యనిరర్గళ మార్గదోళ్మనో
హారవహ నైష్ఠి కాచరణె శంకెయనోందదె సమ్యగు త్తరో
త్తరకణయంగళోళ్ సలె సమాహితమాగి విరాజిసిర్పదోం
దరిదె గురూపదేశ వచనానుభవాగమదోళ్ శివాధవా ॥21॥

తా॥ తనయొక్క గురుదేవుని యుపదేశమును బొంది అనుభవముచేత ఆగమశాస్త్ర మార్గమున శ్రేష్ఠమగు షట్స్థల శివయోగ సాధనములో దోషరహితము, నిరంకుశము, సంశయ రహితమైన నైష్ఠికాచరణమే శివశరణునకు సమకూరునది ఒకటి ఆశ్చర్యకరమైన విషయమేమికాదు ఉత్తరోత్తర స్థలములందు సాధకుడు సంసిద్ధుడై విరాజిల్లుచుండును.

గౌరవలైంగికాది నియమవ్రతధర్మవెనిప్పదర్పణ
ద్వారది నిట్టినల్ మిగె పరిస్ఫుటమాద నిజస్వరూప వి
స్తారమతీవ శోభెవడెదున్నతియిం ప్రతిబింబిసుత్తమి
ర్పారమణీయభావవె కణా పరతత్త్వపదం శివాధవా ॥22॥

తా॥ తనను వదలి పరతత్త్వములేదు, అట్టి పరతత్త్వమును పీడివేరేదర్శనము లేదు. తన గురు-లింగముల వ్రతధర్మముల కంటెను వేరొండు దర్పణములేదు. ఈ కైపిడి (చేతియద్దము)లో తన స్వరూపమును జూచిన యెడల యత్యంతముగా (అధికముగా) అభివృద్ధిగాంచిన కాంతిగలదై ప్రతిబింబిత

మగును. అట్లు ప్రతిబింబమును దాల్చి తన కగుపడు నా సౌందర్యమే శివతత్త్వమనబడును.

ముకురవనీక్షిపంగనెయ బుద్ధియదేం వరరూపహావభా
వకలితవిభ్రమాప్త నిజమంగళ మూర్తియనీక్షిపల్లియో,
ముకురవనే నిరీక్షిపెడెయెల్లియో ? తన్ననె నోడ్పశైసె లైం
గికనియమార్చనానుభవదర్పణదోళ్ శరణం శివాధవా॥23॥

తా॥ అద్దమును జూచునట్టి సౌందర్యవతి తన కోరిక మేరకు, తన అందచందములతో గూడిన దన శరీరమును జూచుటయందు నిమగ్నత (ఆసక్తి) యున్నదేగాని అసలు అద్దమును దిలకించుటయందులేదు, అదేమాదిరిగా శివశరణుడు తనయొక్క లింగార్చనానుభవమనేడు అద్దమున తనను దానె జూచును, స్వస్వరూపసాక్షాత్కారమే అర్చనానుభవము యొక్క ఉద్దేశము.

నోడద మున్న దర్పణద భావమదుంటువిభ్రమం
గూడి విరాజిసుత్తఖిముఖాస్పదమాద నిజస్వరూపమం
నోడిద నంతరం మరళి దర్పణభావమదుంటె తత్త్వమం
నోడద మున్న మాయె బళికెల్లియ మాయెబిడా శివాధవా॥24॥

తా॥ అద్దమును జూడకన్న మొదలు అద్దముయొక్క భావముండును, దానిని జూచిన పిదప తనయొక్క స్వరూప

ప్రతిబింబముండునే గాని యద్దమనెడు భావముండదు. అదే మాదిరిగా తత్వమును దెలియని మొదలు మాయ యుండును గాని, తెలిసిన పిదప మాయకవకాశముండదు. (సచలింగం సచ క్రియా)

భాక్తికవే మహేశ్వరమహాస్థల మాస్థలవే ప్రసాద సం
యుక్తి విశారద స్థళమదే ఘనజీవకళాత్మలింగ భా
వోక్త నిజస్థళాఖ్యమదు తానె లసచ్ఛరణ స్థళత్వమా-
ముక్తి విశిష్ట దివ్య శరణస్థళమైక్యపదం శివాధవా ॥25॥

తా॥ షట్‌స్థలములనోన్యములుగా భిన్నమైనవిగావు, ఒక దానిలో మరొకటి సంధింపబడియున్నవి. "భజించి భక్తుడైన వాడే ఆచరించి మహేశ్వరుడగును. అట్టి మహేశ్వరుడే మనో నైర్మలముచేత ప్రసాది యనబడును". అతడే ఘనజీవకళా త్మకలింగ జ్ఞానముచేత ప్రాణలింగి యనబడును. అతడే సతి పతి భావముతో శరణుడనబడును. ఆ శివశరణుడే సమరస భావముచేతనైక్యుడనబడును.

స్వపచన దైవదంతరమనోర్మె విచారిసి నోడెలోకదొళ్
శ్వపచనె బల్లలా జనద బుద్ధిగె దైవమనోల్దు ముట్టిద
ల్లి పరమ శుద్ధతా స్మరణెయిల్లద శుద్ధ నలేపభావమా
శ్వపచన తట్టుముట్టినెడెయల్లియొబర్పుదరిం శివాధవా ॥26॥

తా॥ జనులు (ప్రజలు) దేవతను ముట్టి పవిత్రుల (పునీతుల) మైతిమని భావించరు. ఐతె చండాలుని (అస్పృశ్యుని) ముట్టి మైలపడితిమందురు. విచారింపగా దేవుడికంటేను అస్పృశ్యుడే అధికశక్తి గలవాడిగా దోచుచున్నది. కారణమేమనగా దేవుడిని ముట్టగానే పరిశుద్ధుడనైతిననె భావనగలిగి వృద్ధి జెందవలెను. ఏలనన దైవశక్తి గొప్పది. నిత్యశుద్ధము, సత్యసిద్ధము

వ్రత నియమోపవాస విధిముఖ్య సమస్త విధాన సత్క్రియో
చిత వివిదాగమాచరణనోశ్పెడే లింగవిహీనరాదవ
ర్గతిశయ ధర్మమల్లదె సదా శివలింగ సమాహితర్గె ని
శ్చితవహ ధర్మమల్ల పరమార్థనిరుపణదిం శివాధవా ॥27॥

విచారించగా వ్రతము నియమము ఉపవాసము మొదలగునవి విధి విధానములు శివిలింగమును ధరించిన వారికి యుత్కృష్ట (శ్రేష్ఠమైన) మైన అథవా ఆచరించదగిన ధర్మములు, కావున యెల్లప్పుడును శరీరముపై శివలింగమును ధరించిన వారికి నియమ మనవసరము, కట్టడి (నెమములేదు) ఇదేవీరశైవ ధర్మము యొక్క పరమార్థ నిరూపణము (రహస్యమును దెల్పునది) నిశ్చితముగా లింగాంగులు ఇతరములైన వ్రత నియమ ఉపవాసాదులను ఆచరించవలదు.

ಆದೋಡೆ ನಿಲ್ಲು ತೀರ್ಥಜಲಮಜ್ಜನ ಮುಂಡನ ದಂತಧಾವನಾ
ಚ್ಛಾದನ ಧೌತ್ರ ದೇಹ ಪರಿಶುದ್ಧ್ಯುಪವಾಸ ಸಹಸ್ರ ಪಾರಣಾ
ಪಾದಿತ ನಿತ್ಯಕರ್ಮವಿಧಿ ನೋಳ್ಪೊಡೆ ಮುಂಡೆಗೆ ಯೋಗ್ಯಮೈಸೆ ಮು
ತ್ತೈದೆಗೆ ಯೋಗ್ಯಮಲ್ಲ ಸತತಂ ಪತಿಭಕ್ತಿಯಿರಲ್ ಶಿವಾಧವಾ ॥23॥

ತಾ॥ ಮುತ್ತೈದುವಕು ಎಟ್ಲುಗಾ ಪತಿಧರ್ಮಮೇ ನಿತ್ಯಮೈಯುಂಡು
ನೋ ಅಟ್ಲೇ "ಶರಣಸತಿಕಿ ಲಿಂಗಪತಿಯನು" ಆಚರಣಮೆ ಅತ್ಯಂತಾ
ವಶ್ಯಕಮು ಮುಂಡ ಮೊಪುದಿ ಚೇಯುನಟ್ಲುಗಾ ತೀರ್ಥಯಾತ್ರಾದಿ ವ್ರತಮು
ಲು, ಮುತ್ತೈದುವಕು ಅನವಸರಮು. ಓ ಕರ್ಮವಾದಿ! ಯಿಪ್ಪುಡು ದೀನಿ ಕೇಮಿ
ಸಮಾಧಾನಮು (ಶರಣಸತಿ ಲಿಂಗಪತಿ) ಯನು ಭಾವಮುನ್ನ ವಾರಿಕಿ
ವೈದಿಕ ಕಾಮ್ಯಕರ್ಮಲನವಸರಮು.

ಅರಿಸಿನ ಗಂಧ ಚಂದ್ರ ಕಚಮಾಲ್ಯ ವಿಲೇಪನ ವಸ್ತ್ರಭೂಷಣೋ
ತ್ಕರ ರಚನಾ ವಿಲಾಸಮಯ ಶೋಭೆ ವಿಚಾರಿಸೆ ಗಂಡಸುಳ್ಳ ಚೆ
ಲ್ವರಸಿಗೆ ಯೋಗ್ಯಮೋ ಬಣಗು ಮುಂಡೆಗೆ ಯೋಗಮೋ ಲಿಂಗಸಂಗತ
ತ್ಪರಶರಣಂಗೆ ಸರ್ವವಿಧ ಭೋಗಸುಖಂ ಪೆರತೇಂ ಶಿವಾಧವಾ ॥29॥

ತಾ॥ ಪಸುಪು, ಚಂದನಗಂಧಮು, ಚಂದ್ರಮು, ಪುಷ್ಪಮು ಮೊದ
ಲೈನವಿ ಭರ್ತಯುನ್ನ ಅಂದಗತ್ತೆಯೈನ ಮುತ್ತೈದುವಕು ಯೊಗ್ಯಮೈನ
ವೆ ಕಾನಿ ಮುಂಡಮೋಪಿನ (ಭರ್ತಚನಿಪೋಯಿನ) ಮುಂಡಕು ಶೋಭಿಂಚವು
ಗದಾ! ಆದೇರತಿಗಾ ಎಲ್ಲಪ್ಪುಡು ಲಿಂಗಸಾಂಗತ್ಯಮುನ ಉಂಡೆ ಶರಣ
ಸತಿಕಿ ಸರ್ವವಿಧ. ಭೋಗಸುಖಮುನು ಅನುಭವಿಂಚೆ ಹಕ್ಕುಂಟುಂದಿ.
ಶಿವಶರಣುನಕು ಸಕಲೇಂದ್ರಿಯಮುಲಂದುನು ಲಿಂಗಮುಲಮರಿ (ಅಳ
ವಡಿ) ಯುಂಟವಲನ

భ్రమిసదెమాణ్బరే బయల బొమ్మద హమ్మిన బిమ్మ హత్తివి
శ్రమిసువ బేదమం తిళియలొల్లదే యోగిగళెందు దృష్టయో
గమెనిపలింగధారణ సమర్చన చింతన నిశ్చిత క్రియా
శ్రమ శివదీక్షేయిల్లదిహ మత్తజ-ర్ భవదొళ్ శివాధవా ॥30॥

తా॥ దృష్టయోగమే లింగయోగమనబడును. దీనివలన ధారణము - అర్చన - చింతనాది సత్క్రియలకు అవకాశముంది. భ్రమకు, (భ్రాంతికి) స్థానము లేదు ఎలాంటి యధారము అంతు స్వరూపములేని (ఆకాశమున సంచరిస్తు) శూన్యము వెంటబడి తిరుగుట వృధా ప్రయాసమే అగును, అట్టివారికి భవము తప్పదు. భ్రాంతివీడదు, అకాశవస్తు (శూన్యవస్తు) అదృశ్యమైనది. దాని యోగము గూడ సంభవించదు. అట్టివారు యోగులనబడరు.

దృష్టద లింగధారణసమర్చన చింతనమిల్లదాగమ
భ్రష్టరిగంతరానుపమ చిద్ఘనరూప మహాత్మలింగమ
స్పష్టమదృశ్యమధృవమ పూజ్యమగోచర మిష్టలింగ ని
ర్దిష్ట బహిష్క్రియా వరరిగంతర సిద్ధిదిటం శివాధవా ॥31॥

స॥ దృష్ట లింగమగు నిష్టలింగధారణము, అర్చన-ధ్యానములను ఆచరించని యోగమ (భ్రష్టులకు ఉపమాన రహితమైన సమ్యక్ జ్ఞాన స్వరూపమగు అంతరంగము యొక్క ప్రాణలింగము అభివ్యక్తముగా నెరదు. ప్రత్యక్షముగాదు, సుస్థిరపడదు, పూజించుటకర్హమైనదిగాదు, మనస్సునకు గోచరించదు, ఇష్టలింగపూజకులకు మాత్రమే ప్రాణలింగముసిద్ధించును.

కనసినొళొర్వనింద్ర వదభోగవిశిష్టసుఖానురాగదిం
ఘన పరిణామియాగిరుతిహాన్న బళొయ్యనె నిద్రె తీరె ము
న్నిన పరియంతె తేనిహ దరిద్రతెయం నెరె కండు దుఃఖదిం
పునరపి నిద్రెగెయ్యలదు తప్పదెఒప్పదె పేళ్ శివాధవా॥32॥

తా॥ ఒకడు స్వప్నమునందు ఇంద్రసుఖము (స్వర్గ సుఖము) ననుభవించుచుండగనె మధ్యన మెలకువవచ్చును, సరే అతడు మొదటిలాగనె కడుదరిద్రుడయ్యేయుండును, వ్యసన పడును, మరల పరుండి నిద్రబోయిన యెడల ఆ ఇంద్రుడుండే స్వర్గసుఖము ననుభవించె స్వప్నసుఖము ననుభవించవచ్చునా? అదేవిధముగా ఇష్టలింగములేనిదే ప్రాణలింగముయొక్క విజ్ఞానము అళవడదు. దృష్టమునుండే అదృష్టసుఖము సాధ్యము.

చిరసుఖి జాగ్రదొళ్ నెరె మనోరమెయప్ప నిజప్రియాంగనా
సరస రతి ప్రసంగ పరిణామదొళిర్ప్పనెగం తదీయ ని
ర్భర సుఖ తృప్తి సుప్తి యెడెంగొడిరల్లియ వేధయిందమా
పరియేదిటం ప్రబుద్ధతెయొళంతుమదే సహజం శివాధవా ॥33॥

తా॥ జాగ్రతావస్థలో తన ప్రియరాలితో సరససల్లాపములాడి ఆనందించువాడు రాత్రి సమయంలో నిద్రబోతు స్వప్నములోను తన ప్రేయసియొక్క రతిసుఖాన్ని బొందును. సంస్కార బలముతో మరల మేల్కొనినప్పుడును ఆనందముతో యుండును.

అట్లే జాగ్రతావస్థలో దృష్ట, ఇష్ట లింగధారణము, అర్చన - ధ్యానాది సంస్కార బలము వలన ప్రాణలింగ జ్ఞానియగుట సాధ్యము. ఇష్టలింగ సత్క్రియోపచారములు లేనిదే ప్రాణలింగ సంబంధము చేత సుజ్ఞానియైతి ననుకొనుట అది స్థిరమైనది గాదని యభిప్రాయము.

ಗೋವಿನ ದೇಹದಲ್ಲಿ ಘೃತಮಿರ್ದೊಡದೇಂ ಫಲ ಮಾತ್ಮ ರೋಗವಿ
ದ್ರಾವಣ ಪೋಷಣ ಪ್ರಬಲ ಶಕ್ತಿ ಬಹಿರ್ಗತಮಾದೊಡಲ್ಲ ದಿ
ಲ್ಲೀ ವಿಧದಿಂ ಶಿವಂ ಸಕಲಜಂತು ಶರೀರದೊಳಿರ್ದು ನಿರ್ದೊಡೇಂ
ಪ್ರಾವಣ ಶಕ್ತಿ ಬಾಹ್ಯಸಮುಪಾಸ್ತಿ ಯೊಳೈಸೇಕಣಾ ಶಿವಾಧವಾ ॥34॥

తా॥ ఆవు దేహమున నెయ్యి యుండిన నేమి ప్రయోజన కారియగును? ఆ ఆవుయొక్క పాలను బిదికి, మరగగాచి, అందు తోడు (మీగడ) వైచిన మజ్జిగను మథించిన వెన్న వచ్చును. అట్టి వెన్నను గాచిన నెయ్యి యగును. దానిని మందుతోబాటు మిశ్రమం గావించి లేపించిన ఆ గోవుయొక్క రోగము తగ్గుతుంది. అదే విధముగా ఆ పరమశివుడు సమస్త జీవులయందున్నవాడు, అట్లుండిన ప్రయోజనమేమి? బాహ్యోపాసన కుపయోగ పడనిదే, అంతరిక పోషణ జరుగదు. అనగా బాహ్యాధారణలేనిదే అంతరికమైన ధ్యాన జ్ఞానాదులు అలవడవు. విశేషప్రమాణము "గవాంసర్పిశ్శరీరస్థం - నకరోత్యాత్మపోషణం" నిస్సృతం కర్మ

రచితం-పురస్తాసాంతు భేషజం॥ అనునది శివరహస్య ప్రమాణ ముంది.

ఒళగే ఘృతస్వరూపమిరె భావమదేం బహు సాధన క్రియా
బళవశమాగి గోవిన కళేవరదం పొరమట్టు తానె ని
శ్చళ సుఖసిద్ధద ప్రబల భేషజమాగిహవోల్ స్వకాలత్తరా
మళ శివలింగమీ పరి బహిష్కరినల్ శుభదం శివాధవా ॥35॥

తా॥ గోవు దేహములోనే క్షీరములున్నను అవి యక్కడే ఉన్నందున ఔషధమునకు ఎట్లు ఉపయోగపడవో॰ మరియునాగోవు రోగముతగ్గదో? అట్లె మనలోనడిగియున్న చేతనము గూడ మన ఉద్ధారమునకు ఉపయుక్తముగానేరదు, దానిని గురుదేవుడు క్రియా మంత్ర వేదాదీక్షాత్రయములవలన బయటకు వెలువరించి కరస్థలమునకు అనుగ్రహించియారాధింపజేసిన యెడల మనకు హితముచేకూర్చగలదు.

కొష్ఠదొళిర్ద వహ్ని మథనోద్భవదిం తలెదోరిదల్లి తత్
కాష్ఠద భావముంటె? బళికాత్మనొళిర్ద పరాణులక్షణా
ధిష్ఠితలింగమాదిగురు సంస్కృతియిం తలెదోరిదల్లి త
న్నిష్ఠ రమాత్మ లేపపళు భావమదుంటె బిడా శివాధవా ॥36॥

శ్లో॥ యథాకాష్ఠోద్భవవహ్నిః కాష్ఠమేవ వినిర్దహేత్।
తథాకర్మోద్భవంజ్ఞానం-కర్మైవప్రవినాశయేత్॥

అని విశేషార్థమునందుగలదు.

తా॥ కట్టెలలో నణగియున్న అగ్నివాటి పరస్పరరాపిడి వలన వాటిలో నున్న అగ్ని బహిర్గతమగును, అంతటితో నాగక ఆకట్టెలనేగాల్చి బూడిదగా మార్చును. అప్పుడవికట్టెలనే భావనయుండదు, అదే మాదిరిగా అంతర్గతమైయున్న ఆసూక్ష్మ చిత్కళను గురువు తన దృష్టిక్రియారూప సంస్కారము చేత బహిర్గత పరచిదర్శింపజేయును. కరస్థలమునకు జేర్చిమనలో నున్న అజ్ఞానమనెడు పశుత్వమును దొలగించును: అప్పుడు స్థూలము సూక్ష్మముగా మారును.

హొరగోళగాయ్తు నోళ్పొదోళగే హొరగాయ్తు గురూపదేశదిం
హొరగొళగెంబ సంశయమదిల్లదే హొగ్గు విశుష్కకాష్ఠదోళ్
మరెవిడిదిర్ద వహ్ని హొరగాదొడే తానోళగాయ్తు కాష్ఠమొం
దరొళరదొందడంగె హొరగిల్లోళగిల్ల కణా శివాధవా ॥37॥

తా॥ స్థూలము సూక్ష్మము అంతర్గతము-బహిర్గతమను భేదముండదు, ఎట్టులనగా కాల్చబడిన కఱ్ఱలోపల వెలుపల ఒకే తేజస్సు (అగ్ని) చేగూడియున్నదో అదే విధముగా గురూపదేశమువలన అంతర్గతమున - బహిర్గతమైయున్నది. అంతర్గతమైయేకముగా నగుపడును ఇందే మాత్రము సంశయముండదు. మొదట రెండుగానున్నది తరువాత నొకటిగానగుపడును, దీక్షా సంస్కారము జరిగిన బిదప లింగభేదము-అంగభేదముండదు.

ఆంతర సాక్షి చిద్ఘనపరాహ్వాయలింగమనాది దేశికం
చింతిసి తందు బాహ్యకరణక్కుపదేశమనొల్దు మాడెను
న్నెంతిరుతిర్దు దంతుభయ సంగ శరీరదొళైక్యమాగి వి
శ్రాంతియనెయ్దు దల్లి బళికేనెనబర్పుదదం శివాధవా ॥38॥

శ్లో॥ అద్వైతభక్తియుక్తస్య-యోగినస్సకలాక్రియా ।
ఆస్తేదగ్ధపటన్యాయాత్త్రియామాంత్రంహినక్రియా॥

అను వీరాగమ ప్రమాణముంది.

తా॥ అనాది గురువు తన యొక్క భావ-మనోదృక్క్రియలతో చిద్ఘన కళను బహిర్గతమొనర్చి చక్షురింద్రియ-హస్తకమలములందు క్రియోపదేశమువలన స్థిరపరచును, మంత్రోపదేశము చేత-మనసు-ప్రాణములతో దృఢపరచును, అంతరంగ బహిరంగముల ఈ రెంటిని లింగమయమొనర్చి యేకముగా మార్చును. క్రియా-జ్ఞానములను నిష్పత్తిగావించి, విశ్రాంతిని గల్పించిన వాడగును, దానిని విపులముగా వివరించుట కష్టసాధ్యమైనది.

నెనెవుదరిం నిరీక్షిసువుదత్యధికం నెనహిం నిరీక్షెయిం
దను దివసం సమర్చిసువుదత్యధికం నెనహిం నిరీక్షెయిం
దనుదివసం సమర్చిసువుదరిం శివలింగమనంగదల్లి సు
మ్మనె ధరిసిర్పుదత్యధిక మత్యధికం నిరుతం శివాధవా॥39॥

తా॥ ధారణ యోగమునకంటే గొప్పదేదియునులేదు ధ్యానము జేయుట కంటెను నిరీక్షించుట అధికమైనది అట్టి

ధ్యానము (మననము-చింతనము) జేయుట కంటెను నిరీక్షించుట కంటేను మిన్నయైనది, ప్రతిదినము పూజించుట యధికమైనది. అట్లు మననము పూజించుటకంటెను మిగుల ఆశివలింగమును యెల్లపుడును దెహముపైయిష్టలింగమును ధరించుటే మిక్కిలి శ్రేష్ఠమైనది.

మననద కాంక్షె దర్శన కళాపరిణామ విలీన మాగి ద
ర్శనద కళాభివాంఛె పరిమర్శన పూజనలీనమాగి పూ
జన పరిమర్శన క్రియెయె సంస్ప్రశధారణలీనమాగి తా
నెనెసిద లింగసంగద గుణం వరమైక్యపదం శివాధవా ॥40॥

తా॥ ఏలనన మననము యెక్క కోరిక చూచి యానందించుటలోను, ఆసుఖములో గలుగును, అట్లుచూచేకోరిక ముట్టి పూజించుటలోను లీనమగును. ముట్టి పూజించునట్టి క్రియాశక్తి ఇష్టలింగధారణమునందును లీనమగును. అనగా పరిపూర్ణత గలిగియుండును. ఆ లింగధారణమే పరమైక్యమునకు మహమార్గమెర్పడును పరిపూర్ణసుఖమునకు భాహ్యలింగధారణమే శ్రేష్ఠమైనది. మరొండులేదు.

ఇదు శివధర్మమార్గమిదు వీరశివాగమ తంత్రదర్థ మిం
తిదు సకల శ్రుతి స్మృతి పురాణ రహస్యద సారభూత మెం
దొదరి గురూపదేశ వచనంగళోడంబడె పేళ్ద లింగసం
గద పరమైక్యమం తిళివుదే ఘనముక్తిపదం శివాధవా ॥41॥

తా॥ ఇట్టి శివలింగధారణమే శివాచారధర్మము, ఇది వీరశైవాగమ సిద్ధాంతము. ఇదె ఈధర్మము యొక్క పరమార్థము ఇది సమస్త వేదశాస్త్ర పురాణముల రహస్యము అని శ్రీ గురు దేవుల వారు ఘంటాపథముగా నుద్ఘోషించియున్నారు, దీనిని చక్కగా దెల్సికొనుటే పరమకైవల్యము పరమైక్యము. ప్రమాణము తంత్రప్రధానసిద్ధాంతె అనినానార్థకోశమున.

గురువచనం ప్రమాణమఖిలార్య పురాతన దివ్య సూక్తిగళ్
నిరవధికం ప్రమాణమమలాగమశైవరహస్య వాక్య త
త్పరమతవే ప్రమాణమను వాసరమంగద లింగదైక్య ని
ర్భరమతవే ప్రమాణ మెరడెబుందు బంధకరం శివాధవా 42॥

తా॥ ఈ లింగధారణమె జీవితము యొక్క సారసర్వస్వమనుటకు శ్రీ గురు వచనమె ప్రమాణము, సమస్త పురాతనుల దివ్యసూక్తులు వెరొండు ప్రమాణము. సమస్త శివాగమములందుండిన శైవ రహస్య బోధకమైన వాక్యగత మతమింకొక ప్రమాణము, అంగలింగైక్యమునందు విశ్వాసముంచి దృఢ నిశ్చయముతో ననుష్టించుచదే పరమ ప్రమాణము, వేరే ప్రమాణమక్కరలేదు. ఒకవేళ అది ఉండినచో అది బంధకమైనది. అదువే అజ్ఞానము.

ఆదిగురూపదేశ వచనార్థమనోర్మె వివేకదృష్టియిం
భేదిసినోడె తత్త్వమసి యెందుదలా వ్యతిరేకబుద్ధి యిం
వాదిసికాణ్బ నిశ్చయమిదేం న్వయమేవ శివాత్మలింగవెం
దోదువుదే నిజైక్యపద సిద్ధిగె కారణీకం శివాధవా ॥43॥

తా॥ అంతటికి అందరికి ఆదిగురువైన శ్రీగురుదేవుడు ఉపదేశించిన వాక్యార్థమేమనగా ఒకసారి వివేక దృష్టితో విచారించి చూచినచెతె ఆపరమ శివుడే నీవైయున్నావు. అని యాదేశించితిరి, కావున శివునకు జీవుడధీనడు ఆదెన్నటికిని అభిన్నుడు, అని చెప్పునట్టి ద్వేతి చూచె నిర్ణయమే ఇట్టిది? లోపల వెలుపల క్రియలేదని చెప్పె అద్వైతి వాదమున పసలేదు. దృక్క్రియాత్మకమైన వాదము తాను శివాత్మకలింగ స్వరూమని గర్తించుట నిజైక్యపద సిద్ధికికారణమగును.

గురుకరుణాళు తత్త్వమసియెందుపదేశిసిదిష్ట లింగమాం
తర శివలింగ ముత్తరపదస్థిత తృప్తి కళాఖ్య లింగమా
గురుచిర తత్పదత్వమితి శబ్దపదాసి పదత్రయం ప్రవి
స్తర గుణనామరూపవిడిదిర్పుదె దీక్ష కళా శివాధవా ॥44॥

అవతారిక : తత్త్వమస్యాది వాక్యములు లింగాంగ సంబంధమునే ప్రతి పాదించుచున్నవని యాదేశించును.

తా॥ కరుణామయుడైన గురుదేవుడు ఉపదేశించిన "తత్వమసి" వాక్యమునందున్న "తత్పదమే ఇష్టలింగము" "త్వం" పదమే ప్రాణలింగము. "అసి" పదమే తృప్తి పదాఖ్యలింగము "తత్త్వమసి" స్వరూపమగు లింగత్రయము నామ-రూప-క్రియలను దెల్సికొనియాచరించుటే దీక్షాసంస్కారము (తత్వమస్యాది వాక్యములు భేదములుగాక కేవలం విశిష్టాద్వైతమునే బోధించును.

అన్యమనన్యమాత్మపదమెంబ తనుత్రయమిశ్రమాగి ని
ష్పన్నమెనిప్ప తత్త్వమసి వాక్యపదార్థమె సద్గురూక్తియిం
భిన్న సమాసరూప పద లక్షణ భావమనెద్దు తోర్పుదం
తన్నొళు తానె నోడె బళికావుద సాధ్యతరం శివాధవా॥45॥

తా॥ అంగ లింగముల భేదాభేద ప్రజ్ఞ అప్రతిమ (అసమాన) మైనది. అన్యమేత్యాగాంగము, అనన్యమే భోగాంగము. ఆత్మపదమే యోగాంగము ఇట్టి తనుత్రయములతో గూడియుండిన మరియు "తత్వమసి వాక్యార్థమనబడిన మరియు శ్రీగురువు యొక్క యుపదేశము వలన భిన్నాభిన్న స్వరూపమైన పదము (శబ్దము) లక్షణ భావమునుదరించి చూపు దానిని తనలో తాను దెల్సికొనిన బిదప ఇకపైన వేరే దానిని దెల్సికొనెడియవసరముండదు. అంగ-లింగ-బోధకమైన తత్వమసి,, మహావాక్యము భేదాభేద స్వరూపమును నిరూపించునది మరియు శివాద్వైతపరమైనది.

విశేషవ్యాఖ్య :- తత్త్వమస్యాది మహావాక్యములు కేవలము బేదపరమైనది గాదు, అబేదపరమైనదిగాదు. భేదాభేద స్వరూపమైన విశిష్టాద్వైతపరిమైనదనే అభిప్రాయము.

తత్పదమన్యమాగి మిగె తోర్పుదరిం బహిరిష్టలింగ ము
ద్యత్ప్రథితాంతరంగ శివలింగ మనన్య పదత్వమర్థ సం
విత్పరిణామ మూర్తి విమళాత్మ పదాహ్వాయ తృప్తిభావ శ
శ్వత్పరమాణురూప ఘనలింగమసి ప్రపదం శివాధవా ॥46॥

**అవతారిక :-** అన్యానన్యాత్మక శబ్దార్థమును సంయుక్తికముగా ప్రతిపాదించుచున్నాడు.

తా॥ క్రియానిమిత్తమువలన తత్పదమ (భేదము) నే వస్తువే బహిరంగమున ఇష్టలింగమైనది, సంవిత్పరిణామ వలన "త్వం" పదమే అనన్యమై సూక్ష్మాంగమున ప్రాణలింగమైనది. తృప్తి భావముగలదై "అసి" పదమె పరమాత్ముడుగా మారి కారణాంగమున భావలింగమైనది.

**లింగమె తత్పదం త్వమితి శబ్దపదం విమశాంగ మాద్విధా**
**సంగమసి ప్రమాణ పదమెందు వివేక పరాను భూతియిం**
**దం గురుపేళ్ల తత్త్వమసి వాక్య పదార్థమనింతు యోజిపా**
**తంగుళిదాగమం బయల మాతిన మాతె కణా శివాధవా ॥47॥**

తా॥ **తత్పదమునకు లింగమనియు** "త్వం" పదమునకు అంగమనియు "అసి" పదమునకు ఆరెంటి సంగమము, పరపదమనియు." శ్రీ గురుదేవుడు నిరూపించినతత్త్వమసి, మహావాక్యార్థమును గురించి, అనుభవమునకు దెచ్చుకొనినయనంతరము, మిగత ఆగమములజ్ఞానమనవసరము. శ్రీ గురుదేవుని వాక్యమే శిష్యునకు పరమప్రమాణము, పరమ ప్రజ్ఞకు గారణము.

విశేషార్థము :- లింగంతత్పదమాఖ్యాతమంగంత్వం పదమీరితం। సంయోగోసి పదం ప్రోక్తం-అనయోరంగలింగయో: (ఇదిశివసిద్ధాంత తంత్రం)

లింగమిదంగరూపమిదు సంగమిదెందు గురూపదిష్టవా
క్యంగళ నోడి తేళి తదనూన సమాన పదంగళం పదా
ర్థంగళ నా ప్రసాద పరిపూర్ణ నిజానుభవోక్త బుద్ధియిం
మంగళమాగి ఖండిసలఖండితనప్పనలా శివాధవా ॥48॥

తా॥ ఇది లింగము, ఇది అంగము, ఇది యీరెండింటి సంబంధము, గురుదేవుడు నిర్దేసించి చెప్పిన వాక్యముల నాలకించి, అభ్యసించి వాటికే విధమైన కొరత వాటిల్లకుండ సరిసమానమైన పద-పదార్థములను వాచ్యార్థ-లక్ష్యార్థములను గుర్వనుగ్రహము వలన లభించిన పరపూర్ణమైన నిజానుభవము యొక్క నిర్ణయముతో మంగలమయముగా నలవర్చుకొనుట వలన స్వరూపముగలుగుచున్నది,

తత్త్వమసేతి వాక్యపదమప్ప మహాఘన మూలలింగ మొం
దే త్రివిధ ప్రభిన్నముఖవాగి లసద్గురుదీక్షెయిం శరీ
రత్రయదోళ్ప్రవర్తిసి విభేదద లీర్కుడే యోళ్ళలిక్కమా
తత్త్వమసీతి వాక్య పదమప్పుదు తప్పదలా శివాధవా ॥49॥

తా॥ తత్త్వమసీతి వాక్యమువలన ప్రతిపాదితమైన మహా గొప్పదైన అమూలలింగమొకటే ఇష్ట-ప్రాణ-భావములని మూడు లింగములుగా నేర్పడి శ్రీ గురుదేవుని శివదీక్షానుగ్రహముతో

నేర్పడిన అంగత్రయములందు సంబంధమైయుండి చివరికి యా భేదమునసమసిపోయి, అమూడేకమైతత్త్వమసి,, వాక్యముయొక్క ముఖ్యార్థముగా మారినది,,

అవతారిక:-ఇట్లుతత్త్వమస్యాది మహావాక్యార్థముల ప్రతి పాదించిన తరువాత కర్మమార్గమగు పూర్వయోగమును ఖండించి ఉత్తర మార్గములైన యోగత్రయమును ప్రతి పాదించు చున్నాడు,

యమనియమాదికాష్టవిధయోగదోళుత్తరభాగ పూర్వభా
గమననుమానదృష్టవిమళ శ్రుత దిందరిదల్లి పూర్వభా
గమనుళిదుత్తరార్ధ శివాయోగ సమాహిత భక్తిసత్క్రియా
శ్రమ పరమార్థమం పిడిదు వర్తిసువర్ శరణర్ శివాథవా॥50॥

తా॥ యమ-నియమ-ఆసన-ప్రాణాయాము-ప్రత్యాహర-ధ్యాన-ధారణ-సమాధి, అనునవి అష్టాంగయోగములనబడును, వీటిలో మొదటియైదు పూర్వభాగమనియు, తరువాత మూడు ఉత్తరభాగమానియు, ప్రత్యక్ష అనుమాన-అగమప్రమాణములతో తెల్సికొని పూర్వభాగమును వదలి ఉత్తర బాగమైన ధ్యాన-ధారణ-సమాధి రూపమైన శివయోగమునందుశాంతి-భక్తి-సత్క్రియలతో పరమార్థపథములో అనగా సహజముగా శివశరణులు అనుష్టింతురు.

ಉತ್ತರಪೂರ್ವಮೆಂಬುಭಯ ಭಾಗಮನಷ್ಟವಿಧಾಂಗ ಯೋಗದೊಳ್
తాత్త్వికమాగి నిశ్చయిసి పేళ్ద గురూక్తిగళల్లి ధారణా-
ది త్రయముత్తరం యమపురోగమ పంచకమీగ పూర్వమి-
న్నెత్తణ మాతు వీరశివయోగ పరాయణరోళ్ శివాధవా ॥51॥

తా॥ ఎనమిది రకములైన యోగాంగములలో మొదటి వైదుపూర్వయోగము, చివిరి మూడు, ఉత్తర యోగములని యు, తాత్త్వికముగా నిర్ణయించి నిరూపించిన గురూపదేశము నందుదృఢమైన విశ్వాసముంచి నడచుకొనిన వీరశైవ శివయోగపరాయణులకు ఉత్తరయోగమే శ్రేష్ఠమైనదిగాని. పూర్వ యోగముగాదు,

అవతారిక:-వీరశైవుడు అచరించవల్సిన ధ్యాన-ధారణ సమాధియనుత్రివిధ శివయోగముల లక్షణములను వివరించు చున్నాడు.

ధ్యానమదంతరంగయజనం బహిరంగద పూజ ధారణం
తానె సమాధియుజ్వలతర ప్రథితార్చన మాత్మలింగ సం
ధాన సమాహితక్రియె యథాక్రమమీపరిమెందు శాంభవ
జ్ఞానది నిట్టిసల్ నిజపదం కరబిల్వఫలం శివాధవా ॥52॥

ఆదాష్టవిధార్చనంకుర్యా దిష్టలింగస్యపూజనం ।
తల్లింగమనుతేయస్తు ప్రాణలింగస్య పూజనం ।
మహోలయంతునిర్లేప - భావలింగస్యపూజనం॥ ఇట్లు శివరహస్య ముంది.

తా॥ వీరశైవులకు ధ్యానమే అంతరంగము యొక్క ప్రాణలింగ పూజయనబడును ధారణమే బహిరంగము యొక్క పూజయగును సమాధె భావలింగము యొక్క అను సంధానక్రియ యగును, అట్టి అనుసంధాన క్రియ వలన యుజ్వలతరమైన కారణాంగ పూజయగును. ఇట్టి క్రమమును శివజ్ఞానముచేత దేల్సికొని ఆచరించుట చేత నిజపదము (మోక్షపదము) అరచేతిలోని బిల్వ ఫలము మాదిరి స్వాదీనమగును ॥

ధ్యానమదిష్టలింగమనహర్నిశముం నెనెవేకనిష్ఠె తద్
జ్ఞాన పరాయణామళ మనోలయమే సుసమాధి తల్లయ
స్థానమెనిప్ప లింగమనారత మంగదమేలె భక్తి స
న్మాన విధానదిం ధరిసె ధారణమెంబ పదం శివాధవా॥53॥

తా॥ రేయింబవళ్ళు ఇష్టలింగమునుస్మరించు బావన యొకటే యుండుటే ధ్యానయోగమనబడును, ఆ ఇష్టలింగము యొక్క జ్ఞానమునందే లీనమై మనస్సును ఐక్యపరచుటే సమాధియోగమనబడును. ఆమనస్సుయొక్క యేకాగ్రతకు ఆశ్రయస్థానమగు ఇష్టలింగమును భక్తిక్రియలడో నాచరించుచు ఎడతెగకుండ శరీరముపై ధరించునదే ధారణయోగమనబడును?

సూనృతమిష్టలింగమమళాంతర జీవక కళాఖ్యలింగమా
హ్వానవిసర్జనాగమ సమాధి వికల్పవిహీన తృప్తి భా
వానుభవ ప్రసిద్ధ ఘనలింగమనీక్షిసె తానె ధారణ
ధ్యాన సమాధిగ త్రివిధ లక్షణ సమ్మతియిం శివాధవా॥54॥

తా॥ సత్యస్వరూపమగు ఇష్టలింగపూజ, అంతర్గతమైన జీవకళయగు ప్రాణలింగస్మరణము. ఆహ్వానవిసర్జనాది బాహ్య క్రియలు లేందే సంకల్ప-వికల్పములులేని తృప్తిభావముగల, అనుభవగమ్యమగు భావలింగమునందు గలిగినచోలయము- ఈ మూడున్నుక్రమముగా ధ్యాన-ధారణ సమాధియబడును,,

ధ్యానమెధారణం విమల ధారణమే సుసమాధియా సమా
ధానమె తానె ధారణమదే వపురంతరమప్ప నిర్మళ
ధ్యాన మివొందనొందు బిడదాశ్రయసిర్ప్పదె యోగమెంబ
సుజ్ఞాన విచారవే గురు సదుక్త్యుపదేశ గుణం శివాధవా ॥55॥

తా॥ అనులోమముగా ధ్యానమే ధారణము, ఆధారణమే సమాధియైయన్నది, మరియు విలోమక్రమముననుసరించి, ఆ సమాధే ధారణము. అట్టి ధారణమె ధ్యానముగా మారును. ఇవి పరస్పరముగా ఒకదానిపై మరొకటి యాధారపడి నిరంతరమా శ్రయించుకొనియుండునదే శివయోగలక్షణము. ఈ రహస్యమును బాగుగాదెలసికొనుటే సద్గురువు యొక్క సదుపదేశము యొక్క ప్రతిఫలముగా భావించబడును.

అవతారిక:-శివశరణుడు సంసారమునందున్నను ఆతనికా సంసార బంధనముండదని, నిరూపించుచున్నాడు.

స్ఫటికమణి స్వభావ విమలం పరమార్థదినీక్షిపల్లి సం
ఘటిసిదుధిపాయిుం మలినవాసనెయాదోడె దోషమేం పరి
స్ఫుటతర చిత్ప్రకాశఘనమూర్తియెనిప్ప శివాత్మ యోగియం
పటు బహిరావృత ప్రచుర సంసృతి పొర్దిదొడేం
శివాధవా ॥56॥

తా॥ స్ఫటికమణి స్వాభావికముగా పరిశుభ్రముగా నుండును, యథార్థముగా విచారించిన యెడల ఉపాధి వస్తువునుండి మలినమైన వేరే రంగుగామారినను (అగుపడినను) అంనుకుదాని దోషము గాదు. దానినిర్మలతకు కొరత వాటిల్లదు· ఆకారణమున అధికమైన చిత్ప్రకాశము వలన గొప్పవాడైన శివాత్మయోగి బహిర్గతముగా సంసార సంబంధము గలవాడైనను దోషములేదు, సహజముగా దాతనికి సంహార బంధము సంక్రమించదు,, అదెట్లనగా ప్రమాణము, సమస్తబగదాత్మాపి-సంవిద్రూపోమహామతిః।

"లిప్యతేనైవ సంసారె-ర్యథాధూమాదిభిర్నభః॥ (ప్రమాణము)

జ్ఞానియో కర్మియో భవియో భక్తనో ముక్తనో శివం
తానో వివేకదిం తిళిదు నోడె మహాఘన లింగయోగియి
న్నెనహానో నిరూపిసువోడానారియేం వరమైక్యతత్త్వ వి
ద్యానిధి తానె బల్లనితరర్గిరియల్పహుదే శివాధవా ॥57॥

తా॥ ఆమహాఘనలింగయోగి, జ్ఞానియో, కర్మియో భవియో, భక్తుదో, బద్ధుడో, ముక్తుడో, శివుడేదానో, విచారింప గానింకేమైయుండునో, చెప్పవీలులేదు (వలనుపడదు) లింగాంగసామరస్యతత్త్వ విద్యలో విచక్షణా దృష్టి గలవారు ఎరుంగునురు (గుర్తింతురు) మిగతవారు గుర్తించరు, నిజజ్ఞాని నిర్లేపుడైయొప్పుచుండును,

అంగమె లింగమింద్రియమె జంగమమెంబ కృతార్థబుద్ధి పా
రంగతమాగి తాత్త్విక విచార వివేకమనెద్ధు నిష్ఠెయిం
పింగదె తద్ద్విధార్పణకళామణి యాగిహ శక్తి దేశికా
పాంగకృప సుధారస పరిప్లుతయుక్త కణా శివాధవా ॥58॥

తా॥ వీరశైవుని అంగమెలింగము, ఇంద్రియములే జంగమము, అనునీప్రౌఢ (ప్రబుద్ధ) బుద్ధిని అధవా పరిణతి జేందిన బుద్ధిని సమగ్రముగా సంపూర్ణముగా సంగ్రహించి, అట్టితాత్త్విక విచారము చేత నిష్ఠదృఢ పడి ఇష్టప్రాణలింగములకు రూపు రుచులను సమర్పించునట్టి కళాశక్తి శ్రీ గురుదేవుని కృపా కటాక్షము చేత స్వీకరించనగును.

ఇంద్రియ మింద్రియ ప్రకరదల్లి మనం మనదల్లి బుద్ధి తత్
సాంద్ర సుబుద్ధియల్లి విషయం విషయ ప్రజదల్లి నందుని
స్తంద్ర నిరంగ నిర్మల నిరావరణత్వమనెద్ధు భక్తియో
గీంద్ర వదప్రసిద్ధ శరణం పరిరంజిసువం శివాధవా ॥59॥

తా॥ శరణుని అంగేంద్రియము-లింగేంద్రియమునందు, మనసు లింగమునందు లింగము మనసునందు, బుద్ధిలింగబుద్ధి యందు, విషయమును లింగవిషయమునందు, లీనమై ఒకే విధమగు శివుడిగా మారియజ్ఞాన రహితుడై కేవలముదైహిక సుఖములకు లోనుగాక ఆవరణ శూన్యుడై నిర్మలముగా నుండును. నిర్లిప్తమైయుండును. శివ శరణుడు భక్తియోగియై శోభిల్లును.

నుడివెడెయల్లి నోడువెడెయల్లి రమిప్పెడెయల్లి వస్తు వం
పిడివెడెయల్లి భోగిపడెయల్లి సుఖంబడెవల్లి దేహమం
బిడువడెయల్లి లింగకళె లింగగుణ ఘనలింగ యోగమా
దొడె బళికా మహత్మననదేనెన ఒర్పుదదం శివాధవా ॥60॥

ఇందుకు వాతులాగమ ప్రమాణము,,
"ఇంద్రియాదాగతంకించి ద్యత్సుఖంతచ్ఛివార్పితం॥
తత్ప్రసాదంచ భోక్తవ్యం-తదింద్రియ ముఖేనచ॥

తా॥ ఆడునపుడు, చూచునప్పుడు, స్త్రీతోరమించునప్పుడు వస్తువులను గ్రహించునప్పుడు. విషయము ననుభవించువేళ. ఆనందానుభూతిలో నున్నపుడు. శరీరమును వీడునప్పుడు. స్వార్థవాసనలేకుండగ లింగకళ-లింగగుణము-లింగయోగము నందునివ్వెర పోయనట్టి మహాత్ముని వర్ణింపశక్యమా ।

త్రివిధ పదార్థమం త్రివిధ లింగముఖార్పితమం గుర్ఱూపదే
శవిధివిధానదిందరిదు మాడి తదీయ పదార్థ జాతవా
స్తవ నిజమప్ప రూపరుచి తృప్తి విశేష మహా ప్రసాదమం
సవిదు తదైక్య సౌఖ్య పదదోళ్మెరెవర్ శరణర్ శివాధవా॥61॥

తా॥ శివశరణులు శ్రీగురూపదేశముననుసరించి. అంగ లింగ ప్రాణభావము, అధవారూపు - రుచి - తృప్తియను త్రివిధ పదార్థములను ఇష్ట=ప్రాణ-భావ-లింగములకు సమర్పించునది గుర్తించి యర్పించి ఆయాలింగములనుండి బొందిన (సమాగతమైన) త్రివిధ ప్రసాదములను సేవించి, యాప్రసాదపరిణామము వలనగలగిన తాదాత్మ్యములో ప్రకాశింతురు. ఇందుకు శివరహస్యము నందలి ప్రమాణము.,

శ్లో॥ ఇష్టలింగార్పితంచాన్నం-ప్రాణలింగార్పితంమనః।
భావలింగార్పితంతృప్తి-రితిభేదంవరాననే,, శివ-రహస్యము॥

శరనిధి రత్నమం ధరిసిదంతె మహానగమౌష ధౌఘమం
ధరిసిహా మాళ్కె లింగమననాదిమయం శరణం స్వభావదిం
ధరిసిహనైసె తన్న మహిమాగుణ వైభవమం ప్రకాశిసల్
శరణన లింగదంతరమనిన్ను విచారివుదేం శివాధవా ॥62॥

అవతారిక:- శివశరణుని లింగ సంబంధముస్వభావ సిద్ధమైనదనియు నిరూపించుచున్నాడు.

తా॥ సముద్రము రత్నములను, పర్వతము గొప్ప యౌషధమూలికలను. ధరించినట్లుగా అనాదిశివశరణుడు తన యొక్క మహిమవైభవమును, ప్రకాశింపజేయు శివలింగమును సహజముగా ధరించియుండును. ఇట్లుండగా శరణాంగ-లింగ ములతారతమ్యమును గురించి విచారించవలదు.

ఎల్లి మనక్కె విశ్రమణమల్లి సుఖం రతియెల్లి నోళ్ళొప్పడ
ల్లల్లియె లింగసిద్ధి ఘనలింగ పదస్థితి లింగపూజె మ
త్తెల్లియు మిల్ల నిశ్చయమిదే పరమార్థ మిదల్లదన్యమ
ప్పెల్లముమాత్మ దుఃఖకరమైసె విచారమదేం శివాధవా॥63॥

తా॥ లింగధారి మనస్సు ఎక్కడైతె విశ్రాంతి బొందునో అక్కడ లింగమునుండి సంప్రాప్తమైనదే సుఖసిద్ధియనబడును. మనస్సు ఎక్కడైతె ఆనంద భరితమగునో. అక్కడే లింగ స్థిరత్వమేర్పడును. మనస్సెక్కడ క్రీడించుచురమించునో. అక్కడడదే లింగపూజగా పరిణమించును. ఇదే నిజమైనది. ఇదే పరమార్థ రహస్యము. మిగిలినదంత దుఃఖము నకవకాశ మేర్పడును దీన్నిగుర్తించదగదు.

(శివసరణుని యొక్క చిత్త విస్రాంతి. శివశరణుని యానందము ఆతనిరతి క్రీడ, లింగసిద్ధి, లింగస్థిరత్వము, అదంతయులింగా ర్చనగానె ఎన్నబడును. ఇందుకు చేరమరాజు, కుమార పాల, గూర్జరరాజు, నింబియణ్ణ, సత్యణ్ణ, వీరేమున్నగువారు, ప్రత్యక్ష సాక్షలు.

ಎಂತಿರುತಿರ್ದೊಡಂತೆ ಶಿವಪೂಜೆ ಶಿವಾರ್ಪಣಮೈಕ್ಯಸಂಪದಂ
ಸಂತತಮನ್ಯಯುಕ್ತಿ ವಿಪರೀತ ವಿಶೇಷಮನೆಮ್ದೆ ಚಿತ್ತ ವಿ
ಭ್ರಾಂತಿಗೆ ಕಾರಣಂ ನಿರುತಮೆಂದರಿದಾಚರಿಪರ್ ಗುರೂಕ್ತಿಯಿಂ
ದಂ ತಿಳಿದಾತ್ಮ ನಿಷ್ಠರೆನಿಸಿರ್ಪ ಮಹಾಶರಣರ್ ಶಿವಾಧವಾ ॥64॥

తా॥ ఆత్మనిష్ఠావంతులైన పెద్దలు శివశరణులు ఎల్లప్పుడె ట్లుండినను, ఏమిజేసినను, అదేశివపూజ. అదేశివార్పణము, అదేశివైక్యసంపద, దీనికితరమైనదంతయు, కేవలము కుహకముతో గూడినది. చిత్తభ్రాంతికిమూలము అని గురువచనము (వాక్యము) నుండిదెలసికొనియాచరింతురు గాక పైన జెప్ప బడిన పద్యద్వయములలో "అభావెభావమాసాద్య-హ్యస్థానెమాచరేత్। ఏతద్వయ పరిజ్ఞానీ - ప్రసాదీసావధానత": ఇట్లు శివ రహస్యప్రమాణము.,

ಅರ್ಪಿತದ ಪ್ರಸಾದದ ಸುಸೂಕ್ಷ್ಮಕಳಾ ವ್ಯವಧಾನಯೋಗ ಮೆಂ
ತಿರ್ಪುದೊವಾಙ್ಮನಕ್ಕನುಪಂ ಗುರುವಾಕ್ಯನಿರೂಪದಿಂ ಕರಂ
ತೋರ್ಪುದನನ್ಯಭಾವ ಮನುಭೂತಿಪದೈಕ ಸುಸಾಧ್ಯಮಾತ್ಮ ವಿತ್
ಕರ್ಪೂರವಹ್ನಿ ಯಂತೆಸೇವ ಲಿಂಗನಿಜೈಕ್ಯತೆಯಿಂ
ಶಿವಾಧವಾ ॥65॥

తా॥ కాయ-కరణ-భావార్పితములు మరియు శుద్ధ-సిద్ధ ప్రసిద్ధ-ప్రసాదముల యొక్క గుప్తకళలను (జ్ఞానమును) వాక్కు మనసునకందని (గోచరించని) అవధానయోగమును

గురువచనోపదేశమునుండి జక్కగా దేల్సి కొనియాచరించి ఆత్మాను భూతిగలవారై అగ్ని కల్పించిన కర్పూరమువలే విరాజిల్లుతు నిజలింగైక్యతతో ననన్యభావంతో ననుభూతిపదైకసాధ్యతనుగనుపరచుటకు ఆత్మవేత్తలకు సులభైక సాధ్యమగును.

(కాయార్పితము-కరణార్పితము-భావార్పితములను క్రమముగా శుద్ధ-సిద్ధ ప్రసిద్ధ ప్రసాదములను స్వీకరించే రహస్యము నెరింగిన శివశరణుడు స్వస్వరూపసాక్షాత్కారమునుండి అగ్ని కర్పూరముల సంయోగమువలె ఒప్పుతున్న లింగాంగసామరస్యమును దెలిసికొన్న వాడేశివయోగి.

**అంగనె తన్న చిత్తరమణంగె మహారతియం ప్రియాంగదా**
**లింగనమం సమర్పిసి తదీయ విశిష్ట సుఖప్రసాదమం**
**పింగదె భోగిపల్లియ కళావ్యవధానద హాగె లింగసం**
**గాంగ సుఖోపభోగవతి సూక్ష్మతరం శుభదం శివాధవా ॥ 66 ॥**

యువతి తన ప్రియతమునకు అధిక ప్రేమతో (రతి క్రీడచేత) ప్రేమకాధారభూతమైన తన శరీరమును అర్పించి, ఆసాంగత్య సుఖమును తప్పకుండ అనుభవించే కళలసుఖము యొక్క హెచ్చరిక వలె అంగ-లింగ సంగసుకోపభోగము అత్యంత సూక్ష్మము శుభ ప్రదములైనవి. దివ్యరసాత్మకమైనది గూడ,,

లౌకికవృత్తియే మరళి భాక్తిక వర్తనమాగి భాక్తికం
లౌకికమాగి తనొళ్ళగె తానెరడిల్లదె కూడి సంశయం
పోకెడెగెట్టు నిందు బయలాద బళిక్కదనేననెందెపెం
వ్యాకులమిల్ల దిర్ప పరమాచరణ స్థితియుం శివాధవా ॥67॥

తా॥ లింగాంగికిలౌకికము వేరేగాదు, భాక్తిక వృత్తి వేరుగాదు. రెండు ఒండుగా మారిన పిదప ఇక సందేహమునక వకాశమే లేదు. చింతకు గూడ అవకాశముండదు. ఈ యత్యుత్తమమైన అచరణవలన బృహదాకాశస్వరూపమేర్పడును. అది మాటలతో చెప్పదగనిదేయగును, దీనినె వాగాతీతమైనదని చెప్పనగును.

ప్రియతమెయప్ప జాయె నిజవల్లభనం రతికేళియొళ్మనం
బయసిద హాగె తర్జన విడంబన గర్హణ తాడనాదియం
నయిసలిదేం విరోధమొ సుఖాస్పదమో శరణం స్వకీయలిం
గయజనదల్లి లీలెవిడిదేననొడర్చిదొడేం శివాధవా ॥68॥

తా॥ ప్రేయసి రతిక్రీడలో మనుస్సుకు వచ్చినట్లుగా తనభర్తను భయపెట్టుట (మందలించుట) పరిహాసమొనర్చుట, దూషించుట, కోట్టుట, మొదలగు చేష్టలన్నియు ఉత్సాహపరచుటకే గాని, వాస్తముగా కలహించుటకు మాత్రముగాదు, అట్లుగానే. శరణసతి-లింగపతి యొక్క పూజలో రతి విలాసమునకై యేమిజేసినను అదంతయు శివపూజ కర్మగానే పరిగణింప

బడును (యాయాచేష్టాసముత్పన్నా జాయతె శివయోగినాం। సాసాపూజనమీశస్య-సర్వదాతద్గతాత్మనాం॥ అని ప్రమాణం॥

అవతారిక:- సహజముగా మహత్వాతిశయముతో, విరాజిల్లుచున్న శివశరణునకు ఉపాధివశము చేత వచ్చిన మహత్వము రుచింపదని యాదేశించుచున్నాడు.

ఇదు శరణంగె లింగకరణంగె చిదాభరణంగె దొడ్డి తా
దుదె బిడు దేవరంతొలిదరింతొశిదర్ నిజరూపదోరిదర్
నదెబడిదర్ విభర్గిసురెమ్మైదొడెదర్ కనసింగె బందర
ప్పిదరొడనిర్ద రెందెనుతె కొర్చువ దుర్వచనం శివాథవా॥69॥

తా॥ దేవతలు నాకు అట్లు (అవిధముగా) ఈ విధముగా ప్రసన్నులైరి. ప్రత్యక్షమైరి, శిక్షించిరి, గద్దించిరి, స్వప్నమునగనబడిరి. ఆలింగనమొనర్చిరి. వెనువెంట (తోడుగా) నుండిరి, అని మొదలగు గాగల వాటిని గొప్పగా జెప్పికొనినను నిశ్చయముగా అట్టివారు గొప్పవారుగారు, వారిమాటలు నమ్మదగినవిగావు, నిజమైనవిగావు. లింగకరణములైన జ్ఞానాభరణుండైన శివశరణునకు ఇదంతా నీ గొప్పదేమియుకాదు, ఈతనికి గురుకరుణాకటాక్షమే, పరమాత్ముని ప్రసన్న శివశరణుడు ఉపాధివశము చేద పొందిన ఆఫలములనన్నింటిని. దిరస్కరించునేగాని గొప్పగాచాటుకొనడు. శివుడు ప్రత్యక్షమై వరమును కోరు కొమ్మని యన్నను, దానిని లెక్కజేయని

(పెద్దగా బట్టించుకొనని) శివశరణురాలు నింబెక్క మున్నగు శివశరణులే ఇందుకు తార్కాణము, (ఉదాహరణము).

దేవరనెత్త బల్లనవరొ త్తిన దిండరనెత్త బల్లనా
గోవరనెత్త బల్లనవరాచెయ గుడ్డరనెత్తబల్ల ను
చ్చావచమప్ప కాళ్ళుడియధంతిరలంతిరలేక లింగని
ష్ఠాపరనప్ప సత్యశరణం మహిమాభరణం శివాధవా ॥70॥

తా॥ లింగైక్యనిష్ఠుడైన శివశరణుడు సత్యస్వానుభవైక శరణుడుగాక సాయుజ్య-సారూప్య, సామీప్య, సాలోక్యములను బడసియున్నానని చెప్పుకునే దేవర్లను (ఇతర దేవతలను) లెక్క బెట్టడు.

బిడు బిడు లింగభక్తనవసానవిముక్తననాది ముక్త నీ
కడు మరులాటదాశికెయ తూళద మేళద మత్త లీలెయా
గడద సమర్థనంతహావనింతహావం ఛలశీలవంతనెం
దడిగడిగుబ్బి కొబ్బి నుడివల్లిగె యోగ్యనె పేళ్
శివాధవా ॥71॥

తా॥ లింగానందపరవశుడైన శివశరణుడు మరణవిముక్తుడు, అనాదిమాయారహితుడు, దృక్క్రియాసమర్థుడునైన శివశరణుడు మాటలమల్లుడుగాడు, ఆతడాడు మాటల మహిమాతి

శయమును జెప్పుకొనెడువాడుగాడు, పట్టుదలగలవాడిని, శీలవంతుడిని, అట్టివాడిని, ఇట్టివాడిని బలుగర్వము తో మతిహీనుడై చెప్పుకొనెడు వాడుగాడు. జనులుతనను మెచ్చుకొనుటకై యాడంబరములబలుకువాడుగాడు.

అరివె సమస్త వస్తు విషయాగమముఖ్య మదే విముక్తిదం
హొరగణ వేషదాచరణె ఖావిహొడేవిధమాదొడేం వృథా
జరెవుదు బుద్ధియే శరణరెంతిహరెంబువ నొల్లు నోడదీ
ఖరితనదుక్తి చాపలద గౌరవదిం ఫలమేం శివాధవా ॥72॥

తా॥ సమస్త వస్తు వివేచనకు (పరిశీలనకు) మరియు ప్రత్యక్షముగా గొచరించుటకు ఆగమప్రధానమైన జ్ఞానమే ఇక్కడ మూలకారణము దానినుండే అజ్ఞానబంధము విముక్తియగును, బహిర్గతమగు వేషభూషల ఆడంబరము చేతకలుగదు. వేషమే విధముగా నున్ననుసరే నిరాడంబరసరల సహజ జీవులైన శివశరణుల అంతస్సత్వమును గుర్తింపమి కేవలము దూషించుట వివేకమైనదిగాదు. అర్థములేనిదే యగును దూషించుట వ్యర్థము అర్థములేని ఉక్తిచాపల్యము యొక్క గౌరవముతో ప్రయోజనముండదు.

క్షుత్తృషె నిద్రయిల్లదవరే పిరియర్ పరిపూజ్యరాదొడీ
క్షుత్తృషె నిద్రెయిల్లదిహ కళ్మర మట్టిగళేం సుపూజ్యరే
క్షుత్తృషె నిద్రెయే కొరతెయల్ల మహత్వగుణక్కె శుద్ధచి
న్మాత్ర పవిత్రగాత్రరన దెంతరివర్ పశుగళ్ శివాధవా ॥73॥

తా॥ ఆకలి దప్పిక నిద్రలేనివారే, గొప్పవారు. పూజనీయులైన వారనిన యెడల. రాయి-చెట్టు-మన్ను ఇవన్నియు పూజనీయములేగదా? కావున ఆకలి-దప్పికలు మహత్వ గుణమునకు ఎలాంటి కొరతవాటిల్లదు. శుద్ధమైన జ్ఞానమువలన ప్రబుద్ధులు-పవిత్రులు, అయిన వారిని అజ్ఞానులు గుర్తింపరు. పూజింపరు (ఆకలి-దప్పికలులేనివారే పూజ్యులు, ఇవిగలిగినచో అపూజ్యులని శివశరణులను నిందించగూడదనే అభిప్రాయ మిక్కడ చెప్పబడినది).

త్వగ్రసరక్త మాంసమయమప్ప శరీరద భావముంటు కం
డగ్రణిగళ్ విచారిసరలాక్షుధె నిద్రె పిపాసెయిర్దొ డేం
వ్యగ్రద మాతదంతిరలి దేహగుణం పరిమాణవల్ల స
మ్యగ్రమణీయ చిత్తినగుణం పరిమాణపదం శివాథవా ॥74॥

తా॥ శరీరము చర్మము, రక్త. మాంసమయమైయున్నది. దీనికి ఆకలి దప్పిక నిద్రలుండుట సహజము, దీనిని దెల్సిన వారు దేహగుణములను లెక్కజేయరు గొప్ప తనమునకు, దేహధర్మమునకు, ప్రమాణములుగావు. చక్కగా శోభించునట్టి జ్ఞానప్రభే ప్రమాణము, చిత్ప్రభయున్నవారు ఎట్లున్నను పరి పూజ్యులే, శివశరణుల గొప్పదనమును నిర్ణయించుటకు ఆదేహ ధర్మము ప్రమాణమైనదిగాదు. అతనిలో ప్రకాశించునట్టి శివ జ్ఞానమే పరమ ప్రమాణమైయున్నది. (శరణునిమహత్వమును

నిర్ధారించుటకు ఆదేహధర్మము ప్రమాణమైనదిగాదు, ఆతనిలోను ప్రకాశించునట్టి శివజ్ఞానమే ప్రమాణము).

అవతారిక:- ఇట్టి విచిత్రభావ పూరితమైన సంపద కేవలము శివదీక్షచేతనే గాక మరో మార్గమున సమకూరదని యాదేశించుచున్నాడు.

మస్తకదల్లి కర్ణపదదల్లి కరస్థలదల్లి దేశిదేక
హస్తసరోజమం పరమమంత్రమునుమం శివలింగమూర్తియం
న్యస్తమనేకె మాడిదనిదేనిదరర్థవిశేషమేంతుటెం
దాస్తిక బుద్ధియిం తిళిదొడాతనె ముక్తనలా శివాథవా ॥75॥

తా॥ శ్రీగురువు శివదీక్షలో శిష్యుని శిరమున హస్తకమలమును కర్ణమునందు పరమ పవిత్రమగు మంత్రమును హస్తకమలమునందు క్రియా లింగమును, ఎందులకను గ్రహించెను? ఎట్లుగా ఆయత-స్వాయత-సన్నిహితముల నళవడజేసెను? వీటియొక్క అర్ధ నిశేషమేమిటి? అని ఆస్తిక్య బుద్ధి చేత మనసునకు బాగుగా దేల్సికొన్నవాడే ముక్తుడగును,,

క్రియే బహిరిష్టలింగమమళాంతర లింగమె మంత్రమాద్విథా
శ్రయ ఘన భావలింగమె మహత్తరయోగమిదం కళేవర
త్రయదొళమర్చి సద్గురు కృపానిధి మాడిద దీక్షెయర్థని
ర్ణయమనుపాయదిం తిళిదొడాతనె ముక్తనలా శివాథవా॥76॥

తా॥ హస్తతలమునకు గ్రహించిన ఇష్టలింగమే క్రియ, అంతరంగమునకు అనుగ్రహించిన ప్రాణలింగమే జ్ఞానమయ మంత్రము, క్రియా-జ్ఞానలింగములకు నెలవైన భావలింగమె మహాయోగమనబడిన వేధా సంస్కారము, కృపానిధియైన శ్రీ గురువు శిష్యునియొక్క అంగత్రయమున జతపరచిన ఈ త్రివిధదీక్షల అర్థ-భావములను నేర్పుమీరగమననము గావించు కొన్నవాడు కృతార్థుడగును.

కారణదేహదీక్షె శిరదొళ్ కరపద్మవనిట్టొడాయ్తు వి
స్తారిత మంత్రమం శ్రవణదల్లి నిరూపిసలాయ్తు సూక్ష్మ శా
రీర పదైకదీక్షె తదుపాధిబహిస్తను దీక్షె లింగమం
సేరిసి కొట్టొడాయ్తు కరదల్లి గురుప్రవరం శివాధవా ॥77॥

తా॥ శ్రీగురు శ్రేష్ఠుడు తనయొక్క అమృతహస్తమును శిష్యుని మస్తకముపై యుంచినదే కారణదేహదీక్షయనబడును. శివమంత్రమును శిష్యుని చెవిలో ఉపదేశించునదే సూక్ష్మశరీరదీక్షయనబడును, ఇష్టలింగమును శిష్యునికరకమలమున కొసగుటే స్థూలతను దీక్షయనబడును, ఇట్లు గురుదేవుడు అనుభవము, జ్ఞానము క్రియలను, అనుగ్రహించును.

(సూక్ష్మ శరీరమునకు చైతన్యముగా మారినదే ప్రధానమైన దీక్షయగును. (పద్యం) వ్యవసితత్రాణ-స్థానం లక్ష్యాం త్రిభువస్తుసంఘ (నిఘంటు),

ఇదు విమళక్రియాభిహితలింగమిదుజ్వలమంత్రలింగమిం
తిదు పరయోగలింగమిదుత త్రివిధాహ్వయలింగపూజె తా
నిదు బహిరంతరాత్మకపదమెంబ తనుత్రయయుక్తియెంధు తో
రిదొడదు వీరశైవదుపదేశమే తప్పదలా శివాధవా ॥78॥

తా॥ ఇది సత్క్రియతో సిద్ధమైన ఇష్టలింగము, ఇది త్యాగాంగ నిష్ఠమైనది, ఇదియుజ్జ్వల మంత్రముతో సిద్ధమైన ప్రాణలింగము, ఇది భోగాంగము. స్వాయతము. ఇది స్పర్శానుభవముచేత సిద్ధమైనది, భావలింగము, ఇదియోగాంగమునకు సన్నిహితమైనది. ఇది యుత్కృష్టమైన యోగము, అర్చన అర్పణానుభవములె త్తినట్టి విధరూపమైన లింగపూజయని గురుదేవుడు చూపితెలియపరచునదే వీరశైవాదీక్షాక్రమమియ్యాదియని యెరుంగునది,,

(అవతారిక:-శరణసతి,లింగపతి, భావమును మాటలతో జెప్పి భిన్న భావములుగలవారిని ఖండించుచున్నాడు.)

సతి శరణం తదీయ పతి లింగమెనుత్తిహ లింగభక్తరా
సతిపతి ధర్మమం తిళిదు నోడదె దూరద దాసభావనం
స్థితియొళె నిందు సంశయ జడప్రతిభాక్రియెయిం బళల్దు ని
శ్చిత పరమైక్యమం తిళియదిర్పరిదేం గుణమో
శివాధవా॥79॥

తా॥ శరణుసతి లింగపతి, అనియాదేశించెకొందరు, లింగ భక్తులు, అట్టిసతిపతి ధర్మమును దెల్సికొని, ఆచరింపక సమరస భావమునకు దూరముగా నున్నదాస భావమునందుండి, సంశయ ము, అజ్ఞానములతో గూడిన జడకర్మములతో వేసర (విసిగి-వేసారి) జెంది నిశ్చితోన్నతమైన లింగాంగ సామరస్యమును దెలియకున్నారు, ఇదిసరియైనదిగాదు దీనినుండి ప్రయోజన ముండదు

శరణనె పత్ని గండ శివలింగవె తత్పతి కండ భూమిగ
చ్చరియెనబారదే నుడిద తీవియొళా నుడి గట్టియాగి వి
త్తరిసిద తాత్వికాచరణయుళ్ళొడె మత్తదు తానె ముక్తి శాం
కరితినబారదే బయల మాతిన బణ్ణమదేం శివాధవా ॥80॥

తా॥ శరణుదేసతి శివలింగమే పతియనుట ప్రపంచము నకే ఆశ్చర్యకరమైనది, నుడివినట్లుగా దృఢమైన సహజాచార ముండినచో అప్పుడదే ముక్తియనే శాంకరి అనగా ముక్తియనే శక్తి అథవా ముక్తిసౌఖ్యములభించును. అట్లుగాక వట్టి మాట లతో నేమిలాభము, పొల్లు మాటలతో పనీయవు తృప్తిగాదు.

కాయముమింద్రియ ప్రకరముం శివలింగకళా ప్రసాద పూ
రాయ పునీత చిత్పరమ లక్షణ భావమనైదిదల్లి దో
షాయతన ప్రపంచగుణమిల్ల విచారిసె దగ్ధవస్త్రద
న్యాయద హంగె తప్పదు గురూక్తినిరూపణదిం
శివాధవా ॥81॥

తా॥ గురుదేవుని యుపదేశము వలన విచారించగా శివశరణుని దేహేంద్రియములన్నియు, లింగకళచేత, లింగ ప్రసాదముచేత, పరిపూర్ణముగా పరిశుద్ధుండై చిత్పరమలక్షణము గలిగియున్న వాడగుటచేత, నాతనిలో దోషదూషితమైన ప్రపంచగుణములుండవు. దీక్షాసంస్కారమును బడసియున్నయా శరీరము కాల్చిన బట్టవంటిదగును, ఆక్కడ బంధనమున కవకాశమేలేదు.

ప్రమాణము :- (అద్వైత భక్తియుక్తస్య-యోగినస్సకల క్రియా। అస్తేదగ్ధపటలన్యాయా-క్రియామాత్రాహినక్రియా।

అవతారిక:॥ లింగమునందు సమరసభావముండిన శివ శరణుడు ఫలపదములకుగారణిభూతమైన, భిన్నక్రియను ఆచరించువాడుగాడు. అనియీాదిగువ పద్యముతో నిరూపించుచున్నాడు.

**పతిహిత ధర్మచారిణియెనిప్ప మహాసతి వేసి మాళ్వవోల్**
**చమరతె రీతి ధాతు కడు జాణ్మె మృదూక్తి బహువచార సం**
**గతియనదెత్త బల్లళు శివైకనమర్పిత చిత్తదిందపృథ**
**వ్రతనెనిసిర్ప భక్తనుశిదంగనెంతరివం శివాధవా ॥82॥**

తా॥ తనభర్తకు హితమైన కార్యాములను జేయునట్టి మహాపతివ్రత. వ్యభిచారి స్త్రీ వలే సౌందర్యము-చతురత, అనేక విధములైన కుబుద్ధితోడను, కుయుక్తులతోను, చురుకైన

మాటలతోను, వివిధోపచారములను కపటపూరిత మాటలతోను ప్రచారము జేయుచున్నను అదే విధముగా శివునికొక్కడికే తన మనస్సు అర్పించిన ధృఢవ్రతమున నున్నభక్తుడు, వేరే కపటాచారముల కరుగడు గొప్ప పతివ్రతవలె శివైకనిష్ఠుడగును.

భవిగడ భక్తనప్పుదదు మిథ్యయలా భవిభక్తనప్పనే
శివశివ భక్తనే భవభవాంతరదోళ్ నెరె భక్తనప్పనా
భవి భవియోగియే భవభవాంతరదోళ్ తిరుగుత్తమిర్ప్పనెం
బ వచనముంటలై శివరహస్యద శాసనదోళ్ శివాధవా ॥౩౩॥

తా॥ తన పతియొక్కనికే, హితమగు కార్యమును జేకూర్చుటలో తత్పరురాలైన మహా పతివ్రత వ్యభిచారిణివలె చాతుర్యము సౌందర్యములతో నలంకరించుకొని యితర పురుషులతో, దిరుగు చెడు నడతగల, వారి చందమున, కవ్వింపు మాటలతో, ప్రీతిగలవారై యుందురా॥ అట్లుగాక శివునకు దన జిత్తము నర్పించి, శివైక వ్రతతత్వము నందు నిమగ్నుడైన శివశరణుడు బహిర్గత ఆడంబరములకు లోనుగాక శివేతరాచారముల ననుష్ఠించునా? (ఆచరించడని అర్థం)

అవతారిక :- (లింగాంగ సంబంధముగల శివశరణులు ఎన్నటికిని, యెప్పుడుగూడ, లింగవిహీనులైన భవులతో గలిసి యుండరు, కనుక శివశరణులు శివభక్తులయ్యే యుందురుగాని భవులుగారు).

భవియుదిరల్లి కుళ్ళిరద ముట్టద నోడద పీరశైనా
భవియనె మత్తె ముట్టనుడిదీక్షిసి భక్తననొల్దు మాళ్పమా
ళవనిద నెత్త బల్లవతిచోద్యవనన్వితవద్భుతాద్భుతం
భువనదొళల్లియం భవిగె భక్తతెయుల్ల ఖిడా శివాధవా ॥84॥

1. ప్రమాణము :- (ఆశనేశయనేయానే భవిభిః సంప ర్కే సహభోజనే। సంచరంతిమహాఘోరే-నరకెకాలమక్షయం)

2. ప్రమాణము:-స్వకర్మపరిపాకేన-ప్రక్షీణమలవాసనః। శివప్రసాదజీవో-యంజాయతె శుద్ధమానసః। శుద్ధాంతఃకరణేజీవె-శుద్ధాకర్మవిపాకతః జాయతేశివకారుణ్యాత్ప్రస్ఫుటా భక్తిరీశ్వరీః అనుసిద్ధాంత శిఖామణివచనానుసారముగా కర్మపరిపాకము చేత, మలవాసన దొల(సమసి)గి పోయి, శివానుగ్రహముఎలన శుద్ధ మనస్కుడైన వాడికి, శివకారుణ్యము చేత, శివభక్తియుత్ప న్నమగును; అట్టి వారికదే చరమ శరీరమగును. ఇట్టి చరమ శరీరముగలవాడు మాత్రమే భక్తుడగుటకు అర్హుడగును. గాని మిగత మలసంవృతులైన భక్తులకు యెన్నటికిని భక్తితత్వము లభించదని భావము,

శివనె శిపార్చనైకరతనాగిరలోనుగ మాత్మలోకదిం
దవతరిసి స్వకీయ ఘనలీలెయొళాయ్యనె మానుషియమ
ప్పవిమళ వేషమం ధరిసి సర్వజగద్ధితదివ్యచేష్టెయిం
తవె పరిరంజిపం పరమభక్తమయస్థళదొళ్ శివాధవా ॥85॥

తా॥ శివుడు తానె శివపూజను జేయవలయునని యపేక్షి ంచి కైలాసమునుండి యవతరించి మానవ రూపమును దాల్చి ఘనమైన (గొప్పదైన) లీలతో సమస్తప్రపంచమునకు హితమును సమకూర్చుటకై గొప్ప మహిమతో శ్రేష్ఠమగు భక్తస్థలమునం దుండి చక్కగా విరాజిల్లుచున్నాడు.

విశేషము:- "యేరుద్రలో కాదవతీర్యరుద్రా-మానుష్యమాశ్రిత్య జగద్ధితాయ। చరంతినానావిధచారుచేష్టా-స్తేభ్యోనమస్త్ర్యం ఒక పూజకేభ్య:॥ అని శంకరసంహితలో చెప్పబడినది. విరూపాస్సంతో బహుధైకరూపా:,, అనితైత్తరీయోపనిషత్తులోను న్నది. మరియు "సర్వలోకోపకారాయ, యోదేవ: పరమేశ్వర:। చరత్యతిథిరూపేణ నమస్తై జంగమాత్మనే॥ అనియు వీరాగమములో నిరూపించబడినది.

అవతారిక:- శివశరణులు మంత్ర శరీరములు గలవారని చెప్పుచున్నాడు.

ఒరెద గురూపదేశద మహాఘనమంత్రమెనిప్ప పంచకా
క్షరవె శరీరభూతకరణేంద్రియ మాత్ర సమూహమాగి సం
చరిసువ కారణం శరణరంగవె నిర్మలమంత్రపిండవెం
బరు శివతత్వసారపరమార్థ విచారపరర్ శివాధవా ॥86॥

తా॥ శ్రీగురుదేవుడు ఉపదేశించిన, పంచాక్షరీమహా మంత్రము శిష్యుని పంచభూతాత్మకమగు, పంచకర్మేంద్రియము

లందును, సంచరించి మాంసమయపిండమును, మంత్రమయపిండముగా నొనర్చును. అని శివతత్వసారపరమార్థ విచారపరులు చెప్పుదురు. "మీయంత ఇతిమాత్రా : విషయా;". అని శంకర భాష్యమున గలదు. మంత్రరూపమై అచరించుట వలన శివ శరణుని శరీరమే నిర్మలమైన మంత్రదేహమనబడును,

**భూమి జలాగ్ని మారుత వియత్తశవంచక ముఖ్య పంచక**
**స్తోమద మాతృగేహమెనిసిర్వమహాశివమంత్రపంచవ**
**ర్ణామళ దీక్షెయిం పరమమంత్రకళాత్మ కమాద దేహా వి**
**శ్రామ వదప్రసిద్ధ శరణంగిహావేం పరవేం శివాథవా ॥87॥**

తా॥ పృధ్వీమున్నగు ఇరువదైదుతత్వములకు జనక స్థానమైన మహాశివపంచాక్షరి మంత్ర దీక్షచేత, మంత్రకళాత్మకంబగు, చర్మదేహముగల శివశరణునకు ఇహలోకమేమి, పరలోకమేమి, జీవన్ముక్తుడైన శివభక్తునకు క్రియా విశ్రాంతి స్థితిగా మారుటజేసి, ఇహపరములచేత నిర్లిప్తుడగును.

**ఆనుభవగమ్య శబ్దపరిగమ్య విశిష్ట విశుద్ధసత్క్రియా**
**ఘనపదగమ్య సంజ్ఞెవిడిదొప్పువ నిర్మలదీక్షెయింకృపా**
**వనధి మహాగురుప్రభు తనుత్రయదోళ్ త్రివిదాఖ్యలింగమం**
**సునిహితమాగి తందిరిసలాయ్తు నిజైక్యపదం శివాథవా॥88॥**

తా॥ కృపానిధియైన గురుదేవుడు, అనుభవగమ్యమగు భావలింగమును, వేధాదీక్షచేతయోగాంగమునందు, మంత్రగమ్య

మగు, ప్రాణలింగమును మంత్రదీక్షతో భోగాంగమునందు, క్రియాగమ్యమగు ఇష్టలింగమును క్రియాదీక్షచేతత్యాగాంగమునందును, బాగుగా ప్రతిష్ఠింపజేసి కారణ శిష్యునకు నిజైక్యము యొక్కనిలవు లభించునట్లు జేయును.

భావద హస్తదిం మనద హస్తశక్కె మనః కరాబ్జదిం
పావనమప్ప నేత్రద కరక్కె తదీయ కరాంబుజాతదిం
కోవిద చక్రవర్తిగురుకాయద హస్త సరోరుహక్కె పూ
జావిధియోగ్యలింగము నిత్త బళిక్కరిదేం శివాధవా ॥89॥

తా॥ బ్రహ్మవిద్యావిచక్షణ శ్రేష్ఠుడైనశ్రీగురువు, శివచైతన్యమును, తన భావనతో మనస్సునకు, అమనస్సుచేత, దృష్టికి, అదృష్టిచేత హస్తకమలమునకు, అటనుండి ఇష్టలింగమునకు, దెచ్చినిల్పి. పూజాయోగ్యముగా మార్చి, శిష్యుని హస్తకమలమునకు ఆ లింగమునను గ్రహించినబిదప. ఆ పరబ్రహ్మమును, హస్తగతమైనదిగా జేసికొన్నవాడికి లోకమున అసాధ్యమైనదేది ఉండదు.

విశేషము:- "యధాకలాతధాభావో యదాభావస్తధామనః యథామనః స్తధాదృష్టిర్యధాదృష్టిస్తథాస్థలం,, అనియు

టిప్పణి-: బ్రహ్మవిద్యావిచక్షణ శ్రేష్ఠుడైనవాడు శ్రీగురువు యొక్క శివచైతన్యమును, తన భావనతో మనస్సునకు, అ మనస్సుచేత దృష్టికి; అటనుండి హస్తకమలమునకు, అక్కడి

నుండి ఇష్టలింగమునకు, దెచ్చిస్థిరపరచి, పూజార్థముగా నొనర్చి, శిష్యుని హస్తకమలమునకు ఆలింగమునొసంగిన బిదప అ పరబ్రహ్మమును హస్తగతముగా జేసికొనిన వాడికి ప్రపంచమున ఆసాధ్యమైనదేముండును?

ప్రణవవె మూర్తి పంచవిధ వర్ణమె పంచవిధేంద్రియం మహా
ఘృణి విభు దేశికం పరమ మంత్ర కళాద్యుపదేశవిత్త తత్
క్షణదోళ మంత్రపిండమెనిసి త్తతి శోభనమప్పరూపల
క్షణవిడిదిర్దొడిన్నుపమిసల్బహుదే ఘనమేం శివాధవా ॥90॥

తా॥ దయానిధి, జగదాచార్యుడు, ఐనశ్రీగురువు, పరమ మంత్రోపదేశమును జేయగానే, శిష్యుని శరీరము మంత్రమయ మయ్యెను. అనగా నాతని ముక్కు (నాసికము), నాలుక, దృష్టి, త్వక్ (చర్మము) శ్రోతములనునైదు ఇంద్రియములు, క్రమముగా "న"కారము మొదలుకొని "య"కారాంతముగాగ ఐదు ప్రణవములుగా మారి, ఓంకారమే శరీరమై యుండును. ఇట్టి మంత్రమయ దేహమును బొందిన (బడసిన) శివశరణుని మహత్వమును అట్లుండును, ఇట్లుండునని మరొదానికి బొల్చిచెప్పదగునా?

లింగమనంగదోళ్ పరమలింగమ నింద్రియ పంక్తియోళ్మహా
లింగమనంతరంగ కరణావళియోళ్ ఘనసత్య చిత్ప్రభా
లింగమనంబరప్రభృతిభూత సముచ్చయదోళ్ కనత్కళా
లింగమ నాళుగప్రకరదోళ్ తళెదంగరిదేం శివాధవా ॥91॥

తా॥ జీవాంగమునందు మహాలింగమును, బహిరింద్రియములందు, శివలింగమును, అంతఃకరణములందు ప్రసాద లింగమును, ఆకాశాది అయిదు భూతములందును ఆచార లింగమును, ప్రాణాది పంచ వాయువులందును చరలింగమును, సర్వాంగమునందును గురులింగమును, అలవరచుకొన్నట్టి మహాత్మునకు ఆశ్చర్యమేముంటుంది?

అవతారిక :- అనేక జన్మములలో ముక్తిని బొందెదమనెడి వృధా ప్రయాసమును బొందునట్టి వేదాంత సిద్ధాంత యోగ మార్గములను దిరస్కరించి, అనాయాసముగా జీవింపగలిగెడు, భక్తిమార్గమే, అధికమైనదని నిరూపించును.

అడిగడిగాయసం బడువ జన్మసహస్రదొళప్ప ముక్తియం
పిడియదె జన్మవొందరొళె సిద్ధప నిశ్చలముక్తి సౌఖ్యమం
పిడిదు బహిః ప్రపంచకుటిలాగమధర్మద సంజ్ఞె మార్గదొళ్
నడెయదె భక్తియోగ పదదొళ్ నడెవర్ శరణర్
శివాధవా ॥92॥

తా॥ శివశరణులు అడుగడుగున బాధలకు గురిజేయు, సహస్ర జన్మలలో లభించెడు ముక్తి నపేక్షింపక, ఒకే జన్మతో లభించెడు స్థిరముక్తి సౌఖ్యమును అపేక్షించి, బాహ్యా ప్రపంచము

యొక్క కుటిల శాస్త్రోక్త అధర్మ మార్గము నాచరింపక శివ భక్తియోగ మార్గము నాచరింతురు. ఇందుకు ఆగమ ప్రమాణము గలదు.

శ్లో॥ ఏకేన జన్మనాముక్తిర్వీరాణాంతు మహేశ్వరీ।
ఇతరేషానాంతుశైవానాం ముక్తిర్జన్మత్రయేణహి।
అల్పక్రియాబహూఫలం-వీరశైవంమహేశ్వరీ।
ఇతరేషాంతుశైవానాం-ఫలమల్పంక్రియాబహూ॥ శివాగమము

పరమ గురూపదేశద లసన్మహిమాస్పద వైభవంషడ
క్షర శివమంత్రదూర్జిత మహోన్నతలింగద చిద్ఘనప్రభా
వరుచిరతేజ మాతృగుణలక్షణ మాగి సదా విరాచిపర్
శరణరెనల్ ఖళక్కితర మార్గద దొడ్డితదేం శివాధవా ॥93॥

తా॥ శివశరణులు పరమగురుదేవుని యుపదేశబలముచేత ప్రకాశించెడు మహిమచేత, నలంకృతులై, షడక్షరిమహామంత్ర ముతో నభివృద్ధి (శ్రేష్ఠులై) నంది, మహోన్నతమగు లింగము యొక్క, చిద్ఘన ప్రభావము గలవారై తమయొక్క సామర్థ్యము తోడ పరిశోధింతురు, ఇట్లుండగా మిగత క్షుల్లకజనుల గొప్ప దనమేల? వారితో ప్రయోజనమేమి?

ಆಂಗದ ಮೇಲೆ ಚಿದ್ಘನಪರಾಹ್ವಯ ಲಿಂಗಕಳಾಪ್ರತಿಷ್ಠೆಯಂ
ಸಾಂಗಿಕವಾಗಿ ಸದ್ಗುರು ಕೃಪಾನಿಧಿ ಮಾಡದ ತತ್ ಕ್ಷಣಾರ್ಧಮಾ
ಲಿಂಗಮೆ ಷಟ್ ಪ್ರಕಾರಮುಖವಾಗಿ ಷಡಿಂದ್ರಿಯ ಭೂತವರ್ಗದೊಳ್
ಮಂಗಳವಾಗಿ ವರ್ತಿಸಲನರ್ಪಿತ ಮುಂಟೆ ಬಿಡಾ ಶಿವಾಧವಾ ॥94॥

ತಾ॥ ಕರುಣಾರ್ದ್ರಹೃದಯುಡೈನ, ಗುರುದೇವುಡು, ಶಿಷ್ಯುನಿ దేహముపై, సత్‌మయము (సచ్చిన్మయము) పరాత్పరము ఐన, లింగకళను సాంగముగా ప్రతిష్టింపజేయగానే, ఆట్టి లింగమే ఆధారాది ఆరు విధములుగా, విభజింపబడి, నాసికాది ఆరింద్రియ ములను పృధివ్యాది ఆరు భూతములందును నెలకొనియుండుట వలన ఆనర్పితమనునదే యుండదు.

ಬಹುವಿಧಕೃತ್ಯಸಾಧ್ಯಮಹ ಮುಕ್ತಿಪದಂ ಭವಕೋಟಿಯಲ್ಲಿ ನಿ
ರ್ವಹಿಸುವದಕ್ಕೆ ಕೋಟಲೆಗೊಳುತ್ತಿರಲಾಯ್ಯನೆ ಜನ್ಮವೊಂದರೊಳ್
ವಿಹಿತಸುಖೈಕಸಾಧ್ಯಮಹಾ ಮುಕ್ತಿಪದಂ ದೊರಕೊಂಡೊಡೊಲ್ಲನೆಂ
ಬಿಹುದಿದು ಪಾಪಶೇಷಫಲಮೈಸೆ ವಿಚಾರಮದೇಂ ಶಿವಾಧವಾ ॥95॥

టిప్పణి : అనేక కోట్ల జన్మములందు, బహువిధమైన కర్మములనాచరించి, బహు కష్టము (ప్రయాస)తో బొంద దగు ముక్తిని ఒకే జన్మమునందు, అనాయాసముగా బొందుట కనువుగా నుండగా. ఇట్లు సులభైకమార్గముండగా దానిని వదలి యుండుట, పూర్వజన్మము యొక్క పాపఫలముగాక మరేమిటి?

బడిణమనొల్లదంతిరిసి భిక్షకె పోపవనంతె కూడె కూ
డొడ నిరుతిర్ప ముక్తిసుఖ భోగమనొల్లదె దూరదూరమ
ప్పెడెదెరపిల్లదాయనమెనిప్ప సుదుర్గటముక్తి సౌఖ్యమం
పడెదవెవెందు కోటలెగొళుత్తిహరా మరుళర్ శివాధవా ॥96॥

తా॥ వీరశైవేతరులైన మందబుద్ధిగలవారు (పిచ్చివారు) భుజించుటకై వడ్డించిన యాహారమును వదలి భిక్షాటనకై బోవు వానివలె సమీపముననున్న ముక్తి సుఖభోగమును వదలి, దూరదూరమున నున్న దుర్లభమైన ముక్తికై పడరానిపాట్లు బడుట వారి దురదృష్టమే సరి?

శ్రితగృహీతవానరగణం జ్వలితానల కాంక్షెయిం ప్రయ
త్నాతురమాగి మించుబుళువం పరికల్పిసువంతె వీరశై
వేతరధర్మమార్గవిడిదూర్జితమప్ప విశిష్టముక్తి సౌ
ఖ్యాతిశయాభిరామపదమం బిడదైదువవర్ శివాధవా ॥97॥

తా॥ వీరశైవ ధర్మము దప్ప వేరొండు ధర్మమార్గమున ఆచరించి, ఉన్నతమైన శ్రేష్ఠమైన ముక్తి సౌఖ్యమును బడయుదుమని చెప్పుట చలబాధకులోనైని మెరవు కీటకములనాశ్రయించ బోవు కోతుల గుంపువలె భ్రాంతియగును.

మున్నమె లింగదల్లి బెరసిర్దు సదా యజనాదిసత్క్రియా
సన్నిహితాత్మనాగి శరణం యజిసుత్తిహ భిన్నభావమం
వర్ణిపొడప్రమేయమనిలం నభదోళ్ బెరసిర్దు శబ్దచా
రోన్నతియిం విభేదవడిదంతె విరాజిసువం శివాధవా ॥98॥

తా॥ శివశరణుడు శివదీక్షను స్వీకరించడంతోనె లింగాంగ సామరస్యము గలవాడైనను, ఎల్లప్పుడును సదాచారనిరతుడై (శివాచారసంపన్నుడై) లింగార్చనలోనున్న అభిన్నభావము అప్రమేయమై యొప్పుచున్నది. గాలి గగనములు ఏకమైయున్నను శబ్దోత్పత్తికి యాగసముభిన్నముగానున్నపగిది యుండి విరాజిల్లుచుండును.

స్థావర జంగమ ద్వివిధ లింగ సమాహిత భక్తి తానె సం
భావిసి జన్మవొందరొళె సిద్ధిప కేవల నిత్యముక్తియెం
దోవి సమస్త శైవ విమళాగమ ధర్మరహస్య వాక్యదిం
పావనమూర్తి సద్గురు కృపానిధి బోధిసిధం శివాధవా ॥99॥

తా॥ పావన మూర్తి కృపాంబుధియగు శ్రీగురు సార్వభౌముడు సమస్త శివాగనుధర్మరహస్యమును, సారముగా సంగ్రహించి స్థావర-జంగమమనబడు ఇష్ట-ప్రాణలింగముల రెండింటిలోను దృఢమైన భక్తి యుంచుటవలన, ఒకె జన్మమునందు నశించని (చెడని) కైవల్యముక్తి హస్తగతమగునని బోధించును. ప్రమాణము ఏకేన జన్మనా ముక్తి-ర్వీరాణాంతుమహేశ్వరీ,,

అనువాక్య ప్రమాణానుసారమగా వీరశైవులకు ఒకే జన్మమున ముక్తి లభించునని ఆగమాలు బోధించుచున్నవి.

తుది మొదలిల్లదింద్రధను మూడిదహాంగె శరీరభావమెం ఋదె సహజం పరాపరవికల్ప విహీన శివైక్య భక్తియో గద పరమార్థమం తిళిద లింగ నిజైక్య సుఖాస్పదంగె త ప్పదుభయ కర్మభోగఫలమిల్లదె పోపుదరిం శివాధవా ॥100॥

తా॥ నిమ్నోన్నత భావము అవసరమనవసరమను భావములు లేకుండ ఉండి పరమాత్మునిలో లీనమగుభక్తి యోగము యొక్క పరమార్థ యదార్థములను దేలిసికొని, ఆచరించులింగైక్యానం దసుఖ (లింగనిజైక్యునకు) పాపపుణ్యముల లేపము, (అంట కుంట) లేకుండ కర్మభోగరహితుడై, అద్యంతములులేని ఇంద్ర ధనుస్సు ఉదయించినట్లుగా, శరీర భావము సహజమైయున్నది టిప్పణి:- పంచమః పురుషార్థోహిభక్తిః రేవసనాతనీ, భక్తిరేవ పరతత్వ వేదినీ। భక్తిరేవ భవ దోషహారిణీ,, ఇత్యాది వాక్యము లతో సిద్ధమగును, (అద్వైత శివభక్తి సిద్ధమగును) మరో ప్రమా ణము పరిచ్ఛిద్యమానఆత్మానంమాచిదంబర మితిస్మరన్ దేహయో గేపి దేహస్థర్వికారైర్న విలిప్యతే। అను ప్రమాణము మేరకు దేహింద్రియగుణాదుల వికారమొక్కటియు, ఉండనేరదని యర్థము, ఈపరి షట్‌స్థలాత్మక విశిష్ట-మహత్తరభక్తియోగవి,,

గద్యాంశము :- ఇది సమస్త శివయోగిజనమనో నిలయ మగు శ్రీమన్నిరంజన లింగచరణసరసీరుహసౌర భాసక్తమత్త మధుకరాయమాణషట్స్థలలింగాంగ సంయోగ సన్మార్గ సిద్ధాంత స్థాపనాచార్య పరమ సుజ్ఞాన సత్క్రియా యుక్త భక్తిభరితాం తరంగ ప్రణవపూర్వక పంచాక్షర మంత్రోచ్చారిత మంజుళ భాషావిలాసనప్పతోంటద సిద్ధలింగదేశికనింవిరచితమప్ప శ్రీమ ద్వీరశైవాచారసారోద్ధార భక్తి-జ్ఞాన-వైరాగ్య ప్రతిపాదక శతక త్రయమహావ్యాఖ్యాన మునందు భక్తి ప్రతీకశివాధవశతకం సంపూర్ణం,

ఈపరి షట్స్థలాత్మక విశిష్ట మహత్తరభక్తియోగ వి
ద్యాపరమార్థ తత్త్వమయమప్ప లసచ్ఛతక ప్రబంధమం
రూపిసి మాయిదేవవిభు లక్షణ లక్షితమాగి పేళ్దనా
త్రైపుర సోమనాథ చరణాంబుజ షట్చరణం శివాధవా ॥101॥

తా॥ టిప్పణి:- అంతర్లింగాను సంధాన జ్ఞానసాంద్రుడైన శ్రీమగ్గెయ మాయిదేవ ప్రభువు ఈ విధముగ షట్ స్థల స్వరూపమైన శ్రీశివ భక్తియోగమును గురించి ఈ విద్యయొక్క శ్రేష్ఠమైనతత్త్వమును వివరించు శతకమును సమస్త భక్తియోగ లక్షణములతో గూడి యున్నట్లు నిరూపించియున్నాడు. ఇక్కడికి భక్తి ప్రశంసాపరమైన శివాధవశతకము యొక్క వ్యాఖ్యానము సమాప్తము.

ఇతి (వే॥పం॥ పెద్ద మఠంరాచవీరాఖ్య దేవేరేణ కృత కన్నడస్య తెలుగు భాషాయాం శివాధవశతకకృత వ్యాఖ్యానం పరిసమాప్తమ భూత్)

శతకత్రయము

# శివావల్లభ శతకము

## జ్ఞాననిరూపణము

శ్రీ మచ్ఛాంభవ భక్తియోగ విలసన్నిర్వాణ నిత్యోత్సవ
ప్రేమానందరసాబ్ధి వర్ధన సదాచారక్రియాకౌశలా
రామోద్దామ గుణప్రభూత మహదైశ్వర్యానుభూతి ప్రభా
ధామం తత్పరమం పదం గురుపదం వందే శివావల్లభా ॥1॥

టీక॥ కం॥ పరమతర భక్తరంతః।
కరణమెనెలెవనేయదాగిరాజీవసాక్షా॥
త్పరశివ నీనెమగరివం।
కరుణిపుదొలవిందె గురునిరంజన లింగా ॥

తా॥ శ్రీ మగ్గెయమాయిదేవాచార్యుడు "భక్తి" ప్రతిపాదకమైన శతకమును వివరించిన బిదప "జ్ఞాన" ప్రతిపాదకమగు శతకమును నిరూపించుటకుద్దేశించినవాడై, గ్రంధారంభమున శ్రీగురు నమస్కారరూపమగు మంగళము నాచరించుచున్నాడు.

టిప్పణి : చిచ్ఛక్తి కాంతుడైన, ఓ పరశివమూర్తి! శివభక్తి యోగమువలన లభించునట్టి ముక్తియొక్క శాశ్వతమగు ఉత్సవమునందు ప్రేమను ఆనందమును పొంది, అట్టి ప్రేమానందరసమును పెంపొందించునట్టి సదాచారానుష్ఠానము నందు నేర్పు మరియు ఉత్తమ గుణముచేత గూడియుండుట వలన వృద్ధిపొందిన అణిమాద్యష్టైశ్వర్యములకు ఆశ్రయమై, శివాను

భవమునకు నిలయమైన, శ్రీగురుచరణమునకు నమస్కరించు చున్నాను. అని మాయిదేవాచార్యుడు ఈ శతకమునందు ప్రారంభములో శ్రీగురు ప్రార్థనతో మంగళాచరణమునుదెప్పు చున్నాడు.

అవతారిక :- ఇక తన ఇష్టదేవతయైన ఐపురపు సోమేశ్వరుని స్తుతించుచున్నాడు.

సచ్చిద్రూప సుఖాకృతి ప్రకృతి సిద్ధ ప్రస్ఫురత్ ప్రత్యయో
ద్యచ్చైతన్య కళాప్రశస్త పరిపూర్ణాద్యంతవర్ణాత్మక భా
వోచ్చావస్థి తదివ్యలింగ ఘనతేజోధామ సోమేశ్వరం
మచ్చిత్తై పురవాసినం ప్రతిభజామిత్వాం శివావల్లభా ॥2॥

తా॥ సచ్చిదానందుడై సహజసిద్ధుడై ప్రకాశించునట్టి చిచ్చైతన్య కళాకీర్తివంతుడై, అఖండము ఆద్యంతరహితము ఐన, ఆ పరమాత్మ స్వరూపుడైన దివ్యలింగముయొక్క గొప్ప ప్రకాశమునకు నిలయమై, చిత్తపురమునందుండిన, సోమేశ్వరా నిన్ను స్తుతించుచున్నాను.

వృషభేశంచెననామధేయ వృషభాచార్యం గుహేశాహ్వయా
భిషరాలం పరిపూర్ణ వాచకలసద్వాచ్యస్వరూప ప్రద
ద్విషయాఖ్య ప్రభుదేవదేవనెమగ్గిగిస్వార సిద్ధిస్ఫృహా
సుషిరా పూరణకృత్ ప్రసాదసుఖమం నిత్యం శివావల్లభా ॥3॥

తా॥ బసవన్నకు ప్రభువైన, చన్నబసవన్నకు ఆచార్యుడు, గుహేశ్వరనామానుసంధానముగలవాడు, సంపూర్ణ వాచకము

వాచ్యస్వరూప ప్రదుడు ఐన, ప్రభుదేవుడు మాయాభీప్సిత సిద్ధికి, గారణభూతమైన, ప్రసాద సుఖమును ప్రతినిత్యము మాకు అనుగ్రహింపుము.

భక్తిజ్ఞానపతానుభూతిపరిణమానందకందాంకురం
వ్యక్తావ్యక్తగుణాతిరిక్త శివయోగోద్యత్ ఫలాస్వాదనో
ద్యుక్తానాది విముక్త షట్స్థలపదాద్వైతాంగలింగానుభా
వోక్తార్థం నిజమక్కో నిన్న కృపెయిందెనోళ్ళె శ్
శివావల్లభా ॥4॥

తా॥ ఓయీ! శివావల్లభ నీ యనుగ్రహము వలన నాలో భక్తియనెడి కందము (రతాలు-రత్నపురిగడ్డ)పై జ్ఞానమనెడు అంకురము మొలవని (బుట్టనిమ్మ) అనుభవానంధమనెడి ఫలము గలుగనిమ్ము, వ్యక్తా వ్యక్తములకు ప్రతికూలమగు, శివయోగ సౌఖ్యమనెడు, ఫలాస్వాదము గలుగుగాత, మాయచేత విడువబడిన షట్స్థల మార్గమునందు లభించెడు అంగలింగముల అఖండాను భవ సంపత్తు లభించుగాక

అంగం త్వంపదమాత్మరూపమమలం లింగం శివం తత్పదం
సంగం సత్యమసి ప్రసిద్ధపదమెంబీ తత్త్వమస్యర్థదిం
లింగాంగైక్యవిశిష్టజీవపరమైక్యాభిన్నభావప్రసా
దాంగీకారమదక్కో నిన్న కృపెయిందెనోళ్ళె శ్ శివావల్లభా॥5॥

తా॥ అంగముత్వం పదసూచకమైన జీవాత్మవాచకము, లింగము "తత్పద సూచకమగు శివుడనెడు పరమాత్మవాచకము, సంగము "అసిపదసూచకమైన సామరస్యవాచకము, ఇట్టి "తత్త్వమ స్యాద్యర్థము" వలన ఓ ఉమాపతి? నీయను గ్రహము వలన నాకు అంగలింగైక్య స్వరూప విశిష్ట శివాద్వై తము యొక్క భావాను గ్రహముగానిమ్ము.

గిరివారాణసి హేమకూట హిమసేతుక్షేత్ర తీర్థంగళం
పరిదైది స్వవిమోహదిం సుకృదాపేక్షత్వమం తాళ్దు సం
చరిసుత్తక్కఉ మత్తె మిక్క నెల నీరొళ్మాళ్ప దుష్కర్మమం
నరరాస్థానదొళంజదేకె భవిగళ్మాళ్పర్ శివావల్లభా ॥6॥

తా॥ సంసార పాశబద్ధులైన మానవులు పుణ్యము నార్జించు కొనవలయుననే కతూహలముతో శ్రీగిరి (శ్రీశైలము) కాశి, పంపాక్షేత్రము, రామసేతువు, హిమచలము, మొదలగు పుణ్య క్షేత్రములకు ఇంకను నానావిధములైన తీర్థములకు పరుగిడుతు వెళ్ళి. ఆస్థానములందు చేయదగని, దురాచారము లొనర్చి, పాపమునకు బాత్రులగుదురుగదా।

భరదిం పావన తీర్థమెందు బగెదందా సర్వతోయంగళోళ్
నరరా తీర్థదొళాహ మిక్క జలదొళ్మాళ్పంతె విణ్మూత్రదు
శ్చరితో చ్ఛిష్టమలాంగమం తొళెదు పాపంగెద్దునిష్కారణం
నిరయక్కేతకె పోపరయ్యో భవిగళ్ పేళా శివావల్లభా ॥7॥



బెంగళూరు వీరశైవ సాహిత్యపరిషత్తువారు ఆహ్వానించి
సన్మానించిన మహాసభలో ఉపన్యసించుచున్న
పండిత. పెద్దమఠము రాచవీరదేవర గారు
"తీర్థ", M. O. L.



తెలుగు విశ్వవిద్యాలయము వారు శ్రీ పాల్కురికి సోమనాథ
మహాకవి అష్టశతమానోత్సవ సందర్భమున
మహాసభలో ఉపన్యసించుచున్న
పండిత. పెద్దమఠము రాచవీరదేవర గారు
"తీర్థ", M. O. L.

తా॥ మానవులు మొదలు పవిత్ర తీర్థమని భావించి అక్కడికి వెళ్ళి మిగత నీటిలో స్నానము చేయునట్లుగా దేహమును అపవిత్రమగు మలమూత్రములను విసర్జించి చేతులు ముఖము (నోరు) మున్నగు వాటిని ఆ పవిత్ర తీర్థమునందు గడిగి, దూషితమొనర్చి, నిష్కారణముగా నరకము కేల పోవుదురుగదా। ఇది ఆశ్చర్యకరము గదా!

క్షేత్రజ్ఞానవిహీనరక్కట మహీభాగంగళోళ్పావనం
క్షేత్రం తానిదు సేవ్యమెందు బగెదొందం తమ్మ దుర్మోహదిం
మూత్రోచ్ఛిష్ట పురీషవిచ్యుతిగళం మత్తల్లియే మాళ్పరా
యాత్రాశోపహతర్కళప్ప భవిగళ్ నోడా శివావల్లభా ॥8॥

తా॥ పుణ్యక్షేత్రములనుబర్యటించి వచ్చిన పుణ్యమార్జించ వచ్చుననె ఆశతో బర్యటించి చెడినవారు, క్షేత్రము యొక్క నిజస్వరూప విచారము నెరుగమి, అజ్ఞానులు పృధ్విపై నొకానొక స్థలము సేవించదగిన పుణ్యక్షేత్రముగా భావించి, ఆపిదప నజ్ఞానము చేత అట్టి స్థలముపై అజ్ఞానముతో మలమూత్ర, ఉచ్ఛిష్టములను వదలుట అక్కటా! అట్టి పాపమునకు మేరయుండునా?

తీర్థక్షేత్రమనాహ కీర్తిసువ తన్మాహాత్మ్యమం కేళ్వ సా
రార్థగ్రాహక సత్వదిం నెనెవ యాత్రారంభమం మాళ్ప పు
ణ్యార్థిత్వం నెరెపాపమాదుదకటా బందల్లి మిందుండు నై
రర్థం మూత్రపురీష విచ్యుతిగళం మాడల్ శివావల్లభా ॥9॥

పుణ్య క్షేత్రములకు ఐదు క్రోసుల దూరమున పుణ్యక్షేత్రస్థల మున మల మూత్రముల, విసర్జన, ఉమ్మివేయుట, సంచరిం చుట వీటిలోనొకదానిని గూడ జేయకుండ ఉండి, ఆ పుణ్య క్షేత్రము నందునివాసముండి, సుఖముననుభవించువాడేధన్యుడు.

గురుదైవం పరపుణ్యతీర్థమమలక్షేత్రం సమానం గడా
గురువం దైవమనాహ కాల్ మరెదు సొంకల్ పాపమెం బా
గళా గురుదైవక్కెణెయాద తీర్థపరమ క్షేత్రంగళం మెట్టువా
నరర్గెన్నెల్లియ ముక్తి భక్తిరహితర్గయ్యో శివావల్లభా ॥14॥

తా॥ గురువు, దైవము, పుణ్యతీర్థము క్షేత్రము. ఇవి సేవించుట కర్హమైనవి. గనుక ఇవన్నియును సరిసమానములై నవే. గదా! ఇట్లుండగా గురువును దైవాన్ని. అకస్మాత్తుగా అజాగ్రతతో. మన కాలువారికి దాకిన యెడల. పాపము సంక్ర మిస్తుందని, భావింప బడుచుండగా, అంతటి గురుదైవములకు సమానమైన పుణ్యతీర్థక్షేత్రములను, మన! పూర్వకముగా కాలి తో త్రోక్కుట, భక్తి శూన్యులైన మానువులకు ఇక మోక్ష మెక్కడ లభిస్తుంది? అక్కటా! ఇదెంత యాశ్చర్యముగదా!

అకటా లింగమ నీక్షిపొందు భరదిం తల్లింగమం ప్రేమదిం
స్వకమస్తక స్థళదల్లి తాళ్ద గిరియం లింగాంగియం భక్తనం
వికళాత్మర్ కెడెమెట్టి బందడరి నోడల్ ముక్తరేనప్పరే
ప్రకట జ్ఞాన విశిష్ట భక్తిరహితర్ నోడా శివావల్లభా ॥15॥

తా॥ ఓయీ! శివా! ప్రసిద్ధిగాంచిన శివభక్తి. జ్ఞానము లేని యజ్ఞానియగు. మానవుడు. పర్వత శిఖరము పైనున్న లింగమును దర్శించవలయునన్న కోరికతో, అంతటి లింగమును భక్తితో, దనమస్తకమునందు ధరించిన కతమున లింగాంగి భక్తు డగుటవలన, అట్టి పర్వతమును కాలితో ద్రొక్కివచ్చి, లింగ దర్శనమునుగావించిన, అట్టివారు మోక్షమును బడయుదురా? అట్టివారి యజ్ఞానమునకు మేరలేదు గదా!

లింగకాశ్రయమాద పర్వతమె లింగం లింగదిందం ఘనం
లింగం తనోళ్ళడంగి తన్న బహుళత్వం తోర్ప తత్కారణం
లింగాలోకన కాంక్షిగళ్ బరిదె భక్తిజ్ఞాన యోగక్రియా
లింగాలోకనమిల్లదేకె బళల్వర్ పేళా శివావల్లభా ॥16॥

తా॥ ఓయి! పార్వతిపతి! ఆపర్వతము నందు శివలింగ సంబంధముంట వలన, దాని మహత్వము అధికముగా నుంట చేత, లింగమును ధరించినటువంటి, యాపర్వతమే, లింగం, అంతెగాదు, ఆశిలింగము కంటెను శ్రేష్ఠమైనది. ఆ పర్వతము పై నున్న లింగమును దర్శించవలెనను కోరిక గలవారు. శివభక్తి శివజ్ఞానము, శివయోగమునకు సరిపడని, యాచరణము చేత శివలింగదర్శనమును జేయుట మానుకొనక వృధా అదెందు లకు ప్రయాసపడుదురో తెలియకున్నది.

శివభక్తం శివలింగమం నిజశిఖాగ్రస్థానదోళ్ తాళ్దొడా
శివలింగేక్షణ కాంక్షెయిందకట బందా భక్తనం మెట్టినో
డువ మోక్షార్థిగళుంటె లింగమనిదావశ్రద్దె సద్భక్తనే
శివనెందీక్షిసి భక్తియిం నమిసరీ మూఢర్ శివావల్లభా ॥17॥

తా॥ ఓయీ! శివా! శివభక్తుడైనవాడు శివలింగమును, దనశిఖాస్థానమున ధరించగా, అట్టి లింగమును చూడవలెనను గుతూహలముతోవచ్చియాలింగ ధారియగు భక్తుని ద్రొక్కి లింగమును. దిలకించు మొక్షా పేక్షగలవారున్నారా? అక్కటా! ఇదెంతటి విధమైన మూఢ విశ్వాసమోగదా! ఇట్టిజ్ఞాన శూన్యులు లింగాంగ సంగియైన భక్తుడే శివుడిగా భావించి, ఆతనికి భక్తితో నమస్కరించరు సుమా!

శరణం శాంభవయోగియిర్ద నెలనే క్షేత్రం పవిత్రం పరం
భరదిందేరిద బెట్టమే ఘనతరం శ్రీ పర్వతం స్వేచ్ఛెయిం
దిరదాక్రీడిసలెందు పొక్క జలమే తీర్థం మహాపావనం
నిరుతం లీలెయోళాడ్దు మాడిదుదె తాం దైవం శివావల్లభా॥18॥

తా॥ ఓయీ! ఉమాపతి! శివయోగి నివసించియున్న క్షేత్రమే, అత్యంత పవిత్రమైన పుణ్యక్షేత్రము, అట్టి శివయెగి మెట్టిన పర్వతమే శ్రేష్ఠమగు శ్రీ పర్వతము (హిమగిరి) అతడు మనః పూర్తిగా విహరించదలచి, ప్రవేశించిన పావన జలమే

అత్యంత నిర్మలమైన తీర్థము, అతడు భక్తితో పూజించునదే పరదేవతగా పరగణించబడును.

శివసంవిచ్చరణాబ్జరేణుపతనం క్షేత్రం తదీయాంఘ్రికం
భవ సంక్షాలితతోయమే విమలతీర్థం తత్పదాంభోజయు
గ్మవె దైవం జడభౌతిక ప్రకృతి తీర్థక్షేత్రదైవంగళెం
బివు మిక్కజ్ఞరిగైసె నిమ్మవరివం పౌర్దర్ శివావల్లభా ॥19॥

తా॥ ఓయీ! గౌరీవల్లభా! జ్ఞానులైనవారికి, శివశరణులకు, తత్పాదధూళి పతనమైన చోటే, పుణ్యక్షేత్రము. అట్టి శివయోగి పాదప్రక్షాళనమొనర్చిన జలమే పరిశుద్ధమగు తీర్థము, అతని పాదపద్మములే పరమదైవము, అచేతనము భూతసంబంధము మాయాత్మకము అయిన తీర్థము క్షేత్రము దైవము అనునవి ఇవన్నియు ప్రాకృత అజ్ఞానులైన, జనులకు, మాత్రమే సేవింప దగినవిగాని, శియోగులు శివశరణులీ ప్రాకృత దైవములకు దలవంచరు (క్షేత్రయాత్రాది దైవములకు దలొగ్గరని యర్థము.)

శివభక్తం గిరి కాశి హంపె మొదలాద క్షేత్ర తీర్థంగళెం
బివనెందుం పెసర్గొళ్ళనాలిసనతీవాకాంక్షెయిం పోగను
త్సవదిం నోడనకృత్యకృత్యముమనేనం మాడనిష్ఠార్థమం
నెవదిం బేడననన్యభావ పరిపూర్ణాత్మం శివావల్లభా ॥20॥

తా॥ సచ్చిదానంద పరశివతదాత్మ్యమును బొంది. అఖండ స్వరూపుడైన శివయొగి. శివశరణుడు శివైనైక్యం సమాపనశ్చిదానంద స్వరూపిణా, నపశ్యతి జగజ్జాలం మాయాకల్పిత వైభవం॥ అను సిద్ధాంత శిఖామణివచనాను సారముగా. మాయాకల్పితమగు జగద్వైభవములో. నొకదానిని గూడ. లక్ష్యపెట్టుడు, అందువలన శ్రీగిరి-కాశి-హంపి మొదలగు పుణ్యక్షేత్రములను గంగానది మున్నగు తీర్థములను సహ గొప్పవని భావించియెప్పుడును, వాటిని పేర్కొనడు. మరియు వాటి మహిమలను వినడు పుణ్యార్జనమునకై యచటికి వెళ్ళడు, ఆనందముతో నిరీక్షింపడు, విధినిషేదములను పాటించడు, ఏదో ఒక నెపముచేత వాటికి దలొగ్గి వేడుకొనడు.

**జలముం పావనతీర్థముం విమలపుణ్యక్షేత్రముం కాడ పాశ్**
**నెలనుం శ్రేష్ఠతమాద్రియుం మోరడియుం ప్రాఖ్యాతిపాదైవముం**

**శిలెయుం భక్తిపరానుభూతిశివయోగజ్ఞాన నిష్పన్నషట్**
**స్థల లింగాంగ నిజైక్యదృష్టిగె సమం సర్వం శివావల్లభా॥21॥**

తా॥ శివభక్తి, శివానుభవములతో, గూడిన శివ-జీవులందు సమానము సమరసైక్యము. చింతా స్వరూపమైన జ్ఞానము వలన, గలిగిన షట్స్థలోక్తమగు. లింగాంగ సామరస్యముతో నిర్ధూతభేదభావమున్నవారై ఐక్యస్థలా పన్నులైన వారు. చూపునకు సామాన్యమగు నీరు, (జలము) పరిశుద్ధమైన తీర్థము-

పుణ్యక్షేత్రము అరణ్యప్రదేశము, శ్రేష్ఠమైన పర్వతము సామాన్యమైన గుట్ట ప్రసిద్ధమగు దేవతా విగ్రహము శిలా ఇవన్నియువ్యత్యాసము లేకుండా ఒకేరీతిగా దర్శింపనగును, అనగా శివతాదాత్మ్యమును బొందిన శివయోగి "అవిశుద్దే విశుద్దేవా-స్థలేదీప్తిర్యధారవేః। పతత్యేవం పదాద్వైతీ సర్వత్ర సమవృత్తిమాన్॥ అనే ప్రమాణము ననుసరించి సూర్యుని వెలుగు శుద్ధాశుద్ధ స్థలములభేదమును జూడకుండ సర్వత్ర యెట్లు ప్రసరించునో (వ్యాపించునో) అట్లే శివాద్వైతియైనవాడు సమస్త వస్తువులను ఒకేరీతిగా జూచునని భావము.

తానే నిర్మలతీర్థముత్తమ మహాక్షేత్రం పరం దైవతం
జ్ఞానధ్యాన సమాధి మంత్ర జపపూజా హోమనేమాద్యను
ష్ఠానం సిద్ధియు మైహికం సుఖదమప్యాముష్మికం సర్వముం
నీనానెంబెరడిల్లదిర్ప శివయోగీంద్రం శివావల్లభా ॥22॥

తా॥ శివానంద మహాసాగరమున మునిగి లింగైక్యస్థలమును బొందిన శివయోగికి "మాయాశక్తి తిరోధానాచ్ఛివే భేదవికల్పనా। ఆత్మనస్తద్వినాశేతు నాద్వైతాత్కించి దిష్యతే॥" అనే ప్రమాణము ప్రకారముగా మాయనశించి భేదభావము నశించిన కారణమున,నాతనికి తీర్థ క్షేత్రదైవము. జ్ఞానము ధ్యానము సమాధి, మంత్రము, జపము, పూజ, హోమము, వ్రతము, వీని నాచరించుట, వాటి యొక్క ప్రతిఫలము ఇహికము పారమార్థిక

ముల యొక్క సుఖ సంతోషములు గూడ తామే ఐయున్నవి. అనగా "శివంవిశ్వగురుం సాక్షాద్యోజయేన్నిత్యమాత్మని। ఏకత్వేనచిదాకారేతదిదం సహభోజనం॥" అనే ప్రమాణము మేరకు సహభోజనస్థలాపన్నమగు చిత్స్వరూపుడు నేతానైయున్నాడు.

ఎల్లం తనోళు తానదెల్లవరొణేకాకారమాగిర్దుమ
త్తెల్లెంబంతె తదన్యనాగి చరిసుత్తిర్పందమం నెట్టనార్
ఐల్లర్ షట్స్థల నిష్కళామళ పరబ్రహ్మాంగలింగైక్యసౌ
ఖ్యోల్లాసాన్పదనప్ప భక్తననువం పేళా శివావల్లభా ॥23॥

తా॥ పర్వతమును దనలో తనను, సమస్తములోను ఏకకారముగా నుండి, తనకు వేరైనది లేదని భావించువాడె, భక్తుడు, ఇట్లు సర్వస్వరూపుడైయున్నను వేరుగా సంచరించుచుండును ఇది యాతని ప్రతేక్యమైన గొప్పదనము, దీనిని యెవరును గుర్తించరు. అతడు షట్స్థల నిష్కల నిర్మలమైన లింగాంగైక్య సౌఖ్య విలాసముతో నున్నాడు.

విశేషము:- "యధైకోవాయురాఖ్యాత, స్సర్వప్రాణిగతో విభుః। తధాత్మావ్యాపకస్సాక్షాత్సర్వప్రాణిగతస్స్వయం"॥సమస్త జగదాత్మాపి - సంవిద్రూపోమహామతిః లిప్యతేనైవ సంసారైర్యధా ధూమాదిభిర్నభః॥

శివలిగం పతి తానె తత్సతియెనిపొప్ప భావసత్యవ్రతో
త్సవతాత్పర్య పతివ్రతైకనియమాత్ర ప్రాణలింగాంగ సం
గవిలాసాన్వద నిష్ఠెయిందితర తీర్థక్షేత్ర ద్వేవంగళెం
బివనెందుం బగెగోళ్ళనుద్ధతగుణం భక్తం శివావల్లభా ॥24॥

తా॥ ఉన్నత గుణసంపన్నుడైన భక్తుడు, లింగమే పతి, తానే సతియను స్థిర బుద్ధిగల, సహజ వ్రతమునందు, మనస్సేకమై పతివ్రతా భావముతో ప్రాణలింగాంగ సాంగత్య విలాసములో నిష్ఠగలిగియుండి, మిగతి తీర్థ-క్షేత్రదేవతలను ఎప్పుడును అంగీకరించడు.

విశేషాంశములు:- "శివసంస్కారయోగేన శివధర్మానుషంగిణాం।
ప్రాకృతానాంసధర్మేషు-ప్రవృత్తిరుపపద్యతె"।

తా॥ అనే ప్రమాణము ప్రకారము శివయోగి యెట్టి సమయంలోను, ప్రాకృత జన సేవ్యములైన తీర్థక్షేత్ర దైవములను సేవించుట కంగీరింపడు మనస్సునకు రానీయడు।

"మరో ప్రమాణ:-సతీవరమణేయస్తు శివేశక్తిం విభావయన్।
తదన్యవిముఖస్సోయం జ్ఞాతశ్శరణనామవాన్।"

తా॥ అనుసూక్తి మేరకు అతడు శివుని కంటే అన్యవిషయమునందు విముఖుడుగా నుండునని భావము,,

నెలనం నీరుమనాహా బెట్టమనిదేం కొండాడువర్ క్షేత్రమెం
దెలె పుణ్యామళ తీర్థమెందు గిరియెందయ్యో శివజ్ఞానయో
గలసద్భక్తివిహీనరప్ప భవిగళ్ నుక్షేత్రముం తీర్థముం
కులశైలం శివభక్తనెందు తిళియర్ నో శివావల్లభా ॥25॥

తా॥ ఓయీ॥శివా॥ శివజ్ఞానము, శివయోగము, శివభక్తి లేని భవులు, సామాన్యమైన భూమిని క్షేత్రమనియు సామాన్యమైన నీటిని పరిశుద్ధమగు తీర్థమనియు, సామాన్యమగు గుట్టను గులకరాళ్ళు గలదాన్నే పర్వతమనియు, ఇట్లెందుకు భావించు కొని పొగడుదురోగదా॥ శివయోగియున్నస్థానమే పుణ్యక్షేత్ర మని, యేల భావించరుగదా॥ అయ్యో॥ ఎంతటి యపచారము.

సతె నీర్మీన్మిడిచిల్లదుత్తమ మహతీర్థం శివజ్ఞానయో
గలసద్భక్తిపరాయణం గుళి తెవర్ మణ్ణిల్లదుత్కృష్టని
ర్మలసుక్షేత్ర ముఖండపూర్ణసుమహల్లింగాంగసంబంధి తా
నెలె కేళ్ కల్మరమట్టియిల్లద మహశైలం శివావల్లభా ॥26॥

తా॥ ఓయీ॥ పార్వతీరమణ॥ శివయోగము, శివభక్తి యందు, ఆసక్తి గలవాడు, సర్వాంగ లింగసాహిత్య యుక్తుడు ఐన శివశరణుడే నీరు, చేప, కప్ప ఇట్టి, జలచర ప్రాణులు లేనటువంటి యతి శ్రేష్ఠమైన గొప్పతీర్థము, అతడే శ్రేష్ఠమగు, నిర్మలమగు, దివ్యక్షేత్రము. అతడే రాయి-మన్ను చెట్లు లేని గొప్ప పవిత్రమైన పర్వతము అనగా తీర్థక్షేత్రముల వలె సేవింపదగినవాడు. శివయోగి, శివశరణుడని. తాత్పర్యము.

విశేషము:-ఇట్లు ఏకలింగ నిష్ఠాపరుడైన, వీరమాహేశ్వరునకు. తీర్థక్షేత్రయాత్రాదిగమనము. యోగ్యమైనదిగాదని చెప్పి ఆమీదట అనాది భక్తుని మహత్వమును గురించి వివరించుచున్నాడు.

అవిభక్తం శివనప్రమేయననపాస్యం పూర్ణనాత్మైకరూ
పవిశిష్టం భజినల్కసాధ్యతరనెందెందాతనం భక్తి గౌ
రవదిం భావిసి భక్తనాద వరమ స్వాతంత్ర్యలీలాకృత
ది విధాకారననాదిసిద్ధ శివభక్తం కేళ్ శివావల్లభా ॥27॥

తా॥ అట్లు సేవింపదగిన భక్తుని లక్షణమేమనగా: శివుడు భేదరహితుడు, మంగళమయుడు, తెలిసికొనుటకు సాధ్యపడనివాడు. ఉపాశించుటకు వీలు లేనివాడు. సర్వవ్యాపకుడు, జీవుడు విలక్షణమైన వాడుగనుక పరమాత్ముడను ఒకే స్వరూపముగలవాడు. భక్తిశూన్యులైనవారు సేవించుటకసాధ్యమైనవాడు. ఇట్లు గుర్తించి విశేషమైన భక్తిచేత నాపరమశివుని, ఉత్కృష్టమైన స్వతంత్రమగు లీలావిలాసముతో. అంగలింగంబులను రెండు రూపంబులను దాల్చియనాది సంసిద్ధమైన, భక్తుడై యొప్పుచున్నాడు.

శ్రుతివాక్యప్రతి-పాద్య మాన సుమహాల్లింగాంగ సంబంధని
శ్చితసత్యార్థవిశిష్ట షట్స్థల పరబ్రహ్మోపదేశోచితో
న్నత నిర్వాణ సుఖానుభూతివర భక్తిజ్ఞానయోగక్రియా
శ్రితనాగన్యమనేనుమం పరికిసం భక్తం శివావల్లభా ॥28॥

తా॥ అట్టి యనాదిభక్తుడు "తత్త్వమసి", "అహంబ్రహ్మాస్మి" మొదలగు మహావాక్యముల చేత జెప్పబడుచున్న లింగాంగ సామరస్యమను సిద్ధాంతార్థముతో గూడిన, షట్స్థల పరబ్రహ్మోపదేశమునకు యోగ్యమైన ముక్తి సౌఖ్యానుభవమున్న వాడుగనుకనే అతిశయమగు శివభక్తి, శివజ్ఞానము. శివయోగాచరణములను అవలభించినవాడై యుండి. ఆసిద్ధాంతమునకు, భిన్నమగునే దానిని గూడ లక్షబెట్టకుండ యున్నవాడు,

భసితాభ్యస్త ధృతత్రిపుంద్ర వరరుద్రాక్షాంగలింగాంగయో
గసమాధి స్థితి సాధ్యసిద్ధమనురాట్ పంచాక్షరీమంత్రజా
పసమేతాత్మ శివస్వరూపవిలసచ్చింతాంతరం గానుభా
వసుఖాకారనపారపార మహిమం భక్తం శివావల్లభా ॥29॥

తా॥ "అంగం ముఖ్యాద్యుపాయయోః" అను జయ్యకోశ ప్రమాణముంది) మరియు నాతడు ఎల్లప్పుడు భస్మత్రిపుంద్ర ధారియైరుద్రాక్షధారణాది సంపన్నుడై. లింగాంగ సామరస్యము నందు, నిల్పిన మనస్సుగలవాడై తానుముందు సాధించబోవు సుప్రసిద్ధమగునట్టి శివ పంచారీ జప పరాయణుండై శివానుభవ సౌఖ్యమయుడై యుండి. భక్తిహీనులకగోచరుండై భక్తిగలిగి యున్న వారికి గోచరుండై మహత్త్వ సంపన్నుడై యొప్పుచుండును,

విశేషము;- ఇట్లు నాది భక్తుని యొక్క మహత్వమును నిరూపించిన తరువాత ఆతనియొక్క ఏకలింగ నిష్ఠా పరత్వ మును వివరించుచున్నాడు.

గురుదత్తానుపమేష్టలింగమె నిజప్రాణేశ్వరం మిక్కపా
మరలోకస్థితమప్ప లింగమనితెల్లం మిథ్యెయెంబేకభా
వరతిప్రత్యయ భక్తినిష్ఠె నెలెగొండిర్పాతనే శశ్వదుత్తర
నిర్వాణపదప్రసిద్ధశరణం సత్యం శివావల్లభా ॥30॥

ప॥ శ్రీ గురువుచేతనను గ్రహించబడిన ఉపమానర హితమైన (సాటిలేనిది-అసమానమైన) ఇష్టలింగమే తనకు ప్రాణపతిగా భావించి మిగత ఈ జడప్రపంచమునందున్నట్టి లింగములన్నియు అసత్యములైనవనే భావన. విశ్వాసము. అనురాగము, భక్తి శ్రద్ధలు, స్థిరముగా నున్నవాడె అత్యంత శ్రేష్ఠమైన ముక్తి పదముతో ప్రసిద్ధిగాంచిన (జీవన్ముక్తుడైన) శివశరణుడుగా పరిగణింపబడును.

పురుషాకార సమత్వదిం పురుషరం మిక్కాదరం తన్న స
త్పురుషంగేం సరిగాణ్బళే పరమపాతివ్రత్యసంపన్నెయా
పరి లింగాకృతియిం సమానతెయదాగల్ స్వేష్టలింగక్కె పా
మర లింగంగళనాహ కాణ్బనె సమం భక్తం శివావల్లభా ॥31॥

తా॥ ఉత్కృష్టమైన పతివ్రతా శిరోమణి తన పతివ్రతా ధర్మముతో గూడియున్న సతి తన భర్తకు మిగత (అన్య) పురుషులు ఆకారముచేత సమానముగా నగుపడుచున్నను, వారి నందరిని ఆమెతన పతివలే భావించివ్యవహరించదుగదా। ఇట్లే శివైకవ్రతుడైన శివభక్తుడు దన ఇష్టలింగమునకు మిగత ప్రాకృత లింగములన్నియు ఆకారమాత్రమున పోలికయున్నను వాటిని దన ఇష్టలింగమునకు సమానమని యెప్పుడును భావించడు.

పతినిష్ఠా నియమ వ్రతాంగియహ పుణ్యస్త్రీగె మత్తన్య ని
ష్ఠిత నేమవ్రతమేమం భజనెయిందం మాడదిర్దల్లి దు
ష్కృతముంటే పుసి మాతదిల్ల శరణంగాత్మేష్టలింగవ్రతో
చిత నిష్ఠా నియతంగె సత్యమిదె దృష్టాంతం శివావల్లభా॥32॥

తా॥ తనపతి భక్తియొకదానినె దృఢముగాను విశ్వసించిన. పతివ్రతా శిరోమణి, మరొవ్రతములుమున్నగు వాటిని జేయమి ఆమెకెలాంటి పాపము సంభవించదు. అట్లే ఇష్టలింగమును బూజించే వ్రతాసక్తుడైన శివశరణుడు మరేదైవోపాసన మున్నగు కామ్యకర్మములను జేయకున్నను ఆతనికి దోషము రడదు,

భక్తం లోకవిభక్తనీశ్వరపదం మాహేశ్వరం తత్ప్రసా
దాత్తం తానె లసత్ప్రసాది నిజలింగప్రాణియుం ప్రాణలిం
గ్యుక్తార్థం స్వసమర్పకం శరణనైక్యం ద్వైతభావాతిగం
వ్యక్తం షట్స్థలయోగ మార్గ పరమాద్వైతం శివావల్లభా॥33॥

తా॥ లోకమున విలక్షణముగా నుండువాడు భక్తుడు, ఈశ్వరభక్తి సంపన్నుడు మాహేశ్వరుడు, అట్టియీశ్వర ప్రసాదమును స్వీకరించినవాడు ప్రసాది తన ఇష్టలింగమునే ప్రాణముగా భావించువాడు ప్రాణలింగి ఆలింగమునకు దన నర్పించుకున్నవాడే శివశరణుడు! రెండుగా భావించకుండ భిన్నభావము లేనివాడు ఐక్యుడు. ఇదే షట్స్థల మార్గముయొక్క పరమాద్వైత సిద్ధాంతము.

పరిపూర్ణభ్రమెయిం బయల్విడిదు భక్తిజ్ఞానయోగక్రియా
చరణంగెట్టు వృథాంత్యదల్లితొళలం ప్రాదేశిక భ్రాంతియిం
పరిదాడం నిజనిష్ఠెయం మరెదు మత్తన్యత్ర కాణ్బాసెయిం
శరణం ద్వంద్వవిముక్త నిర్పరవనేనెంబెం శివావల్లభా ॥34॥

తా॥ భావ భరిత భ్రాంతి చేత, ఆకాశదైవమును విశ్వసించి భక్తి-జ్ఞాన-యోగ-క్రియాచారములను వదలి వృధా చివరి దశలో ఇడుములకులోనుకాడు, మరియు తనయొక్క భక్తి నిష్ఠను వీడివేరొక చోట దర్శించు కాంక్షతో ప్రాదేశిక భ్రాంతితో

నటునిటు దిరుగాడడు. ఇట్లు ద్వంద్వమునకు తొందర పడని శివశరణుని స్థానము వివరింపనలవిగాదు.

కురుహం తోరువ హాంగె తానె శివనెందెలగ్గె తన్నంగదోళ్
కురుహిల్లెందినిసిర్ప దివ్య శివలింగాకారదిందొప్పువా
కురుహం తాళ్దిహనైసె జీవపరమైక్య ప్రత్యయార్థాత్మకం
కురుహుంటే శరణంగె బేరె పెరతొందోహో శివావల్లభా ॥35॥

తా॥ అంగలింగైక్యము యొక్క అనుభవానందమే, స్వభావము గల శివశరణుడు దానెపరమశివుడినని సమస్త జనులకు గుర్తును దెలియ జేయుటకు దన శరీరమున చిహ్నములేని దివ్య శివలింగా కారమున విరాజిల్లు నిట్టి చిహ్నము (ఇష్టలింగమును) ధరించును అట్టి శివశరణునకు వేరొకటి చిహ్నముండదు.

విశేషము :- ధ్యానపూజానిమిత్తార్థం-నిష్కళం సకళంభవేత్,,

అరియం తానరిదిర్ద తన్న మరహిందం తోర్ప మిథ్యార్థమం
మరెయం తాం మరెదిర్ద తన్నరివినిందం తోర్ప సత్యార్థమం
మరహం తట్టదె ముట్టదొందరివినేకాకారమాదంగె మ
త్తరివెందుం మరహెందు మోహో కురుహెందుంటే
శివావల్లభా ॥36॥

ప్ర॥ "స్వావిద్యయా సంసరతి స్వవిద్యయాముచ్యతె" (అని మహోపనిషత్తు ప్రమాణం) తనకు జ్ఞానోదయమగుటకు

ముందు అజ్ఞానము చేతయేమాయా ప్రపంచమును ఇదేశాశ్వతమమై నదిగా భావించేనో. దానిని జ్ఞానోదయమైన పిదప ఆవిధముగా భావించడు, మొదట దాను విస్మరించిన తానే శాశ్వతుడనను సత్యార్థమును జ్ఞానోదయమైన తరువాత ఇకయెన్నటికిని మరు వజాలడు, అట్టి మరుపును కొంచమైనను స్పృశించమి జ్ఞాన స్వరూపమెతానైన మీదట అట్టి శివశరణునకు జ్ఞాన మరుపే మాయ ఆకారము వీనిలోనే దైన ఒక్కటి ఉందా?

విశేషాంశము :- జ, చ, ని, గారియాశయము మేరకు:- (తానుదెల్సిన వాడినని భావించెవాడు. తన యొక్క అజ్ఞానము వలన దనకగు పడుచున్న ప్రపంచమును మిధ్యమైనదని దెలిసి కొనడు. తననే మరచిన శివశరణుడు తన జ్ఞానము చేతనగు పడుచున్న సత్యార్థమును మొదటి వలె మరువడు ఆ అజ్ఞానమును స్పర్శింపకుండ ఉండి ఒకే జ్ఞానమునందేకాకారమైనవాడికి మరల జ్ఞానము మరుపు చిహ్నములనునవి ఉండునా?

జలగంధాక్షత పుష్పధూప విలసద్దీపాను నైవేద్య ని
ర్మలతాంబూల సమర్చనార్పణ వివేకాది క్రియా కారని
ష్కల లింగానుభవైక్యభావభరితం ప్రత్యక్ ప్రసాదప్రభా
వలయజ్యోతిరఖండపూర్ణచరితం భక్తం శివావల్లభా ॥87॥

ప॥ భక్తుడు భావభరితుడు, పరిపూర్ణచరితుడు, జలము గంధం, అక్షింతలు, పుష్పములు, ధూపము, దీపము, నైవేద్య ము, తాంబూలము, ఇట్టి అష్టవిధార్చనములను సమర్పించుట వలన గలిగిన క్రియా, జ్ఞాన, స్వరూపమైన భావలింగాను భవైక్యమున, భావభరితుడు, త్రివిధలింగ ప్రసాదము యొక్క ప్రభావలయముతో నెడవిడకుండిన, పరిపూర్ణ చరితుడు, బాహ్యా భ్యంతరములకు భేదభావముండదు.

**ఒందే యగ్గణియొందె గందరసమొందే యక్షతం పుష్పమ త్తొందే ధూపమదొందె దీపవిధియొందే నోడె నైవేద్యరూ పొందే యర్చనమొందె యర్పణమతం తాంబూలమొందే సమంతొందే లింగమనాదిమధ్యనిధనం సత్యం**

శివావల్లభా ॥38॥

తా॥ అట్టి శివయోగి తానారాధించేబాహ్యము (వెలుపల) నందున్న, ఇష్టలింగము,అంతరంగమునందున్న ప్రాణలింగము. ఒకే రూపమును దాల్చి అదిమధ్యాంత శూన్యమగును. అందు చేత ఆశివయోగి బాహ్యాభ్యంతరాను సంధానము వలన, అచరిం చునట్టి అంతర్లింగార్చన యొక్క ఉపచారములు, మరియు బాహ్యోపచారములు ఒకే రూపమైయున్నవి. బాహ్యపూజ యందు స్థూల పదార్థములు ఉపచారయోగ్యములైనవి, అంతర్లిం గ పూజయందు మానసిక వస్తువులు యోగ్యమైనవి.

విశేషాంశములు:- ప్రాణలింగపూజకుక్షమా గుణమే అభి షేకం చిత్తైకాగ్రతేగంధము, అహంకారములేకుండుటే అక్షంతలు, వైరాగ్యమే పుష్పము, శ్రద్ధయే ధూపము, జ్ఞానమే లోకమును వెలిగింప జేయుదీపము, ఆత్మసమర్పణమే నైవేద్యము, భక్తిరసమే తాంబూలము, ఇట్లే ఈ అష్టోపచారములు అక్కడ ఇక్కడ ఒకే రూపమున భక్తి మీర పూజింపనగును.

విశేషము :- ఇట్లు బాహ్యాభ్యంతర పూజలను వివరించి దేహాది ప్రపంచము శివయోగికి (పరమాత్మ స్వరూపుడైన శివయోగికి) శూన్యములైనవని నిరూపించుచున్నాడు.

దేహప్రాణ మనోహృషీకనికరం మిథ్యా వికారం గడా
దేహాది వ్యతిరిక్తనప్ప పురుషం నిత్యం విశుద్ధం గడా
ఓహో ప్రాకృత తద్వికారకృతమిథ్యాకర్మమం మత్తె ని
ర్దేహాత్మంగిరదుంటు మాళ్పరకటా మూఢర్ శివావల్లభా॥39॥

తా॥ దేహము, ప్రాణము, మనసు, ఇంద్రియములు, ఇవన్నియు మాయావికారములు, వీటన్నింటి కంటేను విలక్షణమైన ఆత్మ, నాశరహితమైనది, నిర్మలమైనదే, గాకుండ "శివ జ్ఞానైకనిష్ఠస్య-నాహంకారభవభ్రమః। నచేంద్రియభవందుః ఖ త్యక్తవాన్ దేహాభిమానినః,, అను ప్రమాణము మేరకు శివభావస్థితుడైన కారణమునదేహాది వికారములలో నొకటియులేనట్టి

శివయోగి మాయా వికారమైయున్న కర్మపుసంబధమును అదే ందులకు గలుగజేయుదురు.

దేహ ప్రాణ మనంగళైదె తనగన్యం తానవల్లెందుని
ర్దాహ మత్తవరిచ్చెయోళ్ విషయసంగంగైయ్దు నిష్కారణం
హాహాతం నిరయక్కె యోగియె శివైక్యజ్ఞాన నిష్పన్నదా
సోహంభావ విశిష్టనే పరమయోగీంద్రం శివావల్లభా ॥40॥

తా॥ దేహము, ప్రాణము, మనస్సు, ఇవేవియు తానుగాను ఇవి తనకు భిన్నమైనవి అవినోటితో జెప్పుతు వాటికి దానధీనుడై ప్రకచ్ఛందన వనితాది. విషయములకు లోనై. వృధానరకము నకు బోవువాడు శివయోగి కాగలడా? శివైక్య జ్ఞానము చేత చివరికి జన్మించిన (కల్గిన-పోడమిన) దాసోహం (శివుడు సేవ్యుడు-నేను సేవకుడను) అను భావనతో గూడుకొన్నవాడే గొప్ప శ్రేష్ఠుడైన శివయోగియగును.

విశేషము :- ఇట్లు దేహది ప్రపంచముతో వ్యతిరిక్తుడైన శివశరణుడు "నాహం, కొహం, సోహం" అను భ్రమత్రయములు లేకుండానె నిరహంభావియైయున్నాడని చెప్పును,

నాహం భావ మిదాత్మనల్ల దిట తాం మత్తావనెందెంబుదే
కోహం భావ పదార్థసాక్షి యెనిపాత్మం సత్యమానెంబుదే
సోహంభావ పదార్థమాత్మ పతిగాం దాసం శివంగెంబుదా
సోహం భావమదే నిరిహ నిరహంభావం శివావల్లభా ॥41॥

తా॥ ఆత్మకు భిన్నమైన దేహము "నేనుగాను అను అర్థముగలది" నాహంభావము "నేనెవరినను, అర్థము గలది "కోహం భావము, సర్వసాక్షియగు ఆత్మనునేను అను అర్థము గలది సోహంభావముగలది, ఆత్మరూపియగుశివునకు నేను సేవకుడిని. అను అర్థము గలదేనిరహంకృతిగల దాసోహం భావము,

విశేషము :- నిరహంభావమునుదానికిట ప్రమాణము గలచు "శ్లో॥నాహమనాత్మా - పశ్చాత్కోహం-యోహం పచస్థ ఆత్మాసాక్షీ। సోహంతత్వతి, శివదాసోహందాసోహమితిచరేదు పరిణతి".

నాహం ఎన్నననాత్మదృష్టి మాదలింగిల్లాగి తాం మోహాదిం
కోహం ఎన్ననానాది సిద్ధ పురుషం తానాగి సందేహాదిం
సోహం ఎన్ననిద్దిర్చి కాణ్బుభయభావభ్రాంతియిల్లాగి దా
సోహం ఎన్ననుపాస్యనాగి శరణం తానే శివావల్లభా ॥42॥

తా॥ శివశరణునకు తానుదేహమేయనెడు భావము మొదలే లేనప్పుడు, అతడు "నాహంయని చెప్పుకొనడు, తాను అనాది సంసిద్ధమైన పరబ్రహ్మమే తానై యుంట వలన, అట్టి శివశరణుడు నేనేవరినియను సంశయముతో గూడిన కొహం అను వాక్యము నుచ్చరించు వాడుగాడు. తనకు భిన్నమైన మరొక వస్తువును ముందుంచుకొని, అట్టి వస్తువేనేనని జెప్పేడు,

ఉభయ భావ కల్పన గలవాడునుగాడు, అందుచేత నతడు "సోహం,, వాక్యమును జెప్పెవాడునుగాడు, మరియుతానే ఉపాస్యుడైన కారణమున స్వామిభృత్యరూపమున, ఉభయ భావము లేనందులకు "దాసోహం" "వాక్యమును జెప్పువాడునుగాడు

దానం ద్రవ్యసమర్పణం నిరుతమాద్రవ్యార్పణం దానమోం
దే నిర్ణీతపదార్థమాద విలసద్దా ధాతు శబ్దక్రియా
దీనాత్మీయతనుత్రయాది సకలద్రవ్యంగళం కొట్టు నిం
దానీగళ్ శివనప్పెనెంబుదిదు దాసోహం శివావల్లభా ॥43॥

తా॥ దానమనగా, ద్రవ్యమును సమర్పించుటయనే అర్థము. ద్రవ్యసమర్పణమనగా, దానమనియర్థము. ఇట్లు ఈ విషయమును శబ్దార్థము వలన వ్యవహరించుటకు యోగ్యమగు తనదేహ కరణాదులనన్నింటిని సమర్పించి. అభిమానములేని వాడుగా నిల్చి. ఇప్పుడు శివుడనైతినను నిశ్చయమైన జ్ఞానము గలవాడె నిరహంభావియైన "దాసోహంభావమగును,,

ఆ నెందెంబభిమానమెల్ల వరొళేనుం పొర్దదభ్యర్చన
జ్ఞాన ధ్యానసమాధినైష్ఠికతెయిం స్వాత్మార్పణంగెయ్వను
ష్ఠాన ప్రక్రియె తానె మత్తె నిరహంతా ముక్తిసద్భక్తికేళ్
సీనెందెంబభిమానమెల్లవరొళత్యర్థం శివావల్లభా ॥44॥

విశేషము -: శరీరాది పదార్థంచ దత్వాద్దానం సమర్ప ణం.,

తా॥ ఓయి పార్వతీపతి! సమస్త పదార్థములను నేను నాదను అభిమానమును వహించక సమస్త పదార్థములును నీ వేయను భావముల బొందినప్పుడు పూజ, జ్ఞానము, ధ్యానము, చిత్తైకాగ్రతల సమయములందెల్లప్పుడును. అదే ప్రకారముగా నిష్ఠను బొందియుండి ఆత్మార్పణము గావించు పద్ధతే అహం భావరహితమైన ముక్తియనబడును, అదె సద్భక్తియని చెప్ప బడినది.

తను పంచేంద్రియ పంక్తి బుద్ధి కరణ ప్రాణాదికం నర్వమిం
తెనగానెంబభిమానమం పరమ భక్తిజ్ఞానయోగైకవా
సనెయిం దర్పిసి లింగదల్లి మెరెవాలింగాభిమానిత్వవ
ర్తనమీగాత్మ సమర్పణం మృషె బళిక్కెల్లం శివావల్లభా॥ 45॥

తా॥ దేహేంద్రియ కరణాదులన్నియునావి, అవన్నియు నేనే, అను అభిమానమును భక్తియోగము జ్ఞానయోగముల బలముతో శివలింగమునందే సమర్పించి పోగొట్టి! "శివప్రసాద సంపత్త్యా శివభావముపేయుషా! శివాధన్యజ్జగజ్జాలం-దృశ్యతెనచ దృశ్యతే!! అను ప్రమాణము మేరకు సమస్తమును శివలింగ స్వరూపముగానె దలంచి పోందుటే ఆత్మార్పణమనబడును, మిగత నేను నాదియను భావములన్నియు వ్యర్థమైనవేయగును।

శిరమం జిహ్వాయనక్షియం కరమనేకీవర్ వృథా భక్తిత
త్పరభావం నెలెగొళ్ళదజ్ఞరిదరిందేం సిద్ధి తన్నం శివం
గరదేపుత్త మసత్వమం మరెదు తన్నిందన్యమప్పంగమం
అరిది త్తల్లి విముక్తి సౌఖ్య పద ముంటే పేళ్ శివావల్లభా. 46॥

తా॥ భక్తి తత్పరతలేని మూఢులు, తన దైవము కొరకు తలను నాలుకను, కన్నులను, చేతులను ఖండించి వ్యర్థముగా నదెందులకు అర్పింతురు ఆవిధముగా నర్పించుటచేత, ప్రయోజనమేమి? పరమశివునకు ఆత్మార్పణము జేయు శ్రేష్ఠమైన సాత్వికగుణమును, అనుష్ఠానమును, జేయుటను మాని (మరచి) తనకు భిన్నమగు అవయవములను కోసియివ్వడముచేత దాని వలన మోక్షానందము లభించునా?

నిరహంభావ మదుళ్ళొడెల్లవరొళేనుం బేడ దానం తప
శ్చరణం పూజసమంతదిల్లదొడదెల్లం బంధ హేతు క్రియా
కరణం కొట్టొడమాహ పూజిసిదొడం నోడా తపంగెయ్దొడం
పరమార్థం నిరహంకృతిక్రియె బళిక్కెల్లం శివావల్లభా ॥47॥

తా॥ తనకు నిరహంభావమొకటి యుండిన, ఆదేచాలు, దానము, తపస్సు, పూజలే మాత్రము అవసరములేదు. ఈ నిరహంభావము, లేకుండ ఎట్టిదానము, పూజ, తపస్సులు, జేసినను, అవన్నియు సంస్కృతి బంధవ్యాపారములకు, సాధనములగును. భ్రాంతికిలోనైన వారు నిరహంభావమునొకదానిని సహించనిదే, నానాక్రియాచరణలోబడిమునకలిడుట ఆశ్చర్యకరమైనదని అర్థము,

విశేషము :- ద్వైతాద్వైతముల చేత విలక్షణమగునదే శివశరణుల మార్గమని యిక్కడ నిరూపించుచున్నాడు.

పరిపూర్ణం గడ బొమ్మమక్కుటు మగుళ్ళకొండు తావింగె పో
పరొ తావిర్దెడెయల్లి కాణదె వృథా వాగ్బ్రహ్మదద్వైతిగళ్
గిరియెందంబుధియెందు పుణ్యనదియెందు క్షేత్ర దైవంగళం
దిరదయ్యో నిజనిష్ఠె యిల్లదవరం నోడా శివావల్లభా ॥48॥

తా॥ అద్వైత సిద్ధాంత ప్రకారముగా బ్రహ్మ సర్వత్ర వ్యాపించియున్నదేనని, నోటితో వాదించే వాగద్వైతులు. తామున్న స్థలమునందు బ్రహ్మముండును, దానిని జూడకుండానె పర్వతము, సముద్రము, పుణ్యనది, పుణ్యక్షేత్రములందుండె దైవమునే దేవుడని చెబుతు వేరె స్థలములకేల పోవుదురోదృఢమైన విశ్వాసము లేమి, భ్రాంతికి లోనైన వారి పగిది గదా!

ద్వైతం నోళ్పొడె బొమ్మమం నుడివ వాగద్వైతిగళ్గెల్లవుం
మాతొందల్లదె మిక్క వర్తనమదేం సద్భక్తనంతల్ల కేళ్
ద్వైతాద్వైత విహీననేనుమరియం తానెంబ హంమిల్లమా
యాతీతం బరిబొమ్మగిమ్మ దొడకం పొర్దం శివావల్లభా ॥49॥

తా॥ నోటితో జెప్పేడు. బ్రహ్మము కేవలము వాగద్వైతులే గాని, వారికి అ అద్వైతము వారిమాటలందెగాని, విచారింపగా వారినడత (ఆచరణ) లోనెమైన ఉందా? అచరణలో అంతయుద్వైతమే, శివశరణుల ఆచరణ ఆ అద్వైతము వంటిదిగాదు. అతడు భెదాభేదమునకు విలక్షణుండై, సోహం, కొహం, అను మొదలగు అహంభావములలో నొకదానిని గూడ ఎరుగని

వాడై నిరహంభావ,, సంపన్నుండై మాయకు నిలుకనివాడై వాగ్బ్రహ్మవలలో బడకుండ ఉండును.

తన్నిందన్యమనేనుమం బగెయనాగి ద్వైతహీనం సునం
పన్నం తానెనిపొందహంతె తనగిల్లంతాగలద్వైత హీ
నం నిర్వాణపదప్రసిద్ధ శరణం ద్వంద్వాతిగం వాక్క్రియా
భిన్నాచారవిశిష్ట షట్స్థల వరబ్రహ్మం శివావల్లభా ॥50॥

విశేషము :- ద్వైతాద్వైతామయంభవతి,, శివశరణుడు ;-నిరస్తభేదజల్పస్య-నిరీహస్య ప్రశామ్యతః। స్వమహిమ్ని విలీనస్యకిమన్యత్ద్వైతముచ్యతే" అను ప్రమాణము మెరకు తనకు భిన్నముగానేవస్తువును జూడనోపడు, అందుచేత, నాతనిలోద్వైతభావముండదు. "అకర్తాహమవేత్తాహంమహదేహో నిరంజనః। ఇతిచింతయతస్సాక్షాత్వంవిదేవ ప్రకాశతే" అను ప్రమాణానుసారముగాః। నేను జ్ఞానిని. సర్వాత్మయనునదొక అహంకారము; అట్టి శివశరణునకుండదు. కావున అద్వైత భావముండదు, అంచేత మోక్షపద ప్రాప్తియందు ప్రసిద్ధుడైన శివశరణుడుః ద్వైతాద్వైతాది ద్వంద్వదుఃఖములనుల్లంఘించ, కుండ ఉండి, నడనుడి యీరెంటిలోను ఒకే విధముగా షట్స్థల పరబ్రహ్మస్వరూపుడై యొప్పుచుండును.

విశేషము;- శివశరణునకు అరిషడ్వర్గము లుండవని నిరూపించుచున్నాడు,

ಬಿಡಬೇಕೆಂಬರು ಕಾಮ ಮುಖ್ಯರಿಪುಷಡ್ವರ್ಗಂಗಳಂ ಸಾಧುಗಳ್
ಬಡವರ್ ಬಿಟ್ಟೊಡೆ ಬಲ್ಲಿದರ್ ಬಿಡುವರೆ ತದ್ವೈರಮಂ ವೈರಿಗಳ್
ಬಿಡರೇಗೈದ್ಯೊಡೆ ಯಾರುಮಂ ಹರಿಸುರ ಬ್ರಹ್ಮಾದಿ ದೇವರ್ಕಳಂ
ತೊಡಕಿನ್ನೆಂತಹುದೋ ತ್ವದೀಯ ಕೃತಕಂನೋಡಾ ಶಿವಾವಲ್ಲಭಾ॥51॥

తా॥ సత్పురుషులు కామాద్యరిషడ్వర్గములను దొలగించుకొనవలయునని ప్రాజ్ఞులు జెప్పుదురు. అవుతె వాటిని నిరుపేదలు (జ్ఞానశూన్యులు) విడచినను, బలవంతులైన ప్రాజ్ఞులు విడుతురా? అట్టి కామాద్యరిషడ్వర్గమున విష్ణు బ్రహ్మాదులను సహపట్టి పీడిచింనవి. ఇక పోతే సామాన్యుల మాటేమేటి? ఓయి పరశివమూర్తి! ఈ అరిషడ్వర్గముల పీడ (తొడుకు) ఎంతటి బలవంతమయినదో అదినీకేదెల్సును.

ಅರಿಷಡ್ವರ್ಗಮನಕ್ಕಟಾ ಬಿಡದೆ ಕೂಡಿರ್ದಲ್ಲಿ ತಾನಪ್ಪ ತ
ತ್ಪುರುಷಾರ್ಥಂ ಕಡೆಗೇನು ಮೇನುವಹುದಿಲ್ಲಂತಾಗಿ ಬಿಟ್ಟಿರ್ಪೆವೆಂ
ಬರು ಧೀಮಂತರು ತತ್‌ಗ್ರಹಂಗಳವು ತಾವೆ ತಮ್ಮ ಸಾಮರ್ಥ್ಯನಿ
ರ್ಭರದಿಂದಂ ಪಿಡಿದಿರ್ಪ್ಪ ವಿನ್ನವರದೇಗೈವರ್ ಶಿವಾವಲ್ಲಭಾ ॥52॥

తా॥ అరిషడ్వర్గముతో గలిసియున్నచో, చివరికి మిగలేపురుషార్థమెట్టిది? దానినుండి యెలాంటిలాభము గూడలేదు. అందుచేత వాటిని వదలినామని నెప్పుకునె బుద్ధిమంతులు, అకామాదులను పిశాచులు తామె బలవంతముగ వారిని బట్టి పిడించుచునప్పుడు, వారేమి జేయగలరు.

కామక్రోధ విలోభ మోహ మద మాత్సర్యంగళం బిట్టు స
ద్యో ముక్తి స్థితియల్లి నిత్యసుఖి యాగిర్పెందు నిర్బాధె వి
శ్రామం పొల్లమదొళ్శితే హగెయ కూటం కుడికొండిర్పెడ
యోగ్య మాయానియత ప్రవృత్తిగవరేగైవర్ శివావల్లభా ॥53॥

ప॥ కామక్రోధాదిషడ్వర్గములనుత్యజించి జీవన్ముక్త స్థితియందు సదానందమయముగా నున్నచో అదే నిరుపాధికమైన సంస్కృతికి విశ్రాంతి యైయున్నది. దానిని వీడి కామాది శత్రువులతో గలిసి యుండిన అది మంచిదా? (బాగుండునా) ఐనను అవి దాటశక్యముగాని మాయయొక్క శాశనరూపమగు శక్తి వారిని అట్లు నడిపించుచుండగా, అక్కటా., ఆసాధువు లేమి జేయుదురు.

సుఖమం కాంక్షిపరైసె సర్వరు మనే కాయసదిం యత్నదిం
దఖిలోపాయదినల్లదూహిపరె నానాయుక్తియిం దుఃఖమం
సుఖకెందిట్టు నొడర్ నిమిర్దు మనెయం సుట్టందదిం దుఃఖమం
సుఖకామత్వవె మాళ్పెడంతదు భవత్ కృత్యం
శివావల్లభా ॥54॥

తా॥ అందరు (బహుజనులు) అధిక ప్రయాసముతో ననేక ప్రయత్నములతోను, వివిధోపాయములతోడను, యుక్తి యుక్తముల చేతను తమకు సౌఖ్యములను గలుగ జేసికొనవలె ననియు, అపేక్షింతురేగాని, దుఃఖమును గోరువారొకరు గూడ

ఉండరు గదా! ఔతె సుఖము కొరకు వెలిగించిన దీపము ఇంటనే (గృహమునే) దహింపజేసినట్లుగా అసత్పురుషుల సుఖాపెక్షగల వారికి దుఃఖమును గలుగజేయుట వలన (గలుగజేసినట్లైతె) ఓ పర శివమూర్తి! అది నీవే పన్నిన భవపాశముగదా!

అరియం వ్యాఘ్రమనగ్నియం భుజగనం దారిద్ర్యమం రోగమం
జరెయం మృత్యుమనక్కటా బిడదరుంతె లోకదొళ్ బిట్టిరీ
శ్వర సౌఖ్యాస్పదరాగబేకెనుతె యత్నం గైవరై సల్లదా
దరదిం కొడిరబేకెనుత్తిహరె ధీమంతర్ శివావల్లభా ॥55॥

తా॥ లోకమున శత్రువును, పులిని, నిప్పును, సర్పమును దారిద్ర్యమును, రోగమును, ముప్పును, మరణమును, వీటిని విడువకుండ పట్టుకొని యెవరైన ఉంటారా? వీనిని వదిలినచో, బుద్ధిమంతులు శివైక సుఖానుభవులుగా వలెనని ప్రయత్నింతురే గాని, కామాదిషడ్రిపుల యందు ప్రేమ గలిగి యుండవలెనని అనుకొనరుగదా?

బిడువాగేం పిడిదిర్దరుంతె రిపువం కామాదియం మున్నవం
పిడివాగేనదు ముక్తి సౌఖ్యకరమే వ్యర్థక్కె మాతాడువర్
బిడబేకెన్నుతె తావె బల్పిడివవోల్ మాళ్పా భవన్మాయెయం
బిడలేం మాతిన మాలెయంతహుదె దుర్లంఘ్యం
శివావల్లభా ॥56॥

తా॥ ఓయీ! పార్వతీపతి! కామక్రోధాది శత్రువులు వీడి పోవునప్పుడు, వాటిని విడువకుండ పట్టుకున్న వారెవరు? మరియు మొదలు ఆకామాదులు తనను బట్టుపోవునపుడు, ఆకామాదుల కూటమి మోక్షానందమును గలుగజేయవు, వానిని వదలవలెను, అని వృధాగా మాట్లాడు వారె ఆకామాదులను దృఢముగా బట్టు కొనునట్లు జేయును సుప్రసిద్ధమైన, నీ యొక్క మాయను వదల వలెనని అదేమిటి కెవలము మాట్లాడినట్లుగా సులభమైనదేమియు కాదు, ఆమాయాశక్తిని, దాటుట సులభమైనదిగాదు.

ಫಡ ಕಾಮಾದಿಗಳೆಂಬಿವಿಲ್ಲವರ ಸಂಗಂ ಮುನ್ನೆ ತಾನಿಲ್ಲವಂ
ಬಿಡಬೇಕೆಂಬುದ ದೇನು ಮಿಲ್ಲವರೊಳಿರ್ಪಾ ಸಕ್ತಿ ಯುಷ್ಟಿಲ್ಲವ
ಕ್ಕೆಡೆಯಾಗಿರ್ಪಳಿ ಮಾನವೃತ್ತಿ ಸಿನೆಯಿಲ್ಲೆನಂಬೆನಾಶ್ಚರ್ಯಮಂ
ಮೃಡ ನಿನ್ನುದ್ಧತ ಭಕ್ತನುನ್ನತಿಕೆಯಂ ನೋಡಾ ಶಿವಾವಲ್ಲಭಾ॥57॥

తా॥ ఓయీ! పరశివమూర్తి నీయొక్క భక్తునకు, కామక్రోధాదులు లేనెలేవు. వాటి సంబంధము మొదలేనశించినవి. ఆకామాదులతో గూడియుండవలెనను కోరిక, నాభక్తునికి లేశ మాత్రములేదు. వాటి కధీనుడై వర్తించవలెనను కోరిక (సంకల్ప ము గూడలేనేలేదు). ఈయాశ్చర్యఘటన మేమని వర్ణించవలెను. నీవు అనుగ్రహించిన భక్తుని మహిమను నీవే జూడదగుదువు.

విశేషము :- (ముందుసూచన) అరిషడ్వర్గంబులలో రాగ ద్వేషములే ముఖ్యమైనవి, అందువలన అట్టి రాగద్వేషములు రెండును శరణునకుండవు.

అనురక్తం విషయంగళోళ్ నెరె విరక్తం నోడ నోడల్మహా
ఘన లింగైక్య సుఖ ప్రసాద వరిపూర్ణాంతర్బహిః శుద్ధవా
సనెయిం రాగవిరాగ మెంబెరడుమెయ్యం మీరి నిర్లేపనెం
దెనిపం ద్వంద్వవిముక్త నూర్జితయశం భక్తం
శివావల్లభా ॥58॥

తా॥ ఓయీ। పరశివమూర్తి ! ద్వైతాద్వైత దుఃఖము లకు దూరమందున్న కీర్తి వంతుడగు నీభక్తుడు "సర్వేంద్రియరూ ఢోపి-సర్వేంద్రియనిహీనవాన్। శివాహితమనాయోగి-శివంపశ్యతి నాపరం॥ అనుసిద్ధాంతశిఖామణి ప్రమాణము మేరకు చక్షురాది బాహ్యేంద్రియ విషయములందు అనురక్తుడైన వాడివలె అగు పడినను, విచారించి చూచిన యెడల నతడు విరక్తుడయ్యే యుండును. ఏలననగా నాతడు లింగాంగ సామరస్య సౌఖ్యము యొక్క అనుభవముతో నిండి పరిశుద్ధమగు అంతర్బహిః కర ణముల వాసనగలవాడగుటచేత రాగద్వేషముల రెండింటిని మీరి అంతర్బహిర్గతము లందును శివుడినే నిరీక్షించుచుండును, కనుకనే అయా ఇంద్రియములకు తమ తమ విషయ సంబంధము లేమికతమున విరక్తుడయ్యేయున్నాడు.

త్యాగస్వీకరణద్వయం సకలధర్మాధర్మకర్మంగళోళ్
భోగాభోగవిరాగరాగబహిరంతర్లేపవెందెంతదం
నీగి ద్వంద్వవిముక్తనాగి నిజలీలాలోలశీలం మహా
యోగక్కాభరణం శివైక్యశరణం తోర్పం శివావల్లభా ॥59॥

తా॥ సమస్త పుణ్యపాపకర్మల విషయమునను, పరిత్యాగమేగానిమ్ము స్వీకరించుటేగానిమ్ము, ఈ రెండును వాటియను భవాను భవములందును ఆసక్తి, అనాశక్తులందును. బహిర్లేప, అంతర్లేపములైయుంట (అంటుకొని యుంట) వలన ఆత్యాగము. స్వీకారము, ఈరెండింటి సంబంధమును వీడి శివశరణుడు ద్వంద్వదుఃఖరహితుడై. ఆత్మానందలీలాపరవశుడై శివయోగాలంకారుడై యొప్పుచుండును,

విశేషము :- శివశరణుడెట్లుండినను శివలింగమునకు ప్రీతిదాయకమే!

ಪತಿಗಾತ್ಮಾರ್ಪಣಮಂ ಸಮಸ್ತವಿಧದಿಂ ಮಾಡಿ ಸ್ವಭರ್ತೃಪ್ರಸ
ನ್ನತೆಯಂ ತಾಂ ಪಡೆದಿರ್ದ ತತ್ಸತಿಯ ಕಾಮಕ್ರೋಧಲೋಭಾದಿಸಂ
ಗತಿಯಾತಂಗೆ ಸದಾಪ್ರಮೋದಕರಮಾಗಿರ್ಪಂತೆ ಸದ್ಭಕ್ತನ
ಸ್ಥಿತಿ ಲಿಂಗಕ್ಕೆ ಮಹಾಪ್ರಿಯಂ ಹೋಲವುಮಾತಿನ್ನೇಂ
ಶಿವಾವಲ್ಲಭಾ ॥60॥

తా॥ అన్ని విధాలుగా భర్తకుదన నర్పించి యా పతి దేవుని ప్రసన్నుడిగా జేసికొన్న పత్ని ఆచరించునట్టి కామక్రోధాది వ్యాపారములన్నియు, భర్తకు ఎల్లప్పుడు సంతోషముగానే యుండునట్లుగా, శివశరణునిరీతి నీతులేవిధముగా నుండినను శివలింగమునకు మహాప్రీతికరముగానే, యుండును. వేయేల జెప్పవలెను.

**ఆలస్యం సకలక్రియాకరణదోః నైష్ఠుర్యమాత్మోక్తియోః**
**కాలుష్యం మనదోః ప్రియాంగనెగలంకారం పతిప్రీతిదం**
**లీలాస్వీకృతదేహధర్మచరితం సర్వం శివైక్యక్రియా**
**శీలంగాభరణం శివప్రియకరం సత్యం శివావల్లభా ॥61॥**

తా॥ భర్త ప్రేమను చూరగొనిన భార్య తాను జేయు సమస్త కార్యములందును, వెలువరించె, అలసతను మాటలతో చమత్కరించె కాఠిన్యతను మనసున దాగియున్న దుడుకుదనము ఆమెకలంకారప్రాయమేయగును. భర్తకు ప్రేమపూరితమగుట వలన, లింగాంగ సామరస్య సంపన్నుడైన, శివశరణుడు విలాసము కొరకు దాల్చినట్టివి, సహజసిద్ధముగా గలిగెనడత (చేష్ట) లన్నియు నాతనికి (పతిదేవునకు) అలంకారములై, పరమ శివునకు ప్రేమపూరితములైయున్నవి.

విశేషము :- శివశరణుడు ప్రాకృత మానవులవలే, షట్కర్మవ్యాపారములను జేయువాడుగాడు, అని నిరూపించును.

**వాణిజ్యంకృషిసేవెయాచ్నెయెనిపీ దుష్కర్మమం మాళ్పనే**
**జాణం శ్రీశివభక్తనుద్ధతనుదారం భక్తిసత్కర్మని**
**ర్వాకైకాశ్రితనాత్మపోషణనిమిత్తం మర్త్యరంతక్కటా**
**మాణామాతదు బేడ భక్తనసమానాధ్యం శివావల్లభా ॥62॥**

తా॥ నేర్పరి జ్ఞాన సంపదతో గూడినవాడు శివభక్తి సంపన్నుడు, ప్రచండుడు, ఉదారవంతుడు, భక్తి సదాచార

మోక్షములను, ముఖ్యముగా విశ్వసించినవాడు, శివజ్ఞాన, సంపద లోదనకు ఎవ్వరును, సాటిలేనివాడు, శివశరణుడు, దన జీవితమును గడుపుకోవడానికి, ప్రాకృత మానవులవలె వ్యాపారము కృషి, సేవ, యాచన, ఇట్టి నీచపు వృత్తులను అశ్రయించడు. అనగా నాతడు జేయు కర్మలన్నియు నిస్వార్థముతో గురు-లింగ-జంగముల సేవకై జేయునని భావము.

విశేషము :- "సర్వకర్మ పరిత్యాగాత్సంత్యక్తాశేషసాధనః
శ్రుత్యుక్త్యాత్ర పరివ్రాట్య ద్రైకాత్మజ్ఞానజన్మనాః"

భవిగళ్ మాళ్పపోలాత మాళ్పనె బిడా యాచ్నాన్య సేవాకృషి
వ్యవహారంగళనక్కటా పరమభక్తం మాళ్పోడం భక్తి సం
భవ సత్కాయకమాగి మాళ్పనదరిందం జీవిపం భక్తియిం
దవె తాం జీవిపనైసె భక్తిచరితం భక్తం శివావల్లభా ॥౬౩॥

తా॥ శివశరణుడు యాచించుట, ఇతరులకు ఊడిగం జేయుట, (సేవజేయుట) వ్యవసాయం జేయుట, వ్యాపారము జేయుట, మున్నగు వృత్తుల నాచరించినను, భవులు వాటిని జేయునట్లుగా, నాతడు జేయడు, మరియు భక్తి వర్థకమైన ఒక ఉద్యోగమును, ఆతడు చేపట్టి ఆచరించి దన జీవితమును వెలిబుచ్చును. ఎందుకనగా భక్తే ప్రధానంగా భావించిన యాతడు భక్తితోనె, దనయుద్యోగమును జేసి తన జీవితమును సాగించును.

భ క్తిద్వార సమాగతా త్తవిభవవ్యాపారపారంగతం
భు క్తిద్వారసమాగతాఖిల మహాభోగోపభోగాశ్రయం
శ క్తిద్వారసమాగతప్రకటదృష్టప్రత్యయైకాస్పదం
ముక్తిద్వారసమాగతాత్మ చరితం భ క్తం శివావల్లభా ॥64॥

తా॥ ఓయీ! పార్వతీపతి: శివభక్తుడు భక్త్యాచరణ మూలకముగా సంపాదించినట్టి సంపత్తును వాడుకొనుట (ఉపయోగించుకొనుట)లో నేర్పుగలవాడై, శివార్పణము ద్వారా (బుద్ధితో) వచ్చిన మహాప్రసాదమును అనుభవించుటలో, నిరతుడై, జ్ఞాన శ క్తిమూలకముగా లభించినట్టి, స్వరూపసాక్షాత్కారము, జ్ఞానమున కాశ్రయమై, మోక్షార్జనమార్గమున, ఎడవిడకుండని సంబంధము గలిగియున్నాడు.

విశేషము :- పరపురుషార్జము నుండిగాక, పరలోకము లేదని ఖండించి, గురు-లింగ-జంగములకు, వంచన లేకుండ, సేవలొనర్చినట్టి శివశరణుడు సాక్షాత్తుగా పరశివ స్వరూపుడయ్యే యున్నాడు.

పరర్గన్నాది పదార్థమిత్తు పురుషార్థంగైవవర్గల్లదా
పరలోకం దొరకొళ్ళదెంబరదు తానేకన్యలోకం వృథా
పరరిం స్వీయరెదేం విరోధిగళే మాళ్పాతం స్వలోకార్థమా
పరరం తన్నవరెందు మాడదొడె తాం వ్యర్థం
శివావల్లభా ॥65॥

తా॥ ఇతరులకు అన్నము, వస్త్రాదులను, దానమొసగి, ధర్మ సంపాదన జేయని వారికి, స్వర్గలోకము లభించదని, ప్రాకృత జనులు చెప్పుదురంతె. అట్టి స్వర్గలోకమనునది, తనకు భిన్నమైనది, కావున అట్టి లోకప్రాప్తిచేత తనకేమి ప్రయోజనము? తన కన్యులైనవారికి అన్నాదులను దానము జేయుటకంటే, తన భార్యా పిల్లలకు యెందుకు జేయకూడదు? పరులకంటెను వీరు శత్రువులా? అంతెగాకుండ ఇతరులకు దానము జేయువాడు, అటువంటి అన్యులను తనవారుగా భావించకుండ, దానము చేసినచో, అట్టి దానము వృధాయగును. (అనగా అట్టి వారికి దానమొనర్చి స్వర్గపదమును బడయుదుమను కోరిక వ్యర్థ మైనదే అని భావము).

పరరార్ తన్నవరార్ వివేకిసె నిజస్త్రీపుత్రమిత్ర స్వకీ
యరె మిక్కాదవరన్యరే తనగె నావేనెంబెవింతప్పమూ
ర్ఖరనయ్యో స్వపరాదికం గురుమతం దేహాది తానన్యవెం
దిరె మత్తెన్నుళిదగ్గె పేళ్వ కథెయం నోడా శివావల్లభా॥66॥

తా॥ విచారించినచో తన కన్యులెవరు? తాను ఇతరులు అనె భేదభావములను విచారించేవాడికి పుత్ర, మిత్ర, కళత్రాదులు బంధువర్గము తనకు సంబంధించిన వారేనా? వారిని వదలితే మిగత వారందరు, ఇతరు (అన్యు)లా? వీరు తనవారు, వారు అన్యులు, అని భావించువారు వట్టి మూర్ఖుల పద్ధతిని గురించి

యేమని చెప్పవలెను? తాను ఇతరులు అను విచారము, ఎట్లున్న దనిన దేహకరణాదులే తన కన్యములైనవను విచారముగురుజ నాభిప్రాయమైయుండగా, ఇక మిగతావారు మాత్రము తన గన్యులని చెప్పుట వ్యర్థముగదా?

తనగన్నర్ గడ తన్ననర్థిసువవర్ తానంతవర్ గన్యభా
వనెయాతంగడ తన్న వస్తుగడ నోడన్నాది మత్తేతకి
వనవర్గక్కట తన్నవస్తువనవర్గిత్తల్లి తన్నిష్టమం
తనగన్యర్ మగుళ్ధివరే భినగుగళ్ నోడా శివావల్లభా ॥67॥

తా॥ ఓయీ! పరశివమూర్తి! తనను యాచించువారు తన కన్యులా? అట్లే యాచించువారికీ తాను భిన్నమా? మరియు అన్నవస్త్రాదులు తన పదార్థములేనా? అట్టి అన్నవస్త్రాచులను ఇతరులకు దానెందుకిచ్చును. అక్కటా! పరులకు తాను దానము చేసినయెడల, దాని ప్రతిఫలమును బొందిన క్షుద్రులైన ఆ అన్యులు, తన కభీప్సితార్థములనేమైన నొసగగలరాలేదు.

కుడువర్ తన్నవరాదొడం తనగె తాం కొట్టర్థమం కొండు నూ
ర్మడియాగల్ సుజనైకవత్సలతెయిం మిక్కాదవర్ కొట్టొడం
కుడరా కొండనితర్థమం బరిదె లోగర్గక్కటా కొట్టవర్
కిడువర్ భక్తరిగిత్తవర్ బదుకువర్ నోడా శివావల్లభా ॥68॥

తా॥ తానొనర్చిన దానము (ద్రవ్యము)ను దీసికొనిన వారు తనవారైన యెడల, సౌజన్యమునకు చిహ్నమైన, వాత్స ల్యముచేత తాము స్వీకరించిన దానిని, వారు ఒకదానికి వంద రెట్లు మరల ఇచ్చెదరు, క్షుద్రజనులైనను, తమకు ఇతరులు ఇచ్చినను, తాము స్వీకరించినయట్టి ద్రవ్యమును మరల వారి కివ్వరు, అందుచేత లోకమున భక్తులకు దానమొసంగిన వారు ధన్యులగుదురు. ఇతరుల కిచ్చినవారు వృధా పాడై పోవుదురు.

విశేషము :- "శివ భక్తిమతిక్రమ్య-యేనాన్యస్మై ప్రదీయతె: నిష్ఫలంతద్భవేద్దానం వరకంచ ప్రపద్యతె, సౌరపురాణ ప్రమా ణము.

పరలోకస్పృహెయిం పరగ్గెపరమప్పన్నాదియం స్వియమెం
దిరదిత్తొందభిమానదిం పరహితం తానెంబహంకారిగా
పరలోకం పరలోకమాపరరవర్ సత్యం పరర్ తత్పరం
పరమన్నాది పదార్థమంతు తనగిల్లేనుం శివావల్లభా ॥69॥

తా॥ తనకు భిన్నమైన అన్నాది పదార్థములను తనవని యభిమానించి, పరలోక ప్రాప్తి కోరికచేత, ఇతరులకు వాటిని దానమొసగి తాను పరోపకారినని గర్వముతో నున్నవారికి దన కన్యమగునా? స్వర్గలోకము తనకు భిన్నమైనదిగానే యుండును.

అట్టి దానమును స్వీకరించినవారు గూడ అన్యులుగానే యున్నారు. అంతేగాదు వారికంటేను ఇతరుడు భిన్నమౌ? అన్నాది వస్తువులు గూడ తనకు భిన్నముగానే యున్నవి. కావున అట్టివారికి దాన మొనర్చిన దాతకు సమస్తము భిన్నముగా నుంటవలన, అట్టి దానముతో ప్రయోజనమేమి యుండదని భావము.

శరణం తన్నవరన్యరెందు బగెయం స్త్రీపుత్రముఖ్యర్కళుం
పరరుం నోళ్పాడె తన్నవర్ సకలరుం తత్త్వార్థదిం మత్తెతాం
పరికిప్పల్లి సమస్తరుం పరరిదక్కారాదొదేం మాళ్పత
త్పురుషార్థం సమమెల్లి తన్నమనమల్లీవం శివావల్లభా ॥70॥

తా॥ శివ శరణుడైన వాడు వీరు నావారు, వారన్యులు, అను భిన్న భావమును లెక్కబెట్టడు, విచారించి చూచినచో సతిసుతాదులు వారికంటెను అన్యులైన వారందరూ గూడ అతనికి తనవారుగానే యున్నారు. మళ్ళి విచారించి చూచిన యెడల దేహకరణాదులు సతి సుతాది సమస్తము అతనికి అన్యముగానే యున్నారు. ఇట్లుండగ దానము జేయుటకు ఎవరైతె నేమి అందరు ఒకటే, తన మనస్సు ఎక్కడ శాంతించునో అక్కడే శివశరణుడు దానము జేయును.

పరరల్లిక్షిసె కొంబవర్ కుడువరర్ తావన్యరల్లం స్వకీ
యరే సత్యం బళికల్లదిర్పొడకటా స్వస్త్రీసుతార్థాదియం
పరర్గెం కొట్టువరుంటె నోళ్పాడె నిజస్త్రీపుత్రవిత్తాదియం
పరమంత్తల్లదొడీవరే సలె పరర్గావ్యర్ శివావల్లభా ॥71॥

తా॥ విచారించినచో ఇచ్చినవారు మరియు పుచ్చుకొన్న వారెవరును, అన్యులుగారు. అ విధముగా ఇచ్చి పుచ్చుకున్న వారు, నిజముగానె బరిశీలించిన యెడల, అందరును తమవారె సుమా॥ అట్లుగానిచో తమ భార్యను, బిడ్డలను, డబ్బును మున్నగు వాటిని, ఇతరులకెవరైన ఇవ్వగలరా॥ విచారించగా పూర్వపు శివశరణులు తమ పత్ని, పుత్ర, విత్రా(ధనము)ధులను, అతి శ్రేష్ఠులైన గురు-లింగ-జంగములకు ఆసక్తితో సమర్పింతురా॥ వారు తమవారని గుర్తించుట వలననె, అధిక విశ్వాసముతో సమర్పించియున్నారని భావము.

అన్యర్గన్యమనిత్తు తన్నొడవెయం బైచిట్టు కొండిర్ప్పవం
ధన్యం జాణనహంతెయం మమతెయం తచ్ఛబ్దవాచ్యార్థమ
ప్పన్యక్కిత్తుశిదిర్దుధం కుడదవం తచ్ఛబ్దవాచ్యార్థనం
పన్నాన్యాత్మకనప్ప సత్యశరణం లుబ్ధం శివావల్లభా ॥72॥

తా॥ తనకు భిన్నమగు సతి-సుత-ద్రవ్యాదులను అన్యులైన తనకు భిన్నులైన, గురు-లింగ-జంగములకు సమర్పించి తనకు సంబంధించిన శాశ్వతమగు ద్రవ్యమైన సామరస్య జ్ఞానమును ఇతరుల కివ్వకుండ ఉన్నవాడే కృతార్థుడు. ఆతడే సోపాధికదా యనియు, తాను నాదియను భావములను వీడి, యమాహా లింగ స్వరూపమైన గురు-లింగ-జంగముల కర్పించి, నిరహం భావమును తనలో నిముడ్చుకొన్నవాడే నేర్పరి, (కుశలుడు-

మహాజ్ఞాని) అతడే నిరుపాధికదానియనియు అట్లు సోపాధిక, నిరుపాధిక దానముల రెంటికిని భిన్నమైన మహాలింగమునం దైక్యమై "అదాతృదాతృదేయానాం - శివభావంవిచింతయన్।" "తత్మనాకర్తృభావంచ-యద్దత్తం సహజంభవేత్" అను ప్రమాణము మేరకు ఇచ్చువాడు, పుచ్చుకొనువాడు, ఇచ్చె ఆ వస్తువులు గూడ ఇవన్నియు, శివస్వరూపములుగా భావించి, తాను ఇచ్చువాడనుగానని భావించి, "దాతాభోక్తాస్వయంశివః" దానము జేయువాడు ఇచ్చిపుచ్చుకొనువాడు, సాక్షాత్తుగా పరమశివుడే, యను బుద్ధిగలవాడైన వాడే సహజదాని యనబడును. ఆతడు దనసామరస్య జ్ఞానమును మాత్రమే, ఇతరుల కివ్వకుండ ఉన్న వాడు, కావున లోభియని చెప్పబడెను.

విశేషము :- ఇహపరములు ఈ రెండును క్షయిష్ణు(నశించునవె)వులే గనుక నిమిత్తమాత్రముగా, వాటికి మూలమైన పుణ్యపాపములను, ఈ రెండు శివశరణునకు సంబంధించినవి గావని భావము. "పుణ్యంనపాపం మయినాస్తిలోకే" శివ గీతా ప్రమాణమునుబట్టి చెప్పబడినది.

పరలోకైహికలోక కర్మకరణవ్యాపార మాయామయ
స్వప్నవదజ్ఞానవిమోహకైతవఫలాకాంక్షావినిర్ముక్తను
త్తరసమ్యక్ శివయోగ షట్స్థల పరబ్రహ్మైక మార్గక్రియా
చరణం సచ్చరణం చిదాభరణసద్వంద్వం శివావల్లభా॥ 73॥

తా॥ శివ జ్ఞానాలంకృతుడైద సత్శరణుడు పరలోక గమనమునకు, ఇహలోక సుఖములకు, సాధకమగు పుణ్య పాప కర్మములను, ఆచరించునట్టి వ్యవహారముచేత గలుగునట్టి, మాయ, అను అజ్ఞానవృక్షము కపటములను, రూపమును గాంక్షను బరిత్యజించినవాడు అనగా శ్లో॥ "ఫలాభిసంధి సంయుక్తం దానంయద్విహితంభవేత్। తత్సోపాధికమాఖ్యాతం-ముముక్షుభిరనాదృతమ్॥ సిద్ధాంత శిఖామణి వాక్యము మేరకు నశ్వరమైనవి గనుక అవి తుచ్ఛములైన ఫలాకాంక్షచేత చేయబడునట్టి సోపాధిక దానమును ముముక్షువైన శివశరణుడు జేయువాడుగాడని భావము. మరియు కర్మమార్గమునకు శ్రేష్ఠమైన లింగాంగ సామరస్య ప్రతిపాదకమగు, షట్స్థల మార్గముయొక్క ఆచరణ యున్నవాడై పుణ్యాపాపోభయ కర్మకృత దుఃఖములు లేనివాడై యుండును.

మొదలిల్లెందెళె కర్మమం బరిదె మత్తుంటెందు మత్తెంతద క్కిదుపాయం పరిహరమెందు బరిదొందం ఘాడి మత్తాగళం తదు హోయిత్తు విముక్తరెందు బరిదే తమ్మల్లి తావే విమోహద సంకల్పద కర్మిగళ్ గళహువర్ నోడా శివావల్లభా॥74॥

తా॥ ఓయీ! పార్వతీపతి! అజ్ఞానముచేత అనేక మనస్సంకల్పములను గల్గించుకొను కర్మబ్రహ్మలు, వృధా మొదట కర్మము లేదనియు, పిదప కర్మము ఉన్నదనియు, ఆ కర్మ

పరిహారముగకై యిది ఉపాయమని చెప్పి ప్రాయశ్చిత్త మను కొని యేదో ఒకదానిని వృధా యొనర్చి అనంతరము ఆ కర్మ దోషము పోయెననియు, తమకుదామే పొగడుకొందురు.

**మొదలొళ్ పుణ్యమనంతరం బళికె పాపం పుణ్యమేనోడె పా**
**పద మూలం పరిహారముంటె బరిదే పాపక్కె బేరొందుమా**
**టదె నాపుణ్యమనాహ మాడదిహుదే తన్మూల పావ క్కె**
**ళదు తానే పరిహారమైసె పునిమత్తెల్లం శివావల్లభా ॥75॥**

తా॥ "ఛిద్రాత్మీయ వినాబహిః మొదట పుణ్యము సంఘ టిల్లి, తరువాత పాపము సంఘటించును, పుణ్యఫలానుభవము, పాపమునకు మార్గమొనర్చిపోవును. అందుచేత విచారించినచో పుణ్యమె పాపమునకు మూలమైయున్నది. ఇట్లుండగా వేరొక కర్మము నాచరించుటవలన పాపపరిహార మెట్లగును? పుణ్య మును జేయకుండుటే పాప పరిహారమగుటే గాకుండ, మిగత ప్రాయశ్చిత్తాది పరిహారోపాయములన్నియు, మిథ్యములే (నిష్ప్ర యోజనకరములే అని అర్థము).

**ఫలకామత్వవె పుణ్యకర్మరతియా పుణ్యక్రియాలబ్ధ తత్**
**ఫలవే భోగ విశేషవా వివిధ భోగాసక్తియే దుర్మదం**
**సలె తద్దుష్ట మదాంధ వృత్తియె కణా పాపం తదంతం కణా**
**ఫలకామాన్విత పుణ్యకర్మ కరణాభావం శివావల్లభా ॥76॥**

తా॥ "చిత్రదాత్మీయవినాబహిః" అట్టి పుణ్య సంబంధము పాపము సంఘటించుట చేత గలుగు పరిణామమును వివరించుచున్నారు. మొదట దనలో ఫలాపేక్ష యుదయించిన వెంటనే ఆ ఫలప్రాప్తికి సాధకమైన పుణ్యము నాచరించవలెనను, ఆసక్తి గలుగును; అట్టి పుణ్య క్రియల నాచరించుట వలన బొందిన ఫలమే సౌఖ్య విశేషమైయున్నది. అట్టి సౌఖ్యానుభవాసక్తి దురహంకారమునకు హేతువగును, దానివలన కన్నుగానకుండ ఉంట వలన పాపమునకు హేతువగును. దీని వలన పాప పరంపరలకు మూలమైన పుణ్యమునకు గారణమయ్యెను, అందుచేత ఫలాపేక్ష లేకుండ పుణ్యకర్మము నాచరించకపోవుటే పాపనాశనమునకు ముఖ్యోపాయము.

క్రమదిం నోళ్ళొడె పుణ్యపాప సుఖదుఃఖ స్వర్గ దౌర్గత్యపా
రమతం తద్విపరీతమాద మతమెల్లంతాగి తానీగ మొత్త
మోదల్పుణ్య మదుళ్ళొదుంటు తరువాయం ద్వంద్వమెల్లం
వృథా
భ్రమెయేకయ్య మొదల్కిడల్కిడుగు మాలాఖం
శివావల్లభా ॥77॥

తా॥ విచారించినయెడల పుణ్యము, పాపము, హర్షము, దుఃఖము, స్వర్గము, నరకము అనునవి క్రమముగా ఒకటి తరువాత మరొకటి గలుగుచుండును. అనగా మొదట పుణ్యమును

సంగ్రహించగానే పిదపపైన జెప్పిన విధముగ ద్వంద్వ దుఃఖములన్నియు సంభవించును. అన్నింటికి మూలమైన ఆ పుణ్యమే నశించినచో, ఉత్తరోత్తర దుఃఖమంతయు నశించును. సమూలముగా నశించినచో నిక లాభమెక్కడిదిః (నశించును) అనునది సర్వశ్రుతి సమ్మతమైనదేగదాః ఇట్లుండగా కర్మ నాశనమునకై, ప్రాయశ్చిత్తాచరణాదులను జేయవలెనను నది వట్టి భ్రాంతిగదాః

శుభకర్మాశుభ కర్మవెంధు యుగళం జ్ఞానప్రసాదఖ్యమెం
దుభయం కర్మమదింతు నాల్కు తెరనా కర్మక్కె తత్తద్విధి
ప్రభవం తానెనిపా ప్రసిద్ధ ఫలమీగ స్వర్గదౌర్గత్యమో
క్ష భవధ్వంసిని భక్తియెందిదు చతుర్భేదం శివావల్లభా॥78॥

తా॥ కర్మ, శుభ, అశుభ, జ్ఞానము, అనుగ్రహము, అని నాలుగు రకాలుగా నున్నది. ఈ నాలుగు రకాల కర్మల ఆచరణ చేత, అనగా క్రమముగా శుభ కర్మవలన స్వర్గము, అశుభ కర్మవలన నరకము, జ్ఞాన కర్మచేత బంధ విముక్తి అనుగ్రహ కర్మచేత సంస్కృతి, వినాశకమగు భక్తి ఫలముగా లభించును.

విశేషము :- "పాపాన్నరకః పుణ్యాత్స్వర్గస్తాభ్యాం వినైవకర్మభ్యాం। జ్ఞానం మోక్షస్తైస్త్రి భిరేవవినాస్యాత్ప్రసాదతో భక్తిః॥

పాపంగెయ్యదె సుమ్మనిర్పుదదు తానే పుణ్యకర్మం మగు
పుణ్యక్రియెగెయ్యదిర్పుదదు తానే పాపమంతాగి ని
ర్లేపత్వం వుసి పుణ్యపాపయుగ మన్యోన్యాశ్రితం భక్తియో
గోపాయం సులభం సుఖప్రదమె నిర్లేపం శివావల్లభా ॥79॥

తా॥ పాపకర్మము నాచరించకుండ, మౌనముతో నూరకుండుటే, పుణ్యకర్మము, మరియు నా పుణ్యము నాచరించకుండుటే పాపము, ఇట్లు అ పుణ్య పాపములు రెండును పరస్పరముగా నాశ్రయించియున్నవి. అందుచేత ఎట్లాచరించినను కర్మలేపన ముండదని, చెప్పుకొనుట అబద్ధమేయగును, అందుచేత భక్తియోగానుష్ఠానమె సులభమైనది, సుఖప్రదమైనది, పుణ్య పాపోభయకర్మలే పరమహితమై యున్నది.

అవనుత్కృష్టవిశిష్ట పుణ్యచరితం యత్తత్ఫలాకాంక్షెయం
సవిదుత్త్యాగియె నుంగి వీర్గుడిదు నిశ్చితం నిరీహం బళి
క్కవనేకష్ట నికృష్టపాపచరితం మిక్కాదవం కాంక్షెయిం
భవబంధక్కురె మారుహోద కృతపుణ్యం కేళ్ శివావల్లభా ॥80॥

తా॥ ఫలాభిలాషను వీడి, నిశ్చింతుడై, నిస్పృహుడై యెవడైతె ఉన్నాడో వాడే అత్యుత్తమ పుణ్యచరితుడు, ఫలాభిలాషతో గూడి సంసార బంధమునకు లోనై, పుణ్యకర్మము నాచరిస్తున్నాడో అతడు అత్యంత జఘన్య వ్యాపారము గలవాడగును.

కామాకామ కృతంగళప్ప జడపుణ్యాపుణ్య కర్మంగళే
వ్యోమాలేప శివార్చనార్పణ కళాకారంగళాగిర్పత
త్సామర్థ్యంశరణంగె భక్తిపరనిర్వాణ క్రియాచారని
స్సీమంగల్లదె మిక్కకర్మిగళిగుంటే పేళ్ శివావల్లభా ॥81॥

తా॥ ఫలాభిలాషతోగాని, అపేక్షలేకుండగాని, తాను జేయునట్టి పుణ్యపాప కర్మములన్నియు. అకాశమువలె నిర్లెప మైయున్నవి. (అనగా పాపపుణ్యములు తనకు సంబంధించినవి గాక) వాటిని శివలింగార్చన, శివార్పణ, రూపములైనట్లుగా. చేయుశక్తి భక్తియను సర్వోత్తమమగు ముక్తి పదమునే ఆచరణ లో ధురీణుడైన శిపశరణునకుండుటేగాక, కర్మనిష్ఠునకు ఉండ నేరదు, ఈయర్థమునకు, "కేవలా నిర్మలా శుద్దా ఫలకామ వివర్జితా। ఫలకామ ప్రయుక్తాహి, క్రియాన ప్రతిబధ్యతే॥ నకేవల క్రియాహ్యస్యలీల మాత్ర స్వభావతః॥ అర్చనార్పణరూపేణ-తత్సర్వంతు ప్రతీయతె॥ తస్మాద్భక్తి పదెపాప పుణ్యయోర్నైవ వర్తతె. అత ఏవపరాయాంతు భక్తౌ నచశుభాశుభం॥ అను ప్రమాణముంది.

భక్తిజ్ఞాన విహీన పుణ్యమదు తాం పాపం శివజ్ఞాన సద్
భక్తిస్వీకృత పాపకర్మమదు పుణ్యం పుణ్యపాపద్వయం
భక్తిజ్ఞానసమేత సద్గురు కృపాలబ్ధ ప్రసాద క్రియా
యుక్తంగిల్లదు కారణం శ్రుతిమతం సత్యం శివావల్లభా ॥82॥

తా॥ శివభక్తి, శివజ్ఞానములేక చేయబడిన పుణ్యకార్యము పాపమేయగును, శివభక్తి శివజ్ఞానములతో గూడి చేసిన పాప కర్మము గూడ పుణ్యకర్మమెయగును. అదియెట్లనగా దక్షబ్రహ్మయాగ రూపమైన సత్కర్మనాచరించినప్పటికి. అది శివభక్తి శివజ్ఞానములకు దూరమగుట వలనను, మరియు శివునికి విరుద్దముగా నాచరించుట వలనను, ఆతని యుద్దేశమునకు విరుద్ద మైన దుష్ఫలితమును అనుభవించెను. గొల్లగొాతికె (పేడ)ను, శివలింగముని భావించి బూజించిన చండీశుడు, తన తండ్రికాలిని (కాలును) ఖండించినది పాపకర్మమే అయినప్పటికిని, ఆతడు చేయుపనియందు శివభక్తి దృఢముగానుంట వలన, వారిరువురకును కైలాస ప్రాప్తి రూపమైన సత్ఫలితమే లభించెను. భక్తి-జ్ఞానసమేతులై గురుకారుణ్యము చేత, తమ సమస్త క్రియలు శివానుభూత ప్రసాదులైన శివశరణులకు ఆపుణ్యపాపోభయ కర్మము లుండనేరవు ఈ సందర్బమున (అర్థము)

విశేషార్థమున :- "పుణ్యపాపోభయంకర్మ మతే భక్తిమతే కుతః" అను ప్రమాణముంది. అందుచేత నీవిధముగ పుణ్యపాప శోకములు, నాకు వర్తించవు, అని యాదేశించిన ఉపనిషత్తు ప్రమాణము సర్వసమ్మతమైనది.

విశేష ప్రమాణము :- (1) "శివభక్తి విహీనస్య-సుకృతంచాపినిష్ఫలం। విపరీతఫలంచాప్య దక్షస్యాపిమహాధ్వరే,

(2) "అత్యంత పాపకర్మాపి-శివభక్త్యా విశుధ్యతి। చండోయధా పరాభక్త్యా-పితృహపిశివోఽభవత్,,

పాశంద్వంద్వ విముక్తనాగి శివభక్తి జ్ఞానయోగ క్రియా
వేశోల్లాస విలాసవిక్రమ విశేషోత్కృష్ట సద్వీరమా
హేశాచార పరాయణం శరణనిర్వం పుణ్యపాపోభయ
క్లేశాయాసనెషేధ వైధ రహితోద్యుక్తం శివావల్లభా ॥83॥

తా॥ శివభక్తి, శివజ్ఞాన, శివయోగముల, సంబంధమైన ఆచరణను మంచియూ వేశయుక్తమగునట్లు ఆచరించుట వలన గల్గిన సంతోష విలాసమునందా సక్తిగలవాడు పరస్త్రీ, పరధనాది, పరాఙ్ముఖుడై, శివదూషణాద్యసహనము, గల్గివీరధర్మము చేత, ఉత్తమోత్తమ మగు వీరమాహెశ్వరాచరణ యందు తత్పరుడు, పుణ్యపాపకర్మదుఃఖము చేతను, తత్కార్మాచరణ, ప్రయాసము, చేతను, విధినిషేధములతో, విడువడిన వ్యాపారము గలవాడును, ఐన శివశరణుడు పుణ్య-పాపములను, పాశద్వంద్వములతో విముక్తుడై యున్నాడు.

పాపాపాప విలేప లోపకర నిర్లేప ప్రసాద ప్రభా
వోపేత ప్రబల ప్రతాప విలసద్ భక్తిక్రియా యోగదోః
పాపంపాపమదల్ల పుణ్యమదు తానుం పుణ్యమల్లం స్వలీ
లాపర్యాప్త గుణైక భక్తివిభవం తానె శివావల్లభా ॥84॥

తా॥ సద్భక్తాచరణయోగము పాప-పుణ్యకర్మలేపనము ను నశింపజేసి, నిర్మలమగు శివానుగ్రహము యొక్క సామ ర్థ్యము చేత గలిగిన అసాధారణమగు పరాక్రమము వలన విరా జిల్లుటతో అట్టి యోగమునందున్న శివశరణుడు ఆచరించిన పాపకృత్యము పాపమైనది గాదు, పుణ్యకృత్యము పుణ్యమైనది గాదు.

విశేషము:-"ఆస్తేదగ్ధ పటన్యాయాద్యోగినః సకలాక్రియాః" అను ప్రమాణము మేరకు శివయోగి యొక్క కర్మములన్నియు చూపుకు మాత్రమే ఉంటు నిష్ఫలములైనవి, గనుకనేవి కర్మనా చారించినను అద్దాని ఫలలేపనము నుండి దూరముండును. పరి శుద్ధాత్మగల యట్టి శివశరణుని క్రియలన్నియు భక్తి విలాసమై భవములైయున్నకతమున అవినిజమైన క్రియలుగావు॥

తమముం జొన్నము మేకరాత్రియొళెవ త్రింపందదిం పాపముం
సుమహాత్పుణ్యము మేక కర్మదొళెవ త్రిక్కుం సమంమ త్తమా
తమమం జొన్నమమం కెదర్చి దినకృత్తీ వ్రాతపంనిల్వసం
భ్రమమెంతంతె శివైకభక్తివిభవం నిల్గుం శివావల్లభా ॥85॥

తా॥ చీకటి (రేయి) వెన్నెల ఒకేరాత్రి యందున్నట్లుగా పాప- పుణ్యములు ఈ రెండును కర్మమార్గము లోకేదానిలో నున్నవి; సూర్యుని యెండ ఆరెండింటిని (ఆచీకటిని వెన్నెలను)దొలగించిన

తానె తానైయెట్లుండ గలదో అట్లే పాపపుణ్యములు కర్మ బంధ నములను ద్రొలగించి శివభక్తి తానె తానై నిల్రద్రొక్కుకొని యుండును ఈ యర్థమును,

విశేషము :- తమోజ్యోత్స్న ప్రవృత్తి :- రాత్రావేవన చాహని। పుణ్యపాపో భయంకర్మ - మతేభక్తిర్మ తేకుత్ర ॥। "అహన్యా తప ఏవాస్తె తమోజ్యోత్స్న విలక్షణె,, అను ప్రమాణ ముంది,

దివదోళ్ చంద్రమరీచియుం తిమిరముం వర్తిక్కుమే రాత్రి యోళ్ ప్రవరంబెత్తగలక్కె పర్వి మిగె వర్తిప్పందది పుణ్య పాపవికారం జడకర్మ కాండదొళె తాం వర్క్కుతుమైసల్లది శివభక్తిస్థళదోళ్ ప్రవర్తిసుగుమె పేళా శివావల్లభా ॥86॥

తా॥ రాత్రియందు వెన్నెల. చీకటి యీరెండును, వ్యా పించి యుండునట్లుగా, పగలు, అవియుండనేరవు. అచే విధముగా పాప-పుణ్యకర్మవిచార మంతయు జడభూతమగు (అజ్ఞానము) కర్మకాండము నందుండునేగాని శివభక్తి మార్గమునందుండదు.

ఫలముం ముక్తి ఫలాంతమాగి కుడువా సామర్థ్య ముంటాగి యుం ఫలమేనుం తనగిల్ల నోడె సఫలం తానాగియుం బంధ కృత్ ఫలదాన స్పృహెయిల్ల నిష్ఫలతెయుం సాఫల్యమం స్వ క్రియాఫలదొళ్ పొర్దద భక్తియోగ ఫలమాశ్చర్యత

శివావల్లభా ॥87॥

తా॥ భక్తియోగము మోక్షమునొసగె ఫలము వరకు, ఇచ్చునట్టి శక్తి యున్నప్పటికిన్ని. విచారించినయెడల అది బొందవల్సియున్న మరోఫలము లేదు. అదే ఫలస్వరూపమై యున్నది, అట్లే అది నిష్ఫలమైయుంటు వలననె భక్తియోగమున సంస్కృతి, బంధనమును గలుగజేయు ఫలేచ్ఛ యనునది జనింపదు, అందుచేత తన క్రియకు ఏదొక ఫలాపేక్షను బొందకుండిన, ఈ భక్తియోగము యొక్క ఫలము లోకమున కాశ్యర్యమును గలుగజేయును. "భావాను రూపఫలదాస్వాశ్రితానాం ఫలైషిణాం। ఉత్తరోత్తరరూపేణ భక్తిః పూర్ణానిరుత్తరా॥ అను ప్రమాణముంది.

ఫలకామత్వమదుళ్ళొడం సకలసత్కర్మంగళోళ్ భక్తిగా
ఫలదిం బంధమదిల్ల మోక్షముమదుం తానిల్ల నిష్కామ్య తా
ఫలదిం నోళ్పడె బంధ మోక్షయుగముంటాదల్లి శశ్వన్మహా
ఫలమప్పుత్తర భక్తియోగ ఫలమల్లెందుం శివావల్లభా ॥88॥

తా॥ భక్తియోగమునందు ఫలాభిసంధిచేత సకలకర్మములను ఆచరించినను, దాని ఫలము ప్రతిబంధకముగానేరదు. శివభక్తికి నిష్కామ్యత్వమే ఫలమై యుంటవలన, అందుకు మోక్షరూపఫలము శూన్యము. (బంధనమేలేనప్పుడు దానివిమోచన మెక్కడా?) బంధనమోక్షములు రెండును ఉన్నవనినచో వాటన్నింటికి ఉతరొత్తరముగా మహాశాశ్వత ఫలరూపమగు

భక్తియోగఫలమేలేనట్లగును. ఈయర్థమున: "నబంధోస్తినమో క్షాస్తినిత్యముక్తస్యకాముక్తి", (యాజ్ఞవల్క్యోపనిషత్తు ప్రమాణముంది)

విశేషము :- "నచబంధోనచముక్తిశ్చ - నదేవాద్యభిమానితా: "నసుఖంనైవదు:ఖంచ-నాజ్ఞానం, జ్ఞానమేవవా,, ఏకీభావముపేతానాం యోగినాంపరమాత్మనాం,, సి. శిఖా.

బంధం సంస్కృతి పాశదావరణ మాబంధావృతి చ్ఛేదనం
బంధచ్ఛేదన మాప్రగాఢతర బంధచ్ఛేదనం మోక్షమా
బంధంమోక్షద నంతరం మరళి తానుంటాగి సద్భక్తియా
బంధంమోక్షము మిల్లదల్లి బెళగుత్తిర్కుం శివావల్లభా ॥89॥

తా॥ సంసార పాశము చేత గట్టబడునదె బంధమనబడును. అట్టి భంధనమును త్రుంచి వేయుటే బంధవిమోచనమనబడును, ఆ బంధమోచన మేమోక్షమనబడును, అట్టి మోక్ష ప్రాప్తియనంతరము మరల బంధనమేర్పడుటతో ఒకదాని వెనుక మరొకటి (పరంపరగా) రావడంచేత, ఇట్టి బంధమోక్షములెక్కడైతే ఉండవో అట శివభక్తి ప్రకాశించుచుండును,

విశేషము:- "బంధేసతి విముక్తిస్స్యాత్సత్యాంముక్తౌచ బంధనం॥ అన్యస్యాపగమాదన్య ఆగమిష్యతి కేనచిత్,, పరస్పరానుబంధేన వర్తతే బంధమోచనే। తస్మాత్తయోరభావేతు భక్తిరుక్తానిరంకుశా॥

గగనం మారుతపాశదిం బిగిదు కట్ట్యల్లట్టుంగొడందు భ
క్తిగెబంధం దృఢపాశమోచన మదక్కాదందు మోక్షం దిటం
బగెయల్ భక్తిగె బంధమోక్షయుగళం సంసార పాశప్రధా
నగుణం సత్యమదుంటె ఉంటు పుసి మాతెల్లం శివావల్లభా॥90॥

తా॥ ఆకాశమును వాయుపాశము చేత బిగించి కట్టినచో అది దానికి లోబడిన భక్తి గూడ సంసారమునకు లోబడినట్లగును. ఆకాశమునకు అట్టివాయుపాశము బంధనము మోచనము గలిగిన ట్లైతే భక్తికిని నిజముగా బంధమోచనము గలుగవచ్చును. బంధమోక్షములు రెండును సంసారముయొక్క ముఖ్యగుణములు ఆగుటవలన భక్తియోగమునందు ఆబంధమోక్షములుండునా॥ ఉండుననుటె యసత్యము.

విశేషము:-శివభక్తి చేత గల్గిన జ్ఞానము సమస్త కర్మ బంధనములు పరిహరించునని జెప్పుచున్నాడు.

స్ఫటిక స్వచ్ఛద కాంతియొళ్ ప్రవిలసత్ ప్రద్యోతనోద్యత్
ప్రభా
పటలం సంగిసె వహ్ని పుట్టి దహిసుత్తిర్పంతె సోంకల్ పరి
స్ఫుట భక్తి క్రియెయొళ్ ప్రసాద కళె కొడల్ శాంభవ
జ్ఞానము
త్కటిసి స్పర్శిప దోషమం ప్రహరిసుతిర్కుం శివావల్లభా॥91॥

తా॥ ప్రకాశించునట్టి సూర్యుని నుండి వెలువడిన కిరణ సముహము స్ఫటికశిలపైబడి దాని నిర్మలమగుకాంతితో బాటు గలిసియుండినచో అగ్ని ప్రజ్వలనమై దహింపజేయునట్లుగా భక్తిక్రియలతో శివానుగ్రహ చైతన్యము గలిసియుండిన శివ జ్ఞానము జన్మించి మాయాపాశదోషమును బరిహరింపజేయును.

విశేషము;॥ జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసాత్కురు తేర్జునా,,

బీజం శాంభవ భక్తియంకురమతం జ్ఞానం ప్రసాదంఫలం
బీజాంకూర ఫలాఖ్య భక్తి విమలజ్ఞాన ప్రసాదత్రయం
రాజిప్సాత్మ తనుత్రయైక సుఖభోగ ప్రత్యయ ప్రక్రియా
పూజాయోగ సమాధి నిష్ఠైయె కణాలింగం శివావల్లభా ॥92॥

తా॥ శివశరణుడు భక్తియను బీజముతోడ నొప్పుచున్నట్టి దన యొక్క స్థూల శరీరమందలి అర్చనా రూపమగు క్రియ చేతను తదుద్భూత సుఖాను భూతి నిష్ఠుడై జ్ఞానాంకురముతో విరాజిల్లుచుండిన దన సూక్ష్మ శరీరము నందలి శివైక్యమగు క్రియ చేతను దానినుండి గల్గిన సుఖాను భూతి నిష్ఠుడై శివ చైతన్యమను ఫలము చేత నొప్పుచుండిన దనయొక్క గారణ శరీరమున చిత్తైకాగ్రతతో దాని నుండి యేర్పడిన సుఖాను భవనిష్ఠుడయ్యు ఉండుటచే మహాలింగ స్వరూపమైయున్నాడు.

అవతారిక:- మంత్రయోగులు పరే-పశ్యంతి, మధ్యమే-వైఖరియను. చతుర్విధములైన శబ్దనిష్పత్తినే ప్రయోజనమందురు. శివశరణులు ఆనాల్గింటిని భక్తి స్వరూపముగనె జూచెదరు. అనినిరూపించుచున్నాడు.

పరెయే మానసభక్తి చాక్షుషపదం పశ్యంతియే వాచిక
స్ఫురణం మధ్యమేయే గురూక్తి మతదిం సత్కాయకం భక్తి
వైఖరియే నోళ్ప్రాడెయింతు నాల్కు తెరనాగిర్కం
మనశ్చక్షురు
త్తర వాక్కాయ చతుర్విధ ప్రణిదియోళ్ తానె
శివావల్లభా ॥93॥

తా॥ మంత్రయోగులు పురుషార్థసాధనకు వాక్కుపాసనమే. ముఖ్యమైనదనియు. ఆ వాక్కునకు మూలాధార స్థానమునందుదయించిన దానిని పరెయనియు, నాభిస్థానమున నుండిన దానిని పశ్యంతి యనియు. హృదయ స్థానమున నుండిన దానిని మధ్యమెయనియు. కంఠస్థానముననున్న దానిని వైఖరి యనియు. చేప్పబడుచున్నదనియందురు. ఇట్టి యీచతుర్విధమగు శబ్దనిష్పత్తే వారికి ప్రయోజన కారియైయున్నది. భక్తి యోగమార్గము నందున్న శివశరణుడైనను. ఆచతుర్విధమగు వాగ్ వృత్తిని భక్తిమయమైన దానిగానె దెల్సికొనియున్నాడు అదియెట్లనగా:- "మనసున శివధ్యానము జేయు భక్తి,, పరెయనియు. కన్నులతో శివస్వరూపమును దర్శించుట భక్తె

పశ్యంతి యనియు, వాక్కునుండి కీర్తించుటే (స్తుతించునదే) భక్తి మధ్యమ యనియు, శరీరము నుండి శివ లింగార్చనగా వించు భక్తె వైఖరి అనియు, చెప్పుదురు.

స్మరణం ప్రేక్షణమీక్షనం యజనమెంబీ నాల్కు సద్భక్తియో
ళ్ పరిణామం బడెయల్కె లింగ నిజలీలాలోల శీలత్వదిం
పరె పశ్యంతి సుమధ్యె వైఖరియెనిప్పాకారమం సాదరం
ధరిసిర్ప్పందరవం మహత్తరమనేనెంబెం శివావల్లభా ॥94॥

తా॥ శివశరణుడు శివలింగ లీలా సక్తియొకటే స్వభావము గలిగి యుంట వలన అట్టి లింగ భక్తి సుఖానుభవముగా వించు (బొందు) టకై "లింగస్మరణము, లింగదర్శనము, లింగ స్తుతి, లింగపూజ, అను నీచతుర్విధ భక్తియందే పరా పశ్యంతి మధ్యమ వైఖరి అను నీ చతుర్విధ స్వరూపమును ధరించిన యాతని యసాధారణమగు పద్ధతిని నెనేమని వర్ణింతును.

స్మరిను త్రీక్షిసుతిశిసుత్తె యజసుత్తానందదిం భక్తి శాం
కరినిత్యం నిజలింగ సంగరతియోళ్ సమ్యక్ సమాధి క్రియా
చరణం బెత్తు చతుర్విభాగ విడిదిర్ప్ప నిష్ఠె తానీగళే
పరెపశ్యంతి సుమధ్యె వైఖరియెనల్ తోర్కుం
శివావల్లభా ॥95॥

విశేషము:- శివశరణుడెల్లప్పుడు లింగాంగ సామరస్యములో దృఢమైన చిత్తైకాగ్రత. ఆచరణయున్నావాడై, ఆనందముతో

లింగస్మరణము లింగనిరీక్షణ, స్తుతి, పూజలనాచరించుచు చతు ర్విధమైన పరె, పశ్యంతి, మధ్యమె,, వైఖరి అనునాల్గు విధము లుగా నగుపడుచుండును.

అవతారిక:- కర్మజ్ఞానకాండముల తరువాత బేర్కొన దగిన భక్తికాండమును వివరించుచున్నాడు.

ఆనెందెంబుదు కర్మకాండమతమెల్లా కృత్య కర్తృత్వదొళ్
తానల్లి కరణాళి సాక్షియహెనెల్లక్కెంబుదే జ్ఞానకాం
డానుష్ఠానమతం సమస్తకరణం కర్తవ్యముం కర్తృవుం
నీనే యెంబుదు భక్తికాండ మత-నిర్వాహం శివావల్లభా ॥96॥

తా॥ ఓయీ! పరశివమూర్తి! సమస్త ధర్మాధర్మకార్యముల నాచరించుటలోను, నేనెకర్తననే అభిమానించుట, కర్మకాండము యొక్క ఆశయము, ఇట్టి కార్యములన్నింటిని జేయువాడను నేనుగాను, ఇంద్రియములనన్నిటికి నేను సాక్షిగానున్నాను. అనునదే జ్ఞానకాండము యొక్క ఆశయమైయున్నది. సమస్త కార్యములను చేయుట, అధవా జేయబడునట్టి వస్తువు, చేయునట్టి కర్తగూడ నీవేయనుట భక్తికాండము, యొక్క దివ్యలక్షణము. ఇందుకు దగిన ప్రమాణములు:- "అహంకర్తా సమస్తస్య-ధర్మా ధర్మస్యకర్మణః। ఇత్యనేనాభిమానేన-కర్మకాండో యముచ్యతె॥ "నాహంకర్తాస్యకర్తృత్వం-నైవసాక్షీ స్వభావతః। ఇత్యనేనాభి

మానేన జ్ఞానకాండోయముచ్యతే॥ నకర్తాహంనసాక్షీచ-శివయేవేతి కర్మణః ద్వయాభిమానరాహిత్యం భక్తికాండోయముచ్యతే.,

తా॥ ఓయీ! పరశివమూర్తి! సమస్త ధర్మకార్యముల నాచరించుటలో నేనేకర్త ... భిమానించుట, కర్మకాండము, యొక్క ఆశయమైయున్నది. ఈ కార్యములనన్నింటిని జేయు వాడిని నేనుగాను ఇంద్రియములనన్నింటికి నేను సాక్షిమాత్రు డుగానున్నాను. అనునదే జ్ఞానకాండముయొక్క ఆశయమైయు న్నది. సమస్త కార్యములను జేయట, జేయబడు వస్తువు, చేయు కర్త గూడనీవేయనదే భక్తికాండము యొక్క అభిప్రాయము.

కర్మజ్ఞాన శివైక భక్తియెనిపీ కాండత్రయానుష్ఠితం
కర్మంతాం ప్రకటం రహస్యముభయాన్యత్వ ప్రకారక్రమం
వర్మావర్మ విధానయోగ వివిధాశేషస్వకర్తవ్యదోశ్
నైర్మల్యం తనగప్ప శుద్ధి కరణోపాయం శివావల్లభా ॥47॥

తా॥ కర్మజ్ఞానము భక్తియను, ఈ మూడు కాండముల నుండియు ఉత్పన్నమైన ఆచరణ పద్ధతి యేరీతిగా నుంటుందనగా కర్మబహిర్గతమైనది. జ్ఞానముగుప్తముగా నుండునది, తాననుష్ఠి ంచే లింగార్చన యోగమునందు ఆచరించునట్టి సమస్త కార్యము లందును, తనకు నిర్లేపత్వమును గలుగజేయు ఉపాయమే భక్తికాండము యొక్క ముఖ్యలక్షణమై యొప్పుచున్నది.

**ఆయాసం ప్రకటం స్వకర్మకమనాయాసం రహస్యం వరం ప్రాయశ్చిత్త విధానమింతి వెరడక్కుం బాహ్య మాగిర్పతత్ ప్రాయశ్చిత్త విధానమెంబుభయనాన్యం డాక్తికం శుద్ధ నిర్మాయం సౌఖ్యతరం శివార్పణకరం నిత్యం శివావల్లభా ॥98॥**

తా॥ వ్యక్తమైన కర్మకాండము చాల ప్రయాసముతో గూడియున్నది. గుప్తముగా నుండిన కర్మకు ప్రాయశ్చిత్త కారియైయుండిన, ఈజ్ఞాన కాండము ప్రయాసములేనిది. ఇట్టి కర్మ-జ్ఞానకాండముల రెంటికిని మారినదై యీరెంటికిని ప్రాయశ్చిత్త కారియై. అరెంటికిని వేరుగాక అనగా జ్ఞాన-క్రియా సహితమైయున్న భక్తికాండము, పరిశుద్ధమైయ్యు, మాయారహితమైయ్యు, సుఖకరము. శివసామరస్యకరమయ్యు, శాశ్వతమైనదిగా నుండును,

**అణిమాద్యష్ట గుణప్రసిద్ధ మహదైశ్వర్యం నిజైశ్వర్యదోళ్ తృణసాధారణమింద్ర జాలకృతకం స్వాభీష్ట సంసిద్ధియోళ్ మణిమంత్రౌషధ సిద్ధి గిద్ధిగళవెల్లం భ్రాంతి మిథ్యామయం క్షణికం తానెనిసిర్ప భక్తిపదమిన్నేనో శివావల్లభా ॥99॥**

తా॥ భక్తికాండ సంపదలో, అణిమాద్యష్టైశ్వర్యము లన్నియు. తృణ ప్రాయములై యున్నవి, ఆ భక్తిసిద్ధియందు ఇంద్రజాలము మాదిరి కపటముతో గూడిన మణిమందు మంత్ర

తంత్రమున సిద్ధులన్నియు, పరిహాసాస్పదములైనవి భ్రాంతి మయము, అసత్యము, అశాశ్వితములైనవి. భక్తియోగము పూర్వోక్త ఫలాతిశయములన్నింటిని, ఆవిధముగా తృణప్రాయ ములగుట వలన, దాని (భక్తి) మహత్వమునెంత యని చెప్ప వలేను.

నానాభావ వికల్ప కల్పిత సరాగద్వేషవిజ్ఞానక
ర్మానుష్ఠాన విధాన లోక రచనాడంభోక్తికా భక్తి సం
ధానాచార నిరాసకృత్ ప్రబల సమ్యగ్ భక్తియోగ క్రియా
జ్ఞాన ధ్యాన పరైక నిష్ఠ శతకం పూర్ణం శివావల్లభా ॥100॥

తా॥ ఓయీ! పార్వతీపతీ! అనేక ప్రకారములైన అభిప్రాయముల చేతను, సంశయముల నుండియు, రాగద్వేషముల చేతనుగూడియున్న, తుచ్ఛమైన కర్మజ్ఞాన కాండములకు సంబంధించిన, జనరంజకమగు డాంభికాచారము, కపట భక్తిని తిరస్కరించు (నిరసించు) నట్టి మహాసామర్థ్యముగల సత్క్రియజ్ఞానధ్యానోపేతమగు శివభక్తి యోగము, యొక్క ప్రశంసను ఎంతగావించినను తక్కువే, ఇక్కడికి శివావల్లభ శతకము సంపూర్ణము,

ఇదు సాక్షాత్ శివయోగ షట్స్థల పరబ్రహ్మలింగలింగైక్యసౌ
ఖ్యద సద్భక్తి పరానుభూతి పరమజ్ఞాన క్రియాచారసం
పద సౌభాగ్య సమగ్ర సద్గురు పద ప్రత్యక్ ప్రసాదాక్షరా
స్పద వాక్ శ్రీముఖ మాయిదేవ విభు సంప్రోక్తం
శివావల్లభా ॥101॥

అవతారిక:- ఇక ఆచార్యుడు ఈ ప్రబంధాంత్యమున తన వాగ్వైభవాన్ని ప్రకటించుకొనుచున్నాడు,

తా॥ శివైక్య ప్రతిపాదకమైనట్టిషట్స్థల విద్యాసాధనము చేత లభించునట్టి. లింగాంగ సంయోగ సౌఖ్యమును గలుగ జేయుట, ఉత్తమ భక్తికి, ఉత్కృష్టమైన అనుభవముగల జ్ఞాన క్రియాచారములకు మూలనివాసియగు, మహిమహిమ గురువు చేత పరిపూర్ణుండగు శ్రేష్ఠునిచేతలభించినట్టి, జ్ఞానాను గ్రహము రూపమైన విద్యాసంపదకు, ఆశ్రయమగు ముఖమండలము గలవాడగు మాయి ప్రభువు చేత ఈ శతకము వివరించబడినది.

ఆవతారిక:- సోమ అనుశబ్దము ప్రణవ స్వరూపమైనదని నిరూపించుచున్నాడు.

ఓ మిత్యక్షరమాతృకాత్రయదద తద్వాక్యస్థమాత్రాత్రయం
నామం శ్రీ మదుమా ఎనల్ పరతరం దీర్ఘం మకారం ద్వితీ
యామాస ప్రథమా ఉకార ముభయం గూడిర్థు మాసార్థకం
సోమం మత్ప్రభువై పురీశనెనలాం ధన్యం శివావల్లభా ॥102॥

తా॥ "ఓం" అను ప్రమాణము నందు అ+ఉ+మ, అను మాతృకాక్షరములు మూడున్నవి, వాటిలో మొదటి "అ" కారము అంత్యమునున్న "మ"కారముతో గలిసి మ+అ,, మా,, అనియ

య్యెను అట్టి "మ" కారము "ఉ" కారముతో గలిసి "ఉ+మా" ఉమాగామారెను, ఇట్టి ప్రణవ స్వరూపియగు ఉమాదేవితో గూడి యున్న వాడు శివుడు గనుక దానికి "స" కారమును జేర్చగా,, స+ఉమా, గలిసి="సోమ" అనునది సార్థకనామము సిద్ధమైనది, అట్టి "సోముడే" జ్ఞానకమను పురమునకు ప్రభువు అయిన నా స్వామిని స్తుతింపగా నేనుకృతార్థుడనైతిని,

అవతారికః- (ముందు పరిచయము) ఆచార్యుడు ఈశతకమును బఠించినవారికి, మరియు విన్నవారికి లభించు ఫలమును గూర్చివివరించును,

ఇవనారోదిదవర్గె కేళ్దవరిగుద్యద్భక్తియోగ క్రియా
స్పదసమ్యక్ పరమ ప్రసన్న పరిపూర్ణైకాగ్ర నిష్ఠాను భూ
తిదసచ్చిత్సుఖరూప నిష్కళ మహాలింగైక్య నిర్వాణ సం
పదనిత్యత్వమనీవుదయ్య కృపెయిం నీనే శివావల్లభా ॥103॥

తా॥ ఓయీ! పార్వతిరమణా? ఇట్టి జ్ఞాన ప్రతిపాదకమగు, శివావల్లభశతకమును బఠించువారికి, మరియు వినువారికిని, భక్తి యోగ సంబంధమగు ఆచరణమునకు ఆశ్రయభూతమగు, ఉత్కృష్టమైనది, మరియు చిత్తైకాగ్రతగల నిష్ఠతో లభించునది. శివ జ్ఞానమును గలుగజేయునదియు, సత్యజ్ఞానానంద స్వరూపమగు నీ మహాలింగము నందలి సామరస్యమను, మోక్షముయొక్క శాశ్వత పదమును దయజేసి అనుగ్రహించుము.

గద్యాంశము:- ఇది సమస్త శివయోగిజనమనోనిలయ మగు శ్రీమన్నిరంజన లింగాచరణ సరసీరుహసౌరభాసక్త, మత్తమధుకరాయమాణ, షట్స్థల సిద్ధాంత స్థాపనాచార్యపరమను జ్ఞానసత్క్రియాయుక్త భక్తి భరితాంతరంగ ప్రణవ పూర్వకపంచా క్షరీమంత్రోచ్చారిత మంజుల భాషా విలాసమగు తోంటద సిద్ధ లింగదేశకుడి చేత విరచితమైన శ్రీమద్వీర శైవాచారసారోద్ధార భక్తి-జ్ఞానవైరాగ్య ప్రతిపాదకమైన శతకత్రయ మహావ్యాఖ్యాన మందలి జ్ఞానప్రతిపాదకమగు"నీశివావల్లభ శతకముసంపూర్ణము.

ఇక్కడకి జ్ఞాన ప్రశంసా పరమగు శివావల్లభ శతకము యొక్కటిప్పణి సంపూర్ణమైనది.

(వే., పం., డా॥ పెద్దమఠము రాచవీరాఖ్య దేవరేణ కన్నడస్య తెలుగు భాషాయాంకృత వ్యాఖ్యానం "శివావల్లభ,, శతకం సమాప్త మగమత్.

"శివం భూయాత,,



# శతకత్రయము

# మహాదైపురీశ్వర శతకము

-: ప్రారంభము :-

( వైరాగ్యబోధకము )

శ్రీమదపారసార కరుణామృతసాగర భక్తలోక చిం
తామణనూత్నరత్న దివిజేంద్ర మునీంద్ర గణేంద్ర దివ్యతే
జోమయ మౌళి మండిత పదాంబుజ సర్వగుణాఖి రామని
స్సీమ ధృతేందు నేను పరమ ప్రభువే మహాదైపురీశ్వరా ॥1॥

ముందువివరణ :- ఇట్లు ఆచార్యుడు శతకద్వయములో భక్తి-జ్ఞానములను ప్రతిపాదించి, అట్టి భక్తి జ్ఞానములు. వైరాగ్యములేనిదే దొరకవుగనుక, ఇకముందటి మూడవ శతకము నందు-వైరాగ్యము నుపదెశించుటకై, ఆది (మొదట)లో పది పద్యములలో తన ఇష్టదేవతయైన ఐపురము యొక్క సోమశ్వరుని స్తుతించును.

తా॥ కరుణామృత రసము చేత నిండిన గొప్ప సముద్రము వంటివాడు భక్తజనుల ఇష్టార్థములనొసగునట్టి చింతామణి వంటివాడు. దేవేంద్రునిలోను, ఋషి శ్రేష్ఠులోను ప్రమథ గణములతోడను నమస్కరింప దగినవాడను. సర్వజ్ఞత్వాద్య నంత కల్యాణములతోడను విరాజిల్లునట్టి యపార శక్తియుతుడను, చంద్రార్థ శేఖరుండును ఉత్కృష్టమైన నిగ్రహానుగ్రహ సమర్థుడును ఆయిన ఐపురము శ్రీసోమెశ్వరా! సర్వోత్కృష్టుడవు గమ్ము,,

పరవృష వీరభద్ర ముఖ సత్ప్రమథ ప్రకర ప్రకీర్ణచా
రురజతశైలమూల మణికీల విశాల విచిత్ర మంటప
స్థిరతరతుంగమంగళమృగాధిప పీఠ సుఖోపవిష్ట దే
వరమణ దేవ దేవపరమ ప్రభువే మహాద్రైపురీశ్వరా ॥2॥

తా॥ వృషభేశువీరభద్రశుమున్నగు ప్రమథశ్రేష్ఠులతో నిండియున్న కైలాసశిఖరపర్వతమునందు రత్నకాంతులచేత ఝుంఝుగాయమానముగా ప్రకాశించుచున్న విశాలమగు మంటపమునందు శాశ్వతమైయున్న మంగళ స్వరూపమైన అత్యున్నతమగు సింహ పీఠమునందు ఆనందముగా గూర్చొనియున్న. దేవాధిదేవ సమస్తేంద్రియాధి ఆర్తత్రాణ పురాధీశుడైన ఓయీ! సోమేశ్వరా! సర్వోత్కృష్టుడవుగమ్ము.

భూమిధరాతపత్రశతపత్రసుపుత్ర-సరోజమిత్రసు-
త్రామ-సుధామయూఖ-దివిజాత-దితిప్రభవోరగాప్సర
స్తోమ నిబర్హణ ప్రళయవహ్ని సమప్రభ కాలకూట కూ
టామళ రామకంఠ పరమ ప్రభువే మహాద్రైపురీశ్వరా ॥3॥

తా॥ విష్ణు బ్రహ్మ సూర్యుడు-చంద్రుడు, దేవతలు-దానవులు-నాగులు, అప్సరసలు-వీరిసమూహమును నాశమొందించుచున్న ప్రళయ కాలములోని అగ్నికి సమానమైన కాంతిగల మహావిషమూతొగూడి మనోహరముగా విరాజిల్లుచున్న స్వచ్ఛ

మైన కంఠముఁగలిగియున్న ఓయీ పరమేశ్వరా! సర్వోత్కృ
ష్టుఁడవుగమ్ము"

దారువనాశ్రయాశ్రిత తపోజపహోమయమాది సత్క్రియా
చార విముక్తమార్గ నియతద్విజరాజ వధూజనస్మరా
పార వికార తాపకృతి కారణ భిక్షుక వేష కృత్రిమా
కారకళావిలాస పరమప్రభువే మహదైపురీశ్వరా ॥4॥

తా॥ దారుకావనంలో నివసించి జప-తప-హోమయాగము
నకు సంబంధించిన సత్క్రియాచరణములో తత్పరులైన బ్రాహ్మ
ణులు తమ భార్యలయందపారమైన మన్మథ వికారమైన తాప
మును గలుగజేయుటకు గారణమగు కపట భిక్షుక వేషమున
విలాసమున్న ఓయీ! సోమేశ్వరా! ఉత్కృష్టుడవుగమ్ము

అహరహరంబుజోద్గమ సహస్ర కృతార్చన తత్పరత్వ ని
ర్వహణ నిజావధాన నియమస్థలనోత్కట భక్తిభావ స
న్నిహిత గుణార్పితాత్మనయనాచ్యుత దివ్యసుదర్శన ప్రద
ప్రహసిత వక్త్రపద్మ పరమ ప్రభువే మహదైపురీశ్వరా॥5॥

తా॥ ప్రతిదినమున ఒక వేయి తామరకమలములతో తప్ప
కుండ శివుని బూజించుచున్న వ్రతమునఅధికమైన మెలకువతో
నుండి, ఒకదినమున వాటిలో నొకకమలము తక్కువగుటచేత
వ్రతమునకు భంగమువాటిల్లె సమయమున, తన దృఢమైన భక్తి

పొంగి పొరలుచుండగ వెనుకంజ వేయక ధైర్యముతో దిట్టతన ముతోను తన గన్దామరము (కమలమువంటిదన కన్నును) పెరికి తామర కమలమునకు బదులుగా శివపాదములకు సమర్పించిన విష్ణువునకు చక్రాయుధమును అనుగ్రహించిన. చిరునగవుతో గూడినట్టి సోమేశ్వరుడు సర్వోత్కృష్ఠుడగుగాక

సర్వగ సర్వ తత్వవర సర్వగుణాధిక సర్వదేవరా ట్
సర్వ నమస్య సర్వ సుఖభోగ విధాయక సర్వభూతకృత్
సర్వ విదాద్య సర్వ జగదాత్మక సర్వకళా ప్రపంచభృత్
సర్వ పవిత్రగాత్ర పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥6॥

తా॥ సర్వవ్యాపి, సమస్త తత్వాగ్రేసరుడు, షడ్గుణైశ్వర్య విశిష్ణుడు, విష్ణువునకు సమస్త దేవాది దేవుడు, సర్వవంద్యుడు. సర్వ భోగభాగ్యుడు, సమస్త ప్రాణి (జీవుడెటు)ల సృష్టికర్త. సర్వజ్ఞుడు. సర్వమునకు మొట్టమొదటి వాడు సకలజగత్స్వరూపుడు, సమస్త విద్యాధీశుని, అష్టమూర్తి యగుటవలన సకల జగత్తునకు తన శరీరమే స్థితిముంటవలనను ఓయీ॰ మహేశ్వరా విజయీభవో త్కృష్ణుడవుగమ్ము"

బిందుమయ త్రిశక్తిమయ నాదమయా సదన్మయాక్షరా
స్పందమయ ప్రపంచమయ భూతమయ ప్రణవస్వర త్రప్రభా
వృందమయాత్మ తత్త్వమయ చిన్మయ జీవకళా సుధామయా
నందమయాది దేవ పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥7॥

తా॥ బిందుస్వరూపమా ఇచ్ఛాది శక్తి స్వరూపమా! నాద-స్వరూపమా! కారణ కార్యస్వరూపమా! జగత్స్వరూపమా! అకారాద్యక్షర స్వరూపమా! పంచ భూతాత్మకుడా! ఓంకార మునప్రకాశించునట్టి కాంతిమయా! లింగాంగ స్వరూపుడా! జ్ఞానమయుడా! జీవకళామృత స్వరూపుడా! ఆనంద స్వరూపా! సమస్తదేవతలకు మొదటివాడవైన ఓ పరమేశ్వరా! సర్వోత్కృష్టుడవుగమ్ము"

నిత్య నిరీహ నిర్మల నిరంజన నిష్కళ నిష్ప్రపంచ నిష్ప్రత్యయ నిర్వికల్ప నిరుపాధిక నిశ్చల నిర్వికార్మ నిష్క్రృత్య నిరూప్య నిర్గుణ నిరావరణాఖిధ నిర్విశేష నిస్తుత్య నిరస్త నింద్య పరమ ప్రభువే మహాదైవురీశ్వరా॥8॥

తా॥ శాశ్వతుడవు ఇచ్ఛారహితుడవు. కళంకరహితుడవు. నిష్పాపుడవు. కలాశూన్యమైన ప్రపంచరహితుడివి, తనకు మరొకటి కారణముగాని, సంకల్ప వికల్పములులేని, ఉపాధి రహితుడవైన, చలనములేని, భూతవికారములేని, వేదవేదాంత ప్రతి పాద్యుడవైన, గుణాతీతుడవు. మాయావరణములేని, తనలో మరోవిశేషములేనట్టి. స్తుతించుటకుశక్యముగాని, మల త్రయదూరవర్తియగు ఓపరమేశ్వరా! సర్వోత్కృష్టుడవుగమ్ము"

అక్షర సాక్షరాత్మక నిరక్షరరూప కళాక్షరాంగ మూ
లాక్షర జీవమంత్ర నిగమాక్షర సంస్తవనీయ సర్వ మం
త్రాక్షర దక్ష నిష్కళ శివాక్షర లక్షణ లక్షితాది పం
చాక్షర నామధామ పరమ ప్రభువే మహాద్రైపురీశ్వరా ॥9॥

తా॥ మృత్యువులేని సర్వవర్ణ స్వరూపుండవైన-మాయా రహితుండవైన. ఆకారాది విసర్గాంతమగు షోడశకలాక్షరములే శరీరమైయున్న, ఓంకారమునకు జీవాక్షరమైయున్న - "హ"కార స్వరూపుడవైయున్న, వేదమంత్రాక్షరములతో కొనియాడబడిన-సప్తకోటి మహామంత్రములందున్న అక్షరములన్నింటనున్నట్టి అక్షరములన్నియు అత్యంత శ్రేష్టమగు "శివ,,యను రెండక్షరముల లక్షణముచేత గూడిన ముఖ్యమగు పంచాక్షరీ మంత్ర (వాచక)మున ఆశ్రయభూతుడవైన ఓయీ! పరమేశ్వరా! సర్వోత్కృష్టుడవుగమ్ము.

లింగ చిదాత్మలింగ గురులింగ శివాహ్వాయ లింగ విశ్వ కృ
ల్లింగ సుసూక్ష్మలింగ వరలింగ వరాపరలింగ సర్వవి
ల్లింగ నిజాంగలింగ చరలింగ చరాచరలింగ భక్తహృ
ల్లింగ విశుద్ధలింగ పరమ ప్రభువే మహాద్రైపురీశ్వరా ॥10॥

తా॥ ప్రపంచముయొక్క ప్రళయోదయములకు స్థానమగు లింగ స్వరూపమా! గురు లింగ స్వరూపమా! గురు లింగ శివలింగములను బేరుగలవాడా! జగన్నిర్మాణక లింగమా!

స్థూలనేత్రమునకు గోచరించని సూక్ష్మలింగమా! ఉత్కృష్ట సర్వశ్రేష్ఠమగులింగమా! బ్రహ్మ-విష్ణ్వాది దివ్యదేవతల కంటెను శ్రేష్టమగు సర్వజ్ఞలింగమా! అంగ లింగ-రూపమును దాల్చినవాడా! జంగమలింగమా! జ్ఞానక్రియాత్మకలింగమా? భక్తుల హృదయ మందు ప్రకాశించునట్టిలింగమా। నిర్మల రూపమగు పరమేశ్వరా నీకు జయమగుగాక.

అవతారిక;- ఇట్లా చార్యుడు తన ఇష్టలింగ దేవతా స్తోత్రమును గావించి గురువునకు సమస్కరించుచున్నాడు.

శ్రీగురువే నమశ్శరణలోక సుఖైకకరాయ శిష్యహృ
ద్రోగభిష క్తమాయ భవకర్మ సమిద్దహనాగ్నయే శివై
క్యాగమ సారవీర విమలాశ్రయ ధర్మపదప్రదాయతే
రాగవిరాగదూర పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥11॥

తా॥ "భిషిక్తమంత్వాంభిషజాంశ్రృణోమి,, అనిఋగ్వేద ప్రమాణము. ఇచ్ఛావైరాగ్యమునకు దూరానసున్నట్టి ఓయీ! పరమేశ్వరా! భక్తజనులకు సుఖదాయకుడవు-శిష్యహృత్కమలమునందున్న, భవరోగమును నివారించుటలోనుత్తమవైద్యుడవు. సంసారవ్యాపారమనుకట్టెలను దహింప జేయు అగ్నిలింగాంగ సామరస్యక బోధకమగుశివాగమ శాస్త్రములందు గొప్పవాడు నిర్మలుడు వీరశైవ ధర్మమును చూయించునతడుఐన శ్రీగురువు స్వరూపుడవైన నీకు నమస్కారము.

"యశ్శివస్సగురుర్ జ్ఞెయో-యోగురుస్సఃశివస్మృతః। సత
యోరంతంకుర్యా - ద్ధానావాప్త మహామతిః॥ అనువాక్యమునను
సరించి ఆచార్యుడిక్కడ గురువును. శివాభిన్నుడిగా భావించి
నమస్కారాత్మకమగు మంగళము నాచరించియున్నాడు"

గురుపదసిద్ధ మద్గురువె సద్గురుతత్వవె తత్వసార చి
ద్గురువె భవప్రపంచ గుణదోష నివారణ వైద్యతంత్రకృ
ద్గురువె శరీర దుఃఖ పునరాగత దుర్గతి కర్మకాండభి
ద్గురువె గురుత్రినేత్ర పరమ ప్రభువే మహదైపురీశ్వరా॥12॥

తా॥ ఆచార్య పదవిలో ప్రసిద్ధిజెందిన నాయొక్క గురు
వా? సమస్తతత్వాతీతుడా? జ్ఞానగురువా। జనన మరణాత్మక
మగు నంసారము యొక్క గుణదోషములను బోగొట్టు (నివా
రింపజేయు) వైద్య శాస్త్రమును రచించిన గురువా। పునరపి జన
నం-పునరపిమరణం-పునరపిజననీ-జఠరేశయమ్,, అను-దేహోతా
పకరమైన, దుర్గతికి స్థానమైన కర్మకాండమును ఛేదించిన మద్గు
రువా? మూడునేత్రములుగల పరమేశ్వరుని స్వరూపమగు
ఓయీ! గురువర్యా। సర్వోత్కృష్టుడవుగమ్ము" నాస్తితత్వం
గురోఃపదమ్,,

పరుసముమం లసద్గురు పదాంబుజమం సమవెందు కల్పిసల్
నరకమదెంతెనల్ పరుసమం పరుసం నెరెమాడదాగి మద్
గురుపదమా గురుత్వమనె మాడువ కారణ మాం నిరంతరం
గురుశరణెంబెనయ్య పరమప్రభువే మహదైపురీశ్వరా ॥13॥

తా॥ సిద్ధరసమును. గురుపాదకమలమును ఒకదాని కొకటి సమమని చెప్పినవాడికి నరకము దప్పదు. ఏలనన గురు పాదకమలమునకు సిద్ధరసము సమానమెన్నటికినిగాదు, ఎట్లనగా సిద్ధరసము లోహమును బంగారముగా మార్చునుగాని, దనవలె సిద్ధరసముమరోదానిని జెయనెరదు. గురుపాదమట్లుగాకతన అను గ్రహగమునకులోనైన ఇతరునిగూడ గురువుగానే మార్చును. అందుచేత నేను ఎల్లప్పుడు గురువునే శరణు వేడెదను.

అవతారిక :- ఇట్లు ఆచార్యుడు సంసారనిరాస పూర్వక ముగా జ్ఞానమును నీడు మని ప్రార్థించుచున్నాడు:-

అభిమత సిద్ధిదానపరనెందు కృపామృత సింధువెందు గ
ర్భ భవజరామృతి ప్రభృతిదుర్భయ సంహారనెందు చిత్కళా
విభుగురునాథ నిన్న నిరదిత్తనిదేం దయగెయ్యలొల్లె పేళ్
త్రిభువన మూలలింగ పరమ ప్రభువే మహదైపురీశ్వరా॥14॥

తా॥ స్థూలాది దేహత్రయమునకు గారణుండవైన ఓయీ పరమలింగమూర్తి! నీవు ఇష్టార్థసిద్ధిని ప్రసాదించువాడవు. దయా మృత సాగరుండవు. జనన-మరణాదిభయనివారకుడవు. ఆనే జ్ఞానచైతన్యమునకు ప్రభువైన శ్రీగురుస్వామియుపదేశించినిన్ను నాకు అనుగ్రహించియున్నాడు. ఐనను నీవు, అదెందుచేతనో నన్నుకరుణించడంలేదు. చెప్పుమా!

విశేషము:- "యథానియుక్తోస్మితదాకరోమి. అను పురాణ వాక్యము.

వరగురునాథనెంతిరిసిదంతిరదిద్దొడె నీనుమాను మీ
ర్వరు సలెకెట్టుపోపుదిదు నిశ్చయమేతకె సుమ్మనిర్పె కే
శరస విచారమిల్లదిరలేతకె నీనిరహేళిదంతె యా
నిరదొడె ఖితియైసె పరమ ప్రభువే మహాదైపురీశ్వరా ॥15॥

తా॥ ప్రభుపైన ఓపరశివమూర్తి! శ్రీగురు శ్రేషుడెట్లుండుమని యాదేశించెనో అట్లుండనిచో నీవు నేను ఉభయులము చెడిపోవుట నిజము. కారణమేమనగా! నాతో నేలాంటి పొరపాటు లేదు. నీవాదేశించినట్లుగా యాచరించని, యెడల నాకు భయము? మీరాజ్ఞాపించినరీతిగా నేను నడచుకొనుటకు సిద్ధముగా నున్నప్పుడు, గురువు నిరూపించిన పగిది నీయొక్క కార్యమును నీవు జేయనిచో నీయొక్క భక్తవాత్యల్యమునకు కొరత వాటిల్లును. నిన్నువిశ్వసించిననాకు నిష్ప్రయోజనమని భావము.

శివశివ పూర్వజన్మకృత కర్మఫలం భవితవ్యమెంబ వా
క్యవె దిటమప్పొడక్కట పునర్జననం గురుహస్తదిందె సం
భవిసి శివాత్మరాగి శివమంత్ర శరీరగళాగి పూర్వ జ
న్మ వనళిదవర్గదుంటె పరమ ప్రభువే మహాదైపురీశ్వరా॥16॥

"ఆవశ్యమనుభోక్తవ్యం!- కృతం కర్మశుభాశుభం అను వాక్యము ప్రకారం "సద్గురోః పాణిజాతస్య-స్థితిసద్భక్తిసంగినః।

ళీయతేచ మహాలింగే శైవస్సర్వోత్తమోత్తమః॥. అను ఆగమ ప్రమాణముంది. సంచితాదులు లేవని పరమార్థము.

తా॥ పూర్వ జన్మమునందు ఒనర్చిన శుభాశుభ కర్మఫలము ఇహజన్మమున అనుభవించక తప్పదు. అను వాక్యమే నిజమైనది. ఈ పక్షమున గురుకరకమలములనుండి జన్మించిన శివ స్వరూపులై. మంత్ర శరీరులుగా బరిణమించి పూర్వ జన్మమును నశింపజేసినవారికి,

"స్వప్నకాలేకృతం పాపం-బ్రహ్మహత్యాది కంచయత్
యథా ప్రభోధ సమయే తన్మిథ్యాభవతి స్వయం॥
తథాకృతం మహాపాపం లింగధారణతః పురాః
య దస్తి తల్లయం యాతి లింగధారణతః పరం॥ అను

ప్రమాణమును అనుసరించి ఇట వివరించబడిన సంచిత, అగామి, ప్రారబ్ధరూపమైన కర్మఫల బోగమనునది వర్తించదు. "లింగాంగసంగినోవత్స, పునర్జన్మ నవిద్యతే,, అను ఆగమ ప్రమాణం అనుపరించి శ్రీ గురువనుగ్రహించిన లింగధారణము ననుసరించి శ్రీ గురు వనుగ్రహించిన లింగదారణా సంపన్నుడైన పరిశుద్ధముక్తునకు పునర్జన్మము గూడ లేదని భావము.

భవమళిదుం భవప్రభవ కర్మఫలం కిడదెంబ వాదమీ
భువనదొళుళ్ళొడుంటు మొదలిల్లద భూమిరుహక్కె శాఖె బం
జెవనితెగాత్మజం మృతశరీరిగె జీవకళాప్రవేశమెం
బిపు పెరతేను దేవ పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥17॥

తా॥ లోకమున తల్లివేరు లేని చెట్టుకు కొమ్మలు, ఆకులు పూలు, పుట్టుననునది కల్ల. గొడ్రాలికి సంతానము గలుగుట శవమునకు ప్రాణము వచ్చుట నిజమైన యెడల భవకర్మ నశించినను ఆభవకర్మసంబంధమైన కర్మ ఫలము నశించదు. అను వాక్యము నిజమగునేమో అంతె కాని కర్మఫల మున్నదనే వాదము నిజమైనది గాదని భావము.

ఇదకె శివాంగలింగకృతనంగసమర్చనమేకె కాలక
ర్మదురిత దోష పీడెయెడెగొండనువాసరమార్దు నిస్తుషం
సదెవొడె భక్తరేం భవిగశేం శివభక్తి గుణప్రభావ మి
ల్లదొడె విభేదమేను పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥18॥

తా॥ ఎల్లప్పుడు శివభక్తుడిని భూతకాలాది త్రికాలముల యంలోని సంచితికర్మ యొక్క ఆ కర్మ సంబంధమగు పావ రూపమగు దుఃఖము అడ్డుగాలుచాచి అప్పటించి భయపెట్టినచో ఇట్లు హింసకులోనైన యెడల లింగాంగ సంబంధ మెందులకు? లింగార్చన యెందులకు? కర్మ దుఃఖమును దొలగింపచేయని శక్తి దానికి లేని పక్షమున అట్టి లింగాంగ సంయోగాదుల నుండి ప్రయోజనమేమి? శివభక్తియందు మహత్వములేనిచో భక్తులకు ఇక భవులకుగల భేదమేమి.

ఆగలదక్కె తప్పిదుదదేను విశేషిసి కర్మపీడనం
తాగువ వేళెయొళెగెదు తప్పిసి తన్నిమిషం సముద్ధరి
ప్పాగుణమిల్లదిర్దొడె భవిత్వకె భక్తికకేను బేదమ
య్యొ గురునాథనాథ పరమ ప్రభువే మహదైవురీశ్వరా ॥19॥

తా॥ ఓయీ! గురుదేవా! ఆ కర్మ ఫలము సంభవించి నచో, సంభవించుగాక అంతటితో జరిగిన దోషమేమి? ఆ కర్మ దుఃఖము తటస్థించే లోపున తక్షణమే ఆ కర్మబంధమును ఛేదించి ఉద్ధరించే శక్తి భక్తికి లేనియెడల భవితనమునకు భక్తునకు గల భేదమేమిటి?

ధరెయొళె దేహధర్మగతియొంధె సమస్త శరీరిగళ్గె భ
క్తరిగె శుభాశుభద్వివిధ కర్మఫలం సమవాగలాదొడే
నిరదదు ముట్టి బందెడెయొళాంతు దురాగతదుఃఖమం సము
ద్ధరిసదొడేకె భక్తి పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥20॥

తా॥ ఓయీ పరమశివమూర్తి! భువిలోని సమస్త ప్రాకృత జనులకు అప్రాకృ భక్తులకు దేహధర్మ వ్యాపారము ఒకేరీతిగా నుండును. వారిద్దరికి గలిగె శుభాశుభ కర్మఫలాలు ఒకే రీతిగా నుండును, ఐనను అంతమాత్రము చేత జరిగిన కొరత ఏమిటి? ఆట్టి శుభాశుభ కర్మఫలము భక్తుని దాకకమొదలె భక్తుని భక్తి ప్రభావము దానిని ప్రతిఘటించి తొలగించే శక్తి లేనియెడల అట్టి భక్తి ప్రయోజనకారియైనదికాదు.

శీతగృహీత భీతనమశానళ తేజమనప్పిదంతె రో
గాతి విశేష దోషహరకౌషధ సేవనెయొద్దుదంతె ని
ర్ధూత శరీరదుఃఖభయ హొగదొడేతర దేవపూజె సా
కేతర భక్తియయ్య పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥21॥

తా॥ చలిచేత బాధపడువాడు నిప్పువద్ద కూర్చుండిన ఆ చలి తొలగదాఏమి! రోగి ఔషధమును సేవించిన ఆరోగము తొలగదాఏమి! అట్లే భక్తునకు దేహము నాక్రమించిన దుఃఖము బంధన భయములు తొలగిపోగూడదా? అట్లు తొలగని ఎడల అదెట్టి పూజ? అదెంతటి భక్తి· వాటిని బరిత్యజించుటయే మంచిది గదా!

దినదెడెయుంటె సూర్యనుదయక్కె తమోవిలయక్కె
హచ్చక
బ్బునదశివింగె సిద్ధరసదాక్రమణక్కెతె దేవదేవ నీ
ననుకరిసిర్దుపుం దురితదుఃఖభయక్షయకందు నాశియెం
బినితు విళంబమేకె పరమ ప్రభువే మహద్రైపురీశ్వరా ॥22॥

తా॥ ఓమహద్రైపురశ్వరా! సూర్యోదయముతో (తెల్ల వారగనె) చీకటి దొలగూడదా? సిద్ధరసము స్పర్శచేత లోహము బంగారంగా మారగూడదా? ఆలస్యమెందులకు నాకు నీయను గ్రహము గలిగినను ఈ పాపము-దుఃఖము-భయాదులు దొలగుటకు, నేడు-రేపు అని వృథాకాలయాపన మెందులకు?

ఆరిగె పేళ్వెనారిగె పలుంబువెనారిగె తోర్పెనెన్న సం
సార దురాప్తదుఃఖభయమం నినగల్లదె భక్తలోకమం
దార వరాభయప్రభ భవచ్చరణాంబుజ భక్తియెత్త సం
సారద భీతియెత్త పరమ ప్రభువే మహద్రైపురీశ్వరా ॥23॥

తా॥ పరమ ప్రభువైన ఓగురుదేవా! నీవు భక్తజనులకు కల్పవృక్షమువలెనున్నావు. వరములను అభయమును గరుణించెవాడివి. ఇట్టి నీకుగాక నా ఈ సంసారం యొక్క భరింపరాని దుఃఖ-దురవస్థలను జనన-మరణముల కష్టములను ఇంకెవరితో జెప్పుకోవాలి? ఇంకెవరికి జూపాలి? నీపాదకమల భక్తియెక్కడ? ఈ సంసారము బీతి ఎక్కడ?

పరమ పతివ్రతా సతి నిజప్రియవల్లభనొల్లదిర్దొడ
తృ్యరుతరదు ఖభావదినళల్వ బళల్వ కెరళ్వ బైవవోల్
శరణరు వీరశైవతతినిష్ఠరు కోపిసరేనదిన్నుపా
మరర్గెనలుంటె శక్తి పరమ ప్రభువే మహాద్రైపురీశ్వరా॥24॥

తా॥ ఓయీ! గిరిజావల్లభ! తన ప్రాణ ప్రియుడు వల్లనని నిరాకరించినచో వేసరజెందిన పరమ పతివ్రతియగు సతి (భార్య) అత్యంత దుఃఖముతో ఏడుస్తు - విసుగుజెంది కోపముతో తూలనాడు (తిట్టు) రీతిగా శివశరణులు అతీవ నిష్ఠ గల వీరశైవులు ఓ ఈశ్వరా! నీపై కోపించకుండ ఉంటారా! మిగత పామరులకు ఆ శక్తి అధికారము ఉండదు గదా!

ఆమయ ఘాతియిం విషయదండలెయిం బహుదుఃఖదొగ్గినిం
తామసదిర్కెయిం నెరె ముదంగెడుత్తె దెనె దేవ భక్త కా
యో మమకాయమెంబ వచనం దిటమాదొడె రక్షిసెన్నువం
కామపురాంతకారి పరమ ప్రభువే మహాద్రైపురీశ్వరా ॥25॥

తా॥ సంసారము దుఃఖము యొక్క పీడ, విషయ వాసన-యొక్క పలురకములైన నొప్పులు (బాధలు) స్థిరపడిన మరుపు వీనివలన అధికసంతోషము నశించినది. కామ - కాల-త్రిపురములను సంహరించిన (పరిమార్చిన) ఓదేవా! "భక్తుని దేహమె నాదేహము అను నీ శివాగమ వచనము నిశ్చితము (దృఢము) ఐన ఎడల నన్ను ఈ బాధలనుండి గాపాడుము.

భువన చతుర్దశైక విభువాగి విరాజిసుతిర్ప నిన్న వై
భవదొళగాం దరిద్రనెనిసిర్పుదిదేం కెలవూరనాళ్వ మా
నవనొళగాగి తన్ననిరదాశ్రయిసిర్దరనొల్డు రక్షిపం
శివ నినగేనపూర్వ పరమ ప్రభువే మహాదైపురీశ్వరా ॥26॥

తా॥ ఓపరమ ప్రభువా? నీవు పదునాలుగు లోకములకు ఒక్కడివే స్వామిపై విరాజిల్లుచున్నావు. నీయొక్క వైభవములో నేనొక్కడిని, నిరుపేదనై యున్నానని పలుపల్లెలను ఏలెడు (పాలించు) వాడు తన పక్కన యున్నవారిని ప్రేమతో బెంచును ఓ శివా! నన్ను రక్షంచుటకు నీకున్న కొదువ (కొరత) ఏమిటి?

సకలసుఖైకకర్తృవహ నినొన్నడగూడి విరాజసుత్తమీ
వికళ మనుష్యరం బరిదె బేడి లఘుత్వమనెద్ది దైన్యదిం
దకటకటా ముదంగెడలు నొళ్పరెపేళ్ నిజభక్తవత్సలా
ప్రకట కృపాసముద్ర పరమ ప్రభువే మహాదైపురీశ్వరా॥27॥

తా॥ ఓయీ భక్తవత్సలా! కృపాసాగరా: సకల సుఖములకు ప్రముఖ ప్రభువైన నీతోనుండి ఒవ్వుచున్నట్టి నేను దీనత్వము చేత ఈ అల్ప(తుచ్ఛ-నీచ) మానవులను వృధాగా వేడుకొని తేలికయ్యేతి అగౌరవమునకు లోనైనచో దానిని నీవు దిలకిస్తు గూర్చోదగునా? అనతిమ్ము ఓ ప్రభూ! అకటకటా!

క్షీరసముద్ర సన్నిధియొళిర్దు పిపాంసితనాగి బావియం
హారెయనాంతగుళ్వవనొలాగ్గు సమస్త సఖైకసిద్ధివి
స్తారకనప్పనిన్ననుపధావిసదన్య మనుష్య మాత్రమం
హారువ బుద్ధియెన్న పరమ ప్రభువే మహాదైపురీశ్వరా ॥28॥

తా॥ సమస్త సుఖములను ఇచ్చుటకు సమర్థుడవైన నిన్ను ప్రార్థించకుండ ఇతర మనుష్య మాత్రులను వేడుకొను నా బుద్ధి పాలసముద్రము చేరువలో ఉండి దప్పిక చేత పార (గునపము)తో బావిని త్రవ్వినవాడివలె అయినది,

బేడిదవర్గె బేడిద పదార్థమనీవుతె నీనదారువుం
బేడద భక్తిసౌఖ్య పరిణామపదస్థితియ ప్రభావదిం
దాడుతె పాడుతిర్పతుళ భక్తియనెన్నొళ యత్నదిందె కై
గూడిసి రక్షిసయ్య పరమ ప్రభువే మహాదైపురీశ్వరా ॥29॥

తా॥ ఓయీ! మహాప్రభూ! వేడినదానినొసగుతు నేను వేరెవారిని వేడకుండ భక్తి సుఖముయొక్క పరిణామ పదస్థితి

ప్రభావముచేత ఆడుతు-పాడుతు అత్యంత భక్తిని నాలో ప్రయత్న
ముతో సఫలమొనర్చి గాపాడుమయ్యా పరమ ప్రభు మహాద్రైపు
శ్వరా!

ಕನಸಿನೊಳಾದೊಡಂ ಮಗನೆ ಬಾ ನಿನಗೆಗತಿಯೀ ಪ್ರಯತ್ನಮೀ
ಯನು ವಿದರಿಂದನೂನ ಘನಸಂಪದ ಸಿದ್ಧಿಯಿಪ್ಪೆಕ್ಕೆ ಚಿಂತೆ ಬೇ
ಡೆನುತೆ ಕರಾಬ್ಜಮಂ ಶಿರದೊಳಿಟ್ಟು ಕೃಪಾಮೃತ ಸಾರಪೂರ ಲೋ
ಚನದೆ ನಿರೀಕ್ಷಿಸಯ್ಯ ಪರಮ ಪ್ರಭುವೇ ಮಹಾದ್ರೈಪುರೀಶ್ವರಾ ॥30॥

తా॥ ఓస్వామి! స్వప్నమునందైనను దర్శనమియ్యి. కుమా
రా రారమ్మని పిలువుము. నీవే సద్గతి, దీనికి ఉపాయము జూపు
ము! ఈ పని జేయుము, దీనివలన నీకు పరిపూర్ణమైన గొప్ప
దైన సిరసంపద-గలుగును. దీనికై చింతించకుము అనిచెప్పుతునీ
యొక్క కరకమలమును నామస్తకమునందుంచి కరుణామృత
ముతో నిండిన కటాక్షముతో నిరీక్షించుము ప్రేమార్ద్రచూపుతో
నన్ను అనుగ్రహించుము అనియాశయము.

ಅಳದಿರು ಕಂದ ನಿನ್ನಖಿಳಮತ್ತೈಕಫಲೋದಯ ಸೌಖ್ಯಸಿದ್ಧಿಯಂ
ನಳೆ ನಿನಗಿತ್ತೆ ನಂಜದಿರು ಚಿಂತಿಸದಿರ್ ಮನಂಗುಂದದಿರ್ ವೃಥಾ
ಕಳವಳವೇತಕಾನಿರಲು ಬೇಡ ಮನೋವ್ಯಥೆಯೆಂದು ನೇಹದಿಂ
ತಲೆದಡವುತ್ತೆ ನೋಡು ಪರಮ ಪ್ರಭುವೇ ಮಹಾದ್ರೈಪುರೀಶ್ವರಾ ॥31॥

తా॥ ఓయీవత్సా! శోకింపకుము (కంటతడిబెట్టకు)
నీవడిగిన ఫలమును, అభ్యుదయమును, సౌఖ్యసిద్ధిని మిగులనీ

కొసంగుదును, భయపడకుము, అధైర్యపడకుము నేనుండగనీకేల చింత (దిగులు) పేరాశవలదు అని ప్రేమతో తలపై హస్తముంచి కృపతో జూడుమోస్వామి.

సలుగెయోశెందెసె బరిదిల్లదుదెల్లమనుంతు మాడి నీం
సులభతెయిం తొదల్నుడియనాలిసువల్లి వినోదశీలనెం
దలసదె సాకదంతిరలు నిన్న పదాంబుజభక్తి భాగ్యని
శ్చల సుఖమం కుడయ్య పరమ ప్రభువే మహదైపురీశ్వరా
॥32॥

ఓ ప్రభూ! ఓ తండ్రి! నీవు నీశిశువులొదలు (తడబడు) మాటలను చిత్తగించుటలో ప్రీతి గలవాడివని, చనువుతో నున్న వాడివని దెలసి ప్రేమమీర కానిపోని గుణములనన్నింటిని నీలో గల్పించి వేసర జెందకుండ ఆడితినిగాని వేరొండుగాదు, నీ పాదపద్మము యొక్క భక్తి భాగ్యమును, స్థిరసుఖమునునాకను గ్రహించుము.

పుట్టిదుదంజదల్లదొడె ముట్టిదుదంజదెనిప్పుదొందు నాణ్
బట్టియ గాదెగొందొరె విశేషమదెంతెనె నిన్న తేజదిం
పుట్టి మగుళ్దు నిన్నువనె ముట్టిద కారణమంజెనంజనాం
నెట్టనె ధీరనయ్య పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥33॥

తనకు బుట్టినది, తనకు భయపడదు, తనసుదాకిన (గూటినది) తనకు భయపడదు. అనుసామెత మేరకు దీనికం

లెను నాదొకగుణము (యోగ్యత) గొప్పదైనది. ఆదేదన. ఓ ప్రభూ! నేను నీయొక్క ప్రభావముచేత బుట్టి మరియు నీతోనె గలిసియుంటవలన భయపడక బాగుగా ధైర్యశాలినైయున్నాను. నీతో చనువుగానున్నాను.

సలె మమకృత్యహంకృతి వికృత్యవగాఢవిమూఢ లౌకిక
స్థలదొళమర్దు సర్వవిషయంగళొళానెనగెంబ మోహదిం
చెలిసి వృథాభిమానభరభారకె బిగ్రనె బీగి సాయదం
తెలె పరిరక్షిసయ్య పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥34॥

ఓయీ! మహాత్మా. నాది-నేను-నాకు-అనునహంకారములతో నిండి అజ్ఞానమయమైన ఈ లౌకికమునందు మునిగి (గ్రుంకులిడుతు) ఏవేని (అన్ని) విషయములందును నేను-నాకు-నావి అని మోహించి చలించి వ్యర్థముగ గొప్ప అభిమానముతో విగ్ర వీగి ఆశ్చర్యమునకులోనై నన్ను చావునుండి గాపాడుము.

ఇదర విశేషమేనిదర దొడ్డితదేనొళ బొళ్ళియాద వే
షద బలుహేనిదక్కె హొర హంచెయతేనహుదేను మాగదా
గదు బలు కాడబేడ నిజ భక్తియెనిత్తు భవత్ ప్రసన్న తా
సదనదొళింబిడయ్య పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥35॥

ఓమహాత్మా! ఈ బయటి ప్రపంచముయొక్క గొప్పదనముతో బనియేమి? లోపలపొల్లుగా నుండి పై వేషమును డాంబికముగా నున్ననేమి? ఈ బహ్యారంగులోనేముంది, ఏమిగా

గలదు? (ఏమియుగాదు) కానేరదని తాత్పర్యము, కావున ఓస్వామి! వృధాగానన్ను బీడింపకుము. నీ నిజమైన భక్తినొసగి నీ కరుణామంటపమునందు నాకు ఆశ్రయమిచ్చి నన్ను గూర్చుండబెట్టుకొనుము

బహు విధ దోషదుష్టతమ మాదొడె మాత్మ శరీరమాత్మ నిగ్రహకరమాగి తోరదె గుణాధికమాగియె తోరువందదిం
సహజ శరీరమాగె నినగక్కట నిన్న శరీర భక్త సం
స్పృహ నిజభక్తకాయ పరమ ప్రభువే మహాదైపురీశ్వరా॥36॥

తా॥ భక్తుని శరీమే నీ శరీరమైయున్న ఓ ప్రభూ! జగత్తులో తనదేహము బహుదోషములతో గూడియున్నను అది అందముగ నగుపడు రీతి నీదేహమైయున్న ఈ భక్తుని దేహమున దోషములను జూడకుము. ఇది నీదెసహజ శరీరమైయున్నది. భక్తుని కోరిక కధీనమైయున్నది. అందువలన అక్కరతోనను గ్రహింపుము.

హొరగొళగెన్నదెన్న కరణంగళొళెల్లియుమిర్ప విన్న నా
సరివొడుపాయవావుదు మనం మనసం మననీయమెంబ
మూరరమయమైదె నిన్న మయమామయమెన్నమయం పర
స్పరం తెరహినితిల్ల దేవ వరమ ప్రభువే మహాదైపురీశ్వరా
॥37॥

తా॥ పరిపూర్ణుడా! లోన వెలుపలననకుండ నాసమస్త కరణములలో నిండియున్న నిన్నుగుర్తించె ఉపాయమెట్టిది?

మనసు, మననీయము - మననము. ఈ మూడును నీస్వరూప మయ్యేయున్నది అట్టి నీస్వరూపమే నాస్వరూపమైయున్నది. పరస్పరముగ ఉభయులలో ఎలాంటి భేదములేదు

అవతారిక:-ఇక శివానుగ్రహమే భక్తికి మూల కారణ మని వివరించుచున్నాడు.

అరిద పెనెంబవంగరియబారదు నిన్న నిజప్రయత్నదిం
దరిద పెనెన్నదంగరియబర్పుదు నీంకృపె మాడె చోద్యమే
సరసువవంగె సిల్కద నిధానమయత్న పరంగె భాగ్యదిం
దరసదెసిల్కువంతె పరమప్రభువే మహాదైవురీశ్వరా ॥౩౮॥

తా॥ ఎంతగా కృషిసల్పి వెదకు వాడికి నిధినిధానము లభించదు. అదే అదృష్టమున్నవాడికి ప్రయత్నములేకుండగనే లభించును. అట్లే మహా ప్రభూ! నీస్వరూపమును దెల్సికొంటి నను వాణికిదెలియదు. యుక్తిచేత నది దెలియదు అనువాడికి నీ వనుగ్రహించుటకు దెలిసికొనుటలో నాశ్చర్యమెముండ?

బళసియుముండు ముట్టుమభిమానిసియుం విషయంగళోళ్
సముమిళితశుభాశుభ ద్వివిధకర్మనునిర్మళచేష్టనొప్పువం
జ్వళిత భవత్ప్రసాద పరిపూర్ణ నిరర్గళ భక్తియోగ సం
ప్రళయ విదూరనాగి పరమప్రభువే మహదైవురీశ్వరా ॥౩౯॥

తా॥ నీయొక్క ఉజ్వలమగు ప్రసాదమువలన పరిపూర్ణమగు అడ్డు లేకుండగ (అటంకములు-విఘ్నములు) భక్తి

యోగముతో గూడి శుభాశుభముల రెండింటిలోను నిర్మలముగ (దోషరహితుడుగ) నుండువాడు విషయములను అనుభవించినను (ఉండు ఉపవాసి) అనుభవించనివాడిలా, అనుభవించినను చెరుపు లేనట్లుగా ఒప్పుచుండును, నిర్దోషిగానె పరిగణింపబడును.

తుంబియ శక్తి పాతగుణదిం వుళు తుంబియెదాయ్తె తన్న భావంబలిదాయ్తె తుంబిపుళువం పిడిదొయ్దుదొ తానె పోదుదో బెంబళిగొండు పేళ్వుడెయనుగ్రహశక్తియె ముక్తి కారణం నంబుగెయంబుదేను పరమప్రభువే మహదైపురీశ్వరా ॥40॥

తా॥ భ్రమరము తన శక్తిపాతమునుండి తుమ్మెదయగునా? తన భావప్రసన్నతతో ఆగునా? (అవుతుందా?) తుమ్మెదకీటకమునుబట్టుకొని పోవునో లేదా కీటకముదానె బట్టుకొని పోవునో? కీటకము దానె పోవునా? ఈ సామెత మేరకు జెప్పపలెనసిన నీయొక్క అనుగ్రహముయొక్క శక్తేముక్తికి గారణమగునే గాని విశ్వాసము-సాహసములు కారణములు గావు.

వరుసద సంగమం పసియ కబ్బునమేం నెరె సంబి కూడె సంస్మరణెయనెయ్దుతే బయల బోధెయ బాధెయదేకె దేవ నీం కరుణిసి నోడదిర్ద్దొడాణ నంబుగె గింబుగెయెంబుదావుదుత్తర పద సిద్ధిగయ్యె పరమప్రభువే మహదైపురీశ్వరా ॥41॥

తా॥ ఓదేవా ! పచ్చి ఇనుము విలువగలది గావలెననిన తానె పరుషమణి సాంగత్యము జేసెనా? స్మరించెనా? బాగుగా విశ్వసించెనా? ఎన్నడునులేదు, అందుకే సారములేని యీ యుపదేశమనవసరము, విశ్వాసమనవసరము. నీవనుగ్రహించినచో నాకంతేజాలు. జీవన్ముక్తిసిద్ధిస్తుంది.

**కరుణమె కారణం బయల మాతిన మాతెయ గోళు మండెయం**
**తిరలరివేతకాచరణెయేతకె నంబుగెయేతకయ్య ని**
**న్నరుతరమప్ప సత్కృపెయె సత్యమభీష్ఠ పదార్థ సిద్ధియం**
**పరిపరిదెయ్యు వంగె పరమప్రభువే మహదెపురీశ్వరా ॥42॥**

తా॥ తనకిష్టమైన వస్తువును బొందుటకు జ్ఞానము (తెలివి) ఎందుకు? అచరణ ఎందులకు? విశ్వాసమెందుకు? మరియు అర్థములేని పనికిరాని మాటలతో బనేమి? సారరహితమగు మాటలతో తలనొప్పి గలిగించు కొనుటకంటెను ఓ శివా! నీ యనుగ్రహమె కారణము. కనుక నీ సత్కృపే నిజముగా సత్ఫలితమైనది.

అవతారిక: జనన మరణములను, తనుత్రవాసనలను నశింపజేయుమని ప్రార్థించుచున్నాడు.

**పురమె తనుత్రయస్థితి మనోభవనే జననం కృతాంతనే**
**మరణమిదేం స్మరత్రిపుర కాల వినాశకనెందు నిన్న నెం**
**బరు జననస్థితి ప్రళయ రూపినొశిర్వరనేకె నోడరా**
**ర్యరు మతివంతరాగి పరమప్రబువే మహదెపురీశ్వరా ॥43॥**

తా॥ విచారింపగ పురములే తనుత్రయ స్థితి, మనోభవుడే ఉత్పత్తి. యముడే మరణము, జగత్తే జనులు. నేటికిని ఇట్లు బుట్టుట. ఉండుట, మరణ రూపమున ఉండే ఉండును, దీనిని గమనించినను (చూచినను) బుద్ధిమంతులైన ప్రాచీన పెద్దలు, ఓదేవా! నిన్ను స్మర-పుర-కాలనాశకుడనియు, చెప్పుదురో? ఇదేమి కారణమో! తెలియదు.

జననమె తాం స్మరం స్థితియె తాం త్రిపురం మృతి తానె
కాలనీ
జనన మృతి స్థితిత్రయ వినాశనమే పుతకాలకామ సం
హననమిదే దిటం బళిక్కెన కామపురాంతకారియెం
దెనిసువ నిన్న మాయె పనమ్రప్రభువే మహద్రైపురీశ్వరా ॥44॥

తా॥ జననమనునదే మన్మథుడు, స్థితియనునదే త్రిపురము. విలయమనునది కాలుడు, వీటిని లేనట్లుగ జేయునదె కామకాల. త్రిపుర సంహారము, ఇదే నిశ్చయమైనది, వేరె నీవు కాముకాల-త్రిపురహరుడనునది అసత్యము. అది నీ ముందున్న మాయ.

మనదొళె కామనం తమవినొళ్ త్రిపురంగళ నక్షిపక్ష్మవ
ర్తనదొళె కాలనం మరళి పుటసిదిందమ నారుబల్లరం
దిన పుసి మాతు గీతుగళ నాడువరల్లదె నిన్న తక్క నిం
దినొళరిదిర్ప నానె పరమప్రభువే మహదైపురీశ్వరా ॥45॥

తా॥ మనస్సులోని మన్మథుని, తనుత్రయమునందు పుర త్రయమును, రెప్పపాటునందు యముని మరల నీవు బుట్టించిన దానిని ఎవరును గుర్తించరు నేనొక్కడినె నీయొక్క వంచ కత్వమును (ఠక్కరితనం) తప్పకుండ నేడు గుర్తించితిని, పెద్ద లు పాత మాటలనె చెప్పియున్నారు.

మనద మనోరథం లయమనెద్దులు కామజయం త్రిదేహవా సనెయళియల్ పురత్రయ జయం శివలింగదొళిట్టు నట్ట క ణ్ణిన యెవెయాటమిల్లదిరలంతదు కాలజయం త్వదీయ శ క్తి నిజపదైక్యభక్తి పరమప్రభువే మహదైపురీశ్వరా ॥46॥

తా॥ ఓయీ! జగదీశ్వరా! మనస్సులోని కోరికనశించిన చో అదే కామ విజయ మనబడును. తనుత్రయములోని వాసనలు నశించినచో అదే త్రిపురవి జయ మనబడును. లింగమునందుంచిన దృష్టి రెప్పగొట్టకుంట నిశ్చలముగా నుండిన దృష్టి అదేకాలుని విజయమనబడును, ఓస్వామి! నీయొక్క అవినాభావసంబంధ మైన శక్తే లింగాంగ సామరస్య సిద్ధిని గలుగ జేయునదే భక్తి యనబడును. అట్టి భక్తేవైన బేర్కొనబడిన జయత్రయమునకు గారణము.

భవభయ మూత్మ విద్యెగె తనుత్రయ వాసనెయడ్డ బీళె క ణ్ణవె మరెయాగె లింగద నిరీక్షగె కాల భయం మనోరథం కవియె మనక్కె కామభయమీ భయమం నిజభక్తి యోగదిం దవె కిడిసయ్య దేవ పరమప్రభువే మహదైపురీశ్వరా ॥47॥

తా॥ ఓయీస్వామి! ఆత్మజ్ఞానమునకు దేహత్రయగుణ సంబంధము ఆటంకము (విఘ్నము)గా నేర్పడినచో అప్పుడే జనన-మరణముల సంసార భీతి సిద్ధించినది, అచలమగు చూపుతో లింగనిరీక్షణచేత లింగ నిరీక్షణ జేయువేళ కంటిరెప్పను మూసి మరుగుపడగానె, అప్పుడే యమభటులభయము గలుగును. చిత్తమును ఆశె ఆవరించుకొనగానె కామభయ మేర్పడును, ఈ పూర్వోక్తమైన మూడు రకాలైన భయమును నీపైనున్న దృఢ భక్తి సామర్థ్యముతో నశింపజేయుము.

అవతారిక:- ఇక భక్తిప్రభావమును వివరించుచున్నాడు

ಕ್ಷುಧೆ ತೃಷೆ ನಿದ್ರೆಯೆಂಬಿವರ ಭಂಗಮಡಂಗಲು ಲಿಂಗದೊಳ್ ಸದಾ
ನಿಧನದ ಬಾಧೆ ಹಿಂಗಿ ತನುಜೀವದ ಸಂದಳಿದ ಪ್ರಯಾಸದಿಂ
ವಿಧಿ ವಿಹಿತ ಪ್ರಯತ್ನಗತಿ ಹೊದ್ದದೆ ರಾಜಿಪುದಯ್ಯ ಚಿತ್ಪ್ರಭಾ
ನಿಧಿ ಭವದೀಯ ಭಕ್ತಿ ಪರಮ ಪ್ರಭುವೆ ಮಹಾದ್ರಿ ಪುರೀಶ್ವರಾ ॥48॥

తా॥ జ్ఞానతేజస్సునకు నిధి (నిక్షేప) యైన ఓస్వామి! సహజ దేహగుణ స్వరూపమైన ఆకలి-దప్పిక-నిద్ర-అనుగుణ సమూహము ఎల్లప్పుడు లింగమునందు లీనమైనచో, మరణ భయము తప్పును, దేహమేనేనను భ్రాంతి దొలగిపోవును. ప్రారబ్ధకర్మము. ఫలానుభవ సంబంధము తనంతటదే దొలగిపోయినయెడల అప్పుడు నీయొక్క దృఢ భక్తి తనంతటదే ప్రకాశించును.

భ్రమెయళిదాత్మ సంగ బహిరంగ సముల్లసదంతరంగ వి
శ్రమణ వివేకదిం సకల సంశయ సూతక జాడ్యజాల మ
స్తమిసి శివాత్మకం నిరవసాన నిరర్గళ భక్తియోళ్ గతా
గమనెనిసిర్పనయ్య పరమ ప్రభువే మహా గ్రై పురీశ్వరా॥49॥

తా॥ శివ స్వరూపుడగు శివశరణుడు సంసారమునకు గారణమగు భ్రాంతిని వీడి సర్వాంగలింగ సాహిత్యము జ్ఞానము చేత అంతర్బహిర్పరణ క్రియలన్నింటిని ఆచరించు వివేకము గలవాడు గనుకే "బహిరంగార్పణే రూప మంతరంగార్పణేరుచిః ఆత్మసంగమయంసాక్షా దార్పణముచ్యతే" అను ప్రమాణము మేరకు రూపద్రవ్యమును ఇష్టలింగమునకు, రుచిద్రవ్యమును (గుణమును) ప్రాణలింగమునకు, ఆనందద్రవ్యమును భావ లింగమునకు అర్పించి, తత్ప్రసాద పరణామియైయుంట వలన అట్టి సద్భావ జ్ఞానియగుటవలన శివశరణునకు మనోవికల్పము. దేహసూతకము.,, జడ భావము-నశించిపోవుటవలన, అన్నింటి కిమిన్నయైన తసకొకటియు నాటంకము (విఘ్నము) ఏర్పడని శివభక్తియందు అతడు విహరించుచుండును,

అవతారిక :- తనుకరణ వ్యాపారములన్నియు లింగ సంబంధమువలన లింగ పూజల కొరకు ఉండునని వివరించు చున్నాడు.

మాన సమర్చనం విమళ వాచకమర్చన మర్చనం సమా
ధాన సమేత కాయకమెనల్ శివ నీనె మనో వచోవపుః
స్థాన విశిష్టనాగి కరణత్రయ పూజితనాగి తోరలి
న్నెనెరదుంటె దేవ పరమప్రభువే మహద్రై పురీశ్వరా ॥50॥

తా॥ ప్రణష్టేషు సర్వేషు స్వేచ్ఛాచారేణయత్కృతం!
తచ్ఛివార్చనమేవస్యాద్యద్భుక్తంతచ్ఛివార్పితం॥
శివరూపతయా సర్వం! యస్య భాతి స్వరూపతః।
స్వేచ్ఛాచార సమాచారస్తస్యచాచార్యాభిశాలినః

అను వచనాను సారముగా దేహకరణ వాసనలన్నియు నశించి సర్వమును శివస్వరూపమున గుర్తించి తన తను కరణాదులను శివాత్మగా మారిన శివశరణుడు తన యొక్క త్రికరణములందును ఏవ్యాపార మొనర్చినప్పటికిన్ని అదంతయు శివారాధనగా మారుటవలన, ఓస్వామి! ఆతనికి ఇక బహిర్గత వ్యాపారములేవి ఉండవు. అతని లీలావిలాస భరితమగు ఆచారములన్నియు నీయొక్క పూజలే అనిభావము.

స్థూల శరీర సూక్ష్మతను కారణదేహమెనిప్ప మూరరొళ్
మేలె గురూపదిష్ట శివలింగమఖండిత నిత్య చిత్ప్రకా
శాలయమాగి తోరలు తనుత్రయదొళ్ తెరహిల్ల దిర్పత
ల్లిలెయె శుద్ధపూజె పరమప్రభువే మహద్రై పురీశ్వరా ॥51॥

తా॥ శ్రీ గురువు చేత నొసంగబడిన ఇష్టప్రాణ-భావాత్మకమగు లింగము స్థూల-సూక్ష్మ-కారణమను శరీరత్రయమునందు వెలసి (ఉండి) అఖండ ముగను, శాశ్వతమై జ్ఞానతేజోనిధియై, ప్రకాశించుచుండగా, పిదప నా మూడు శరీరములందును అఖండముగా ప్రకాశించునట్టి లీలా విలాస వ్యాపారమంతయు పరి శుద్ధమైనలింగ పూజయే అయియున్నది.

లింగదొళిట్ట దృష్టి నిజదృష్టియొళిర్ద మనం మనస్సినొళ్
పింగదె నింద భావమదరొళ్ నెలెగొండ శివాత్మలింగవా
లింగదొళిర్దు నిత్య సుఖియాగి విరాజిసువంగె బాహ్యక
ర్మంగళవేతకయ్య పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥52॥

తా॥ శివలింగమునందు చూపునెల కొన్నదై యుండ ఆ నిరీక్షణయందు మనస్సు ఏకధాటిగా లీనమైయుండ. అట్టి మనస్సునందు భావము కదలకుండగ స్థిరపడియుండ, అట్టి భావమునందు కదలకుండ పరమాత్మ శివ లింగము స్థిరపడియుండ అట్టి మహలింగమునందు ఏకత్వముగ విలీనమై చిరపరిణామియైయుండిన శివశరణునకు ఇక బహిర్వ్యాపారము లెక్కడుండును? వాటితో నాతనికి ప్రయోజనమేమి.

అంగద లింగమం మనద లింగమనుత్తర భావలింగమం
సంగిసి పూజెగెయ్దు ముకురప్రతిబింబదపోల్ బహిఃక్రియా
సంగదొళిర్దు మిల్లదిహ తన్నిజమే నిజమాగి తోర్ప్పభ
క్తంగెణెయుంటె దేవ పరమ ప్రభువే మహాదైపురీశ్వరా ॥53॥

తా॥ త్యాగాంగముయొక్క ఇష్ట (క్రియా) లింగమును. భోగాంగము యొక్క ప్రాణ (జ్ఞాన) లింగమును. యోగాంగముయొక్క భావము (తృప్తి) లింగమును ఒకటిగా భావించి పూజించి అద్దములోని ప్రతిబింబము మాదిరిగా బాహ్య క్రియె యందుండియులేని విధముగా నుండిన అట్టి లింగ స్వరూపమే నిజ (తనయొక్క) ప్రతి బింబమైయున్న భక్తునకు సాటియెవరు?

అంగమసంగదిం కళెయనా కళెయిం సుఖమం సుఖో త్క్రియిం
సంగమనాప్రసంగరతియిం లయమం లయదిం నిరంతరం
సంగిసి తత్ప్రపంచ విషయైక బహిష్కృతనాగి రాజిపం
లింగనిజైక్యనయ్య పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥54॥

తా॥ లింగమునందు తల్లీనమైనవాడు దన శరీరమును లింగముయొక్క అంగమునందు, కళను లింగకళయందు. తన సుఖమును (ఆనందమును) లింగానందమునందు, తన సమస్త ఇంద్రియముల సంసర్గము (సాంగత్యము)ను లింగ ప్రసంగ ప్రేమమునందు, తన-మనోలయమును లింగసామరస్యములోను సదానిమగ్నమై సంసార-విషయ సంసర్గమునుండి దూరముగ నుండి విరాజల్లును.

అంగమదారదో కరణమారదో పూజెయదారదో మహ
లింగమదారదో నెరపిదాతనదారివనెల్లమం మనో
మంగళరూపనాగి బయలం బయలిందమె బణ్ణపిట్టని
స్సంగనిరంగ నీనె పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥55॥

తా॥ ఈ శరీర మెవరిది! ఈ కరణములెవరివి? ఈ అర్చన ఎవరిది? మనసునకు మంగలమయమై శూన్యమును శూన్యముతో రంగును మార్చి, కన్నులకగు పడునటుగ మార్చి నవాడు నిస్సంగుడు. నిరంగము (దేహశూన్యుడు) గల వాడైన వాడివినీవే గదా! ప్రభూ.

లింగదొళిర్దు లింగమనె తాళ్దు నిరంతరలింగపూజెయం
లింగదినొల్దు విస్తరిసి లింగకె లింగమనర్పిసుత్తు మా
లింగ పదార్థమం సవిదు లింగసుఖాస్పదనాగి రాజివం
లింగ నిజైక్యనయ్య పరమ ప్రభువే మహదైపురీశ్వరా॥౫౮॥

"బ్రహ్మహవిర్బ్రహ్మార్పణం బ్రహ్మగౌర్బ్రహ్మణాహుతం
బ్రహ్మైవతే నగంతవ్యం-బ్రహ్మకర్మ సమాధినాః"
అని యాజ్ఞవల్క్యోపనిషత్తునందు గలదు

"లింగదేహిశివాత్మాయం-లంగాచారోనలౌకికః
నర్వలింగమయం రూపం-లింగేనసమ మశ్నుతె॥
సర్వాంగలింగమేవస్యా-దన్నపానాద్యమర్పితం।
ప్రసానస్త్రపి రేవస్యా-త్సర్వలింగమయత్వతః॥

అను ప్రమాణ మేరకు లింగైక్యుడై సర్వమును లింగ మయముగానె జూచును.

తా॥ లింగనిజైక్యత గలవాడు నిరంతరం లింగమునం దే నలీమైయుండును. లింగాకారమై నిశ్చలముగా నుండును.

ఎడతెగకుండ ఎల్లప్పుడు లింగపూజెయందే ఆసక్తిగలవాడై యుండును. లింగ ప్రేమ అధికమై యాలింగమునకు దన అంగము నర్పిస్తు ఆలింగ ప్రసాదమును ఆరగించి లింగ సుఖమును అనుభవిస్తు విరాజిల్లును

**శూన్యమె గట్టిగొండు బహిరంతరఖండిత లింగమాగి ని**
**ష్యాన్య గురూపదేశ ముఖదిం ముఖతృప్తియనెద్దుతన్మఖా**
**న్యోన్య నమర్పితాఖిళ పదార్థసుఖ ప్రతిపత్తి వీరశై**
**వాన్యరిగెత్తలుంటు పరమ ప్రభువే మహాదైవపురీశ్వరా ॥57॥**

తా॥ నిరాళ గురువు యొక్క నిజోపదేశబలముచేత నిష్కళ (నిరాకారమే సకలము (సాకారము)ఐ శిష్యునిహృదయం లోపల వెలుపల రకరకాల లింగరూపమై శిష్యుని దేహము న షడింద్రియములను షణ్ముఖ (ఆరుముఖము)లతో సంతృప్తి జెందిన బిదప నాయాలింగముల నుండి వచ్చిన ఆయాయా ప్రసాద సుఖములను బొందిన భాగ్యము వీరశైవులకు గాక మిగత వారికి లభించదు.

**నిన్న పదాంబువె నినగె మజ్జన వారి తవప్రసాద ది**
**వ్యాన్నమె భోజనాన్నమిదు తథ్యమదల్లదె బేరె మీసలా**
**దన్నముమంబువుం జగదొళుంటె యెథోచిత భక్తి భావసం**
**పన్న మనః ప్రసన్న పరమ ప్రభువే మహదైవపురీశ్వరా॥58॥**

"తద్విశ్వరూపిణశ్శంభో స్సంభూతాష్షడ్రసాన్వితాః।
సమస్తాషడ్విధాహారా-జలపుష్పాదయస్తథా॥
ఈ శప్రసాదసంలబ్ధా-తవేయుర్నాత్రసంశయః।
అపారమేశ్వరంతస్మా-దిహకించిన్నవిద్యతేః॥

అను వాక్యాము ననుసరించి అన్నము-జలాది సకల పదార్థములు విశ్వస్వరూపుడగు ఈశ్వరుని నుండి సృష్టింపంబడినవి-అన్నియు శివప్రసాదములే ఐయున్నవి. శివుని వీడియేవియును లేవనిభావము.

తా॥ శాస్త్ర విహితమగు భక్తి భావ సంపన్నమైన చిత్తశుద్ధిగల వారికి ప్రసన్నుడవగు ఓ పరమ ప్రభూ! నీయొక్క పాదొదకమేనీకు అభిషేకించే జలము. నీయొక్క ప్రసాదదివ్యాన్నమే నీకు నైవేద్యాన్నము, ఇది సత్యమైన పలుకు, వీటిని వదలి ఈ ప్రపంచమున నీకు మిగిలియున్న వేరె అన్నపానాదులులేవు.

ఛాయమె రూపమాగి వరరూపమె నోళ్ళొడెయల్లి నిర్మళ
ఛాయమదాగి జీవమె నిరంశకదిం సలె కాయమాగి తత్
కాయమె జీవమాగి నిరుపాధిక లింగ నిజాంగ సంగ ని
ర్మాయతెయాగ భక్తి పరమ ప్రభువే మహదైపురీశ్వరా॥59॥

తా॥ తెల్సుకొని విచారించినచో ప్రతిబింబమే బింబము, ఆబింబమే-ప్రతిబింబమైనది, కనుకనే జీవుడే నిరంశకుడై యుండి

శరీరధారియైయున్నాడు. శరీరమే జీవుడైయున్నాడు. ఉపాధి శూన్యమైన లింగాంగ సంగ సామరస్యమునందు అజ్ఞానము లేకుండుటే భక్తియనబడుతుంది.

(సర్వత్వము సర్వతృప్తత్వాదిషడ్గుణములతో గూడిన ఆ అంగస్థలమే శివ-స్వరూపమైయున్నది. ఈ అర్థమునందు)

ఆత్మాయం కేవలశుద్ధశ్శైవస్యాంశస్సదామలః।
నిత్యోనిరంజనశ్శాంతస్తస్మాదాత్మాస్వయంశివః॥

"సోయమాత్మాశివాంగస్స్యాచ్ఛివేనాంగీకృతత్వతః।
సర్వజ్ఞత్వాదిభేదైశ్చ శివాంగమిదమిష్యతె॥

సర్వజ్ఞత్వంచతృప్తత్వంతధానాదిప్రబోధతా।
స్వతంత్రతలాపిచాలుప్తశక్తితానంతశక్తితా॥

ఇత్యేతైర్లక్షణ్యైషడ్భిశ్శివాంగమితిలక్ష్యతె।
తస్మాదంగస్థలంసాక్షాదాత్మైపహీనసంశయః ॥ అని ప్రమాణముంది.

తా॥ ఇతడు జీవుడు-ఇదిదేహము. అను ఉపాధులనన్నింటిని నశింపంజేసి సహజమగు లింగమునందైక్యతను సాధించి నిర్మాయకుండగుటే సహజభక్తుడగుచున్నాడు. (ఇదె సహజభక్తి యనుబడును)

రుద్రపదం గణేశ్వరపదం మొదలాద సమస్త సంపదం
క్షుద్రతరం శివాంగ శివలింగ నిజైక్య సుఖాస్పదంగె సం
విద్రచిరాత్మకంగె సమఖండిత ఖండిత కాయ జీవదిం
ముద్రితనాదవంగె పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥60॥

తా॥ అంగ-లింగముల నిజైక్యసౌఖ్యశీలుడు సంవిద్రూపుడు అఖండితమహా లింగము ఖండిత ఇష్టలింగ స్వరూపమగు జీవకాయము(దేహము) గలవాడు ఐన శివభక్తునకు, రుద్రపదవి, ప్రమథ గణ పథములు మొదలగు సమస్త సంపదలు అత్యంత తృణ ప్రాయములు.

ఆదియనాది మధ్యమవసానమెనిప్పవనొందుగూడి సా
క్షాదమృత ప్రసాద పరిపూర్ణ భవత్కరుణాలసత్కటా
క్షోదయమారిగాదపుదవర్గరిదే శివయోగసిద్ధి ని
ర్భేద సుఖాభివృద్ధి పరమప్రభువే మహదైపురీశ్వరా ॥61॥

తా॥ దేహాత్మకరణాదులను శివలింగమునందు సమరస మొనర్చిసాక్షాత్తుగా అమృతమయమగు నీయనుగ్రహమునకు పాత్రులైనవారు- శివయోగ సిద్దియొక్క ఫలస్వరూపమగు ఆ అఖండ సుఖాభివృద్దిని సహజముగ సంపాదింతురు. వారికి ఆవేశము ముక్తి, సద్గతుల కోరికయుండదు.

ఎల్లియ ముక్తియెల్లియ పరాగతియెల్లయ పారలౌకికం
నిల్లు షడంగలింగ ముఖఖండిత జీవశరీరయోగదిం
పల్లటుమాగి పూర్వతను పోగి నిజైక్య విశేషదల్లి తాం
నిల్లదె నిందవంగె పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥62॥

తా॥ భక్తాది ఆరంగములు ఆచారాది ఆరులింగముల యొక్క క్రియానుభవముతో దేహము-జీవుల సంబంధము తొలగిపోయి పూర్వాశ్రయముగూడ దొలగిపోయి నిజలింగైక్యము యొక్కవిశేషమునందు వీడకుండ స్థిరపడియున్న వాడికి వేరేమరెక్కడముక్తి! ఇంకెక్కడి పరాగతి. ఇంకెక్కడి పరలోకము? అంగ-లింగ సమరసమె నిజమైన భక్తుని సార సర్వస్వము.

"ననిరోధోనచోత్పత్తిర్నబద్ధోనచసాధకః।
నముముక్షర్నవాముక్త ఇత్యేషా పరమార్థతః" (అని అమృత బిందు ఉపనిషత్తులోనిది)

"ధర్మాది పురుషార్థానాం చతుర్ణాంపరతః పరా।
పంచమః పురుషార్థోహి-భక్తిశ్శైవీ సనాతనః॥ అనే అను భవసూత్రంప్ర

ఉసురెడెయాటమే కరగనం కొరెవల్లి శరీరజీవదా
బెసుగెయనెద్దె బిచ్చి బిసుటంతదరైక్యమనారు బల్లరా
ఉసురుమనాశరీరముమనాఘన జీవమనొందుగూడిరా
జిసువుదె నిన్న భక్తి పరమప్రభువే మహదైపురీశ్వరా ॥63॥

తా॥ దేహము-జీవుల సంబంధమును వేరుపరచుటకు కోసి వేరుచేయు రంపమువలెనున్న శ్వాసోచ్ఛ్వాసము, దేహము-జీవము-ప్రాణములకూటమిని గుర్తించిన వారెవరు? ఈ మూడింటిని ఒకటిగాజేసి ప్రకాసించునదె భక్తియనబడును.

కడెదిళుహిట్ట కప్పురద పుత్థళియంతెసెవంగసంగదొళ్
గడణిసి తోర్ప తత్పరిమళాకృతియందదె లింగసంగ మో
గ్గొడెయదె రమ్యవాగి శివలింగ నిజాంగద సంగసౌఖ్యమం
పడెదిహుదీగ భక్తి పరమప్రభువే మహదైపురీశ్వరా ॥64॥

తా॥ తొలచి (చెక్కి) చేయబడిన కర్పూరపు బొమ్మ యొక్క దేహమంతయు సుగంధ విశిష్టమైయుండు పగిది-అంగాంగములందును లింగ సంగ (సాంగత్య)మేకమై విరాజించునట్టి శివలింగ సుఖ పరిణామమును బడయునదే భక్తి యనబడును. కర్పూరపు బొమ్మయొక్క శరీర మంతయుసుగంధముగా నున్నరీతిగా లింగమయ దేహమునందు లింగానందమే లభించుచున్నది.

స్ఫటిక ఘటప్రదీపదవోలంగద లింగద సంగదైక్యసం
ఘటిత విభేదవర్జవిమళాకృతివెత్త విలాసదేశ్గెయిం
నటియిసితోర్ప మూర్తివిడిదొప్పువ శాంభవయోగసిద్ధి తాం
దిటమహుదీగ భక్తి పరమప్రభువే మహదైపురీశ్వరా ॥65॥

తా॥ స్ఫటికపు ఘటము (కడవ)లో ప్రకాశించునట్టి దీపమువలె శరీరమునందు లింగసంసర్గమేర్పడిన నిర్మలాకృతి

విలాసము అభివృద్ధి వలన భిన్నత్వమునశించి లోవెలుపల ఒక టిగా మారినట్లుగా ఒప్పుచున్న శివయోగనిశ్చయమైన భక్తి.

గగనదొళింద్ర చాపమళాతునిలనోళ్ సుళిదిపవహ్నియోళ్
సొగయిపకత్కణంసలిలదోళ్కరకం మహియోళ్మహిష్ఠపాం
సుగతవహంతె లింగదొళభిన్నతెయిం గతమప్పనిర్మలాం
గ గుణమదీగ భక్తి పరమప్రభువే మహదైపురీశ్వరా ॥66॥

తా॥ ఆకాశమునందలి ఇంద్రధనుస్సు వేగముగావీచె గాలిలో సుడిగాలి. కారుచిచ్చులోని మిరుగుడువలె, నీటిలోని వనగండ్ల ముక్కవలె, నేలయందలి మట్టి దుమ్ముమాదిరిగా అగుపడునట్లు గా వేరుగాక ఉండునట్లుగా లింగమునందు శరీరముకనబడినను అభిన్నముగా నుండిన నిర్మలమగు గుణమే నిజభక్తియనబడును.

మనమదువాక్కినొళ్విమలవాక్కదుతాంమనదోళ్మనోవచో
ఘనతరయోగమతానువినోళ్ తనువాసవవో మనస్సినో
ళ్సనె తెరహిల్లదంతె సెరె కూగి పరస్పరలీన మాధవా
సనయదు తానె భక్తి పరమప్రభువే మహదైపురీశ్వరా ॥67॥

(భక్తి, ఈ అర్థదల్లి "మృత్పిండ మేఘోపల విస్ఫుల్లిం గ వర్తీంద్రచాపస్థ వపుః క్రమేణ। స్యుఃపార్థివాస్యామళ తేజసా ఖ్యవా యవ్యసద్వ్యోమవిభేదభిన్నా।॥

తా॥ మనసుమాటలలో, మాటలు మనస్సులో, మనసు మాటలు ఈ రెండింటి కూటమి తనువులో తనువు యొక్క స్థిరతమాట మనస్సులలో కొంచెమైనను ఎడముండకుండ బాగుగాకలసి యుండిదానితో గలిగిన సద్వాసనా సంస్కారమె భక్తి యనబడును.

మనదొళె తోరిదర్భమదు వాక్కినొళెంతరివంతె తోరి తాం
మనదొళె వాక్కెనొళ్ కరతళామళకాకృతియాగి సత్య చి
ద్ఘనవరమార్థముచ్ఛళిసి తోరుతిహంతెమదీయకాయదోళ్
తనిమొనెదోరిసయ్య పరమ ప్రభువే మహాద్రిపురీశ్వరా ॥68॥

“యద్ధిమనసాధ్యాయతి, తద్వానాఏదతి తత్కర్మణా కరోతి॥ (అనియజుర్వేదమునందు ప్రమాణము)

తా॥ మనస్సులో స్ఫదించిన అర్థము, అట్లు ఆస్పందించిన పరమార్థములు, మాటలలో స్ఫురించునట్లుగా, మనసు మాటలలో నేకార్థమై గోచరించిన అర్థ పరమార్థములు అరిచేతిలో ఉసిరిక మాదిరి, నాయొక్క శరీరమునందు అధికముగా అగుపతునట్లుగా అనుగ్రహించుము. త్రికరణములందును పదార్థమును బాగుగా అనుగ్రహించుము ప్రతి బింబింప జేయుమో స్వామి?

గగనదొళుల్కె బీళ్వవోలు నోడలు నోడలడంగి పోవసో
జిగద చమత్కృతి ప్రకృతి సిద్ధగుణాధిక దేహపాకము
ర్విగె పొసతాగి లింగదొళ్‌డంగువ నిత్యనుగావగాహ సి
ద్ధిగె సరినిన్నభక్తి పరమ ప్రభువే మహాదైపురీశ్వరా ॥69॥

ఆకాశము నుండి పడే నక్షత్రము చూస్తు ఉండగానే మాయ మగునట్లుగా దేహముగూడ జీవుని బాయును. ఇది యొకచమ త్కారమేసరి. అందుకే స్వభావ సిద్ధమగు సర్వ గుణసంపన్న మగు భక్తి శరీరము ప్రకృతిలో ప్రవిలీనమైనదగాక లిం గమునందేలీనమై ఐక్యమగును భూమి(పుడమి)కిది వినూత నమైనది. నిత్యానందమునందు నిమగ్నమైన దివ్యశక్తిస్వామి! (శివా!) భక్తిలోనున్నది.

అవతారిక:- ఇక శివానుగ్రహమును ప్రార్థించుచున్నాడు.

భవహర నిన్న కణ్ణెవెగళాటదినబ్జభవాదిగళ్గె నం
భవిసువుదుద్భవం మరణమెందెనలన్న మనుష్య కీట జ
న్మవ నిరదెద్దు బాళువర నిత్యతయేనిదరొళ్ కృపా ప్రసా
దవనిరిదిత్తు కాయి పరమప్రభువే మహదైపురీశ్వరా ॥70॥

తా॥ ఓస్వామి! నీవు నీయొక్క రెప్పపాట్లను మూయు నంతలో హరి-బ్రహ్మ-ఇంద్రాదులు జననమొంది మరణింతురు ఇంట్లుండగ మానవ మాత్రుల మాటేల? వీరి ఆయుష్యము ఇదె

ంతటిది? కీటకముల మాదిరి బుట్టి-మరణించె వారికి నిత్యత్వ మెక్కడిది? నీవే నీయొక్క కృపా ప్రసాదమును అనుగ్రహించి కాపాడవలెను.

పవన సముద్ధతాంబురుహ పత్ర వయంః కణదంతే చంచల
త్వన నిరదెద్ది జీవిసువ జీవనదల్లి భవత్ప్రసాదము
ళ్ళవనె కృతార్థ నేవెనెనగిల్లెనలేం దయెగెయ్యె బుద్ధి శం
భు దెనినెగుంటియిల్ల పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥71॥

తా॥ గాలికిచలించె తామరపాకు పైనున్న నీటి బిందువు మాదిరిగా అస్థిరముగా జీవించె బదుకులో పరమాత్ముని కృపా ప్రసాదమున్నవాడె కృతార్థుడు. అద్దానిని బడసినవాడు ధన్యుడు, ఆభాగ్యమునాకులేదు. అల్పమానవులకు ఇది "నభః పుష్పమువంటిది,, దానికి దగినరీతిగా అను గ్రహించే బుద్దినీకు నులేదు-నతదృష్టుడనైన నేను ఏమిజేయను? జనులేమి జేయగలరు?

సుఖవె సుఖాభివృద్ధియె సుఖోన్నతియే సుఖసారసిద్ధియే
సుఖపరిపూర్తియే సుఖకళాకృతియే సుఖచక్రవర్తియే
సుఖముఖ బంధువే సుఖరసామృత సింధువె నిన్నవర్గె నీం
సుఖమనె మాళ్పుదయ్య పరమప్రభువే మహాదైపురీశ్వరా॥72॥

తా॥ (ఆనందం బ్రహ్మేతివ్యజానాత్,, అని తైత్తిరీయోపనిషత్తుంది,, ఓ ఆనందమయుడా! సుఖాధిక్యతగలవాడా! సుఖో

న్నతుడా! సుఖసార సిద్ధిగలవాడా! సుఖసౌందర్యాకృతి గల వాడా! సుఖసార్వభౌమా! సుఖముఖముగలవాడ (బంధువైన వాడా) సుఖామృత-రస సముద్రమైనవాడా! నీవారికి నీవు సుఖ మును గ్రహించుము. "ఆనందో బ్రహ్మ" అను వాక్యమునుసార్థక పరచుము.

ధరణియొళాద దేహదవొలల్ల జలాగ్నిమరున్నభః కశే
వరదొళాదంగిద ప్రకృతియంతహుదల్లివరంగమం సము
ద్ధరిసి శివాత్మలింగతనువింతిపరోళ్మణి సూత్రదంతె తా
విరుతిహుదైక్యమాగి పరమప్రభువే మహదైప్పురీశ్వరా ॥73॥

అవతారిక :- శరణులకంగమైన పంచభూతములు లింగ స్వరూపమైయున్నవని నిరూపిస్తున్నాడు.

"యేన సర్వమిదం ప్రోతం సూత్రె మణిగణా ఇవ,, బ్రహ్మోపనిషత్తు ఈ శివశరణుల దేహము ప్రాకృతుల దేహము వలె కేవలము పృథ్వీ-అప్పు-తేజస్సు-వాయు-ఆకాశములన్ను పంచ భూతముల మయమైనదిగాదు. వీరి అంగేంద్రియము లన్నియు పరమ శివమయమైనవి. ఈ అర్థమునకు ప్రమాణము:-

"పవిత్రంతే వితతం బ్రహ్మణస్పతే ప్రభుర్గాత్రాణి పర్యే విశ్వతః! అని ఋగ్వేదము ఆదేశించుచున్నది.

"ఇష్టలింగంతు బాహ్యాంగె-ప్రాణలింగంతథాంతరే।
భావలింగంతధై వాస్తి-ఆత్మాంగె సుప్రతిష్ఠతం॥
హృదయాంగే మహాలింగం శ్రోత్రాంగేతు ।పసాదకం॥
త్వగంగే చరలింగంచ-దృగంగే శివలింగకం।

జిహ్వాంగే గురులింగంస్యా-న్నాసి కాంగేతధై వచ,,
అచారలింగమ శ్రాంతం-సుప్రతిష్ఠితమేవహి,,

యథాజ్ఞానేంద్రి యాంగేషు-క్రమాల్లింగం ప్రతిష్ఠితం॥
తధా కర్మేంద్రియాంగేషు-క్రమాల్లింగం ప్రతిష్ఠితం॥

అను వాతులాగమ వాక్యములు ప్రమాణములై యున్నవి. అందుచేత పవిత్రమైన ఆ శివశరణుల దేహమునందు మణులతో చేర్చబడిన దారమువలె మంగల స్వరూపమగు మహాలింగము, సమరసమై (కూడినదై) యున్నది.

ధరణియె పీఠమంబరమె లింగమినింతిరదొందనొందు బి
ట్టిరదిహకారణం సకల జీవరిగాలయ మాద్దు తమ్మొళొం
దిరదిరలొందెయాద్దు సరినోడె విశేషమదేసుమిర్దుది
ర్దెరడర మధ్యదల్లి పరమప్రభువే మహదైపురీశ్వరా ॥74॥

శ్లో॥ ఆకాశం లింగమిత్యాహుః పృధ్వీతస్యపీఠికా।
అలయస్సర్వభూతానాం-లయనాల్లింగముచ్యతె॥

అనే ప్రమాణము.

తా॥ పృధ్వే పీఠము,, అంబరమె (ఆకాశము) లింగము, ఈరెండును పరస్పరముగా (ఒకదాన్నివదలి మరొకటి) వదల కుంత కూడియున్నవి ఈ ప్రపంచమందలి సమస్త జీవులకు ఆలయమైయున్నది. ఆధారముగా నున్నది. ఈరెండును వేరు గావు, మేలుకీడులుగావు. అన్యోన్యముగ సాపేక్షకములై యున్నవి

ధారుణి సర్వభూత పరిణామద సంగతిగెయ్దు తానె యా
ధారమవక్కె తానెయవకాశమనూనవియు త్తళం తదా
ధారపహావకాశ వదభావమివింతెరడక్కె నోడె సా
ధారణధర్మవర్తి పరమప్రభువే మహదైపురీశ్వరా ॥75॥

తా॥ "కర్ణమేన ప్రజాభూతా" అని ఋగ్వేదవాక్య ప్రమాణముంది. భూమి సర్వప్రాణుల ఉత్పత్తికి ఆధారమైయున్నది. ఆకాశము జీవించుటకాశ్రయమైయున్నది, విచారించినచో ఈరెండును సాధారణధర్మమైయున్నవి. సృష్టి-స్థితి-లయములకు హేతువైయున్నవి. ఒకటి సృష్టికి అవకాశమిస్తె. మరొకటి స్థితికవగాశమిస్తుంది. ఐనను సూక్ష్మముగా పరిశీలించినచో భూమి స్థితికి ఆకాశము సృష్టికి గారణమైయున్నవి. ఈ రెండింటికిని మహాలింగము అసాధరణముగా కారణమైయున్నది.

అంబరదంగమాగలనిలాకృతియాగిలి వహ్నిరూపినా
డంబరమాగలంబువిన తద్గుణమాగలి పృథ్వియ ప్రకా
రం బిడదాగలావ పరియాదొడదేం నిజలింగకాయమి
ర్పింబదు లింగదింబు పరమప్రభువే మహదైపురీశ్వరా ॥76॥

తా॥ ఈ మహాలింగమునుండి గలిగిన సమిష్టిపంచమహా భూతములు అంగములే మరియు వ్యష్టి పంచ భూతాంగములు అన్నివిధముల లింగశరీరములై లింగాశ్రయమునందేయున్నవి. అన్నింటికి ఆపరాకాశ స్వరూపమైన మహాలింగమే ఆశ్రయమై యున్నది.

ధరణీశరీరమే విమలభక్తపదం ద్రవదేహమే మహే
శ్వరపదముష్ణకాయమే తృతీయపదం చలభావసత్కృశె
వరమె చతుర్థమాద పదమంబర దేహమె పంచపన్నం
నిరుపమమైక్యమయ్య పరమప్రభువే మహాదైవురీశ్వరా ॥77॥

తా॥ భూమ్యంగమే భక్త స్థలము-జలాంగమే మహేశ్వర స్థలము: వాయు లింగమే ప్రాణలింగి స్థలము, ఆకాశాంగమే శరణ స్థలము. ఆత్మాంగమె ఐక్యస్థలము, వష్టి (వ్యక్తిగతము) సమిష్టి (సామూహికము,) "బీజాంకురముల"వలె సంకోచ-వికాస ముల స్వరూపముననున్నవి.

స్వపనద దేహకెల్ల రుధిరాది షడంగకమిల్లదిర్దొడేం
వ్యపగత జన్మమృత్యుభయమప్ప నిరంశక నిత్యదేహమా
దవుదె నిజాంగలింగకృతసంగశివాత్మ కదివ్యదేహ మా
వపరియొకాదొడేను పరమప్రభువే మహదెపురీశ్వరా ॥78॥

తా॥ స్థూల దేహమువలె సూక్ష్మ దేహమునకు "త్వక్-రక్త-మాంసాదులులేకున్నను, జనన-మరణాదుల పేరు లేనట్టి,

అవయవాదులు లేనట్టి చెడిపోని (చెడని) దేహమగునా? నిజమైన అంగ-లింగ-సంసర్గము చేత శివాత్మకము, దివ్యమగు శివభక్తుని దేహము ఏవిధముగ నుండిన నేమి? దానికి దేహగుణ ధర్మము లుండవు, చర్మరక్తాదులున్నను భక్తుని బాధించవు.

భూతపిశాచరాక్షస నిశాచరరేనిరరే త్వగాది షడ్
ధాతు విహీనమాగి నెళలంతిరె తోర్ప శరీరగొండు సా
కేతరమాతు లింగతనుగొండ శివాత్మర వృత్తి బేరె తా
నేతరనాదొడక్కు-వంగె పరమప్రభువే మహదైపురీశ్వరా ।79॥

తా॥ త్వక్ మచ్ఛగః షడ్ దాతువులు లేనిదే నీడ (ఛాయ) వలెనున్న శరీరము నాశ్రయించి భూత-రాక్షస-నిశాచరులు ఉండవా? అట్టి భూతములు జనన-మరణములను జయించినవా? ఇదేటిమాటలు? లింగదేహముగల శివాత్ముల వ్యవహారము ఏవిధముగ నుండిననేమి? అద్దానినుండి వారికి భవపాశ బంధనమను నదిలేదు వారిదె ప్రత్యేకమైన వైలక్షణ్య (విచిత్ర) మైన వృత్తి.

ధరెసలిలాగ్ని వాయు నభమెంబిపు తమ్మొళె హీన మధ్యమో
త్తర తమమేల్లవక్కు-వర భావమదే కడెయాగి సర్వముం
సరి జగదుద్భవ స్థితి వినాశమనొందిరదొందు మాళ్ప శ
క్తిరహితమెప్పవాగి పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥80॥

తా॥ భూమి-అగ్ని-గాలి-ఆకాశము ఈ పంచ మహాభూతములు సామాన్య మైనవిగావు ఇవి అధమము-మధ్యమము-ఉత్తమమైనవని తారతమ్యము (వ్యత్యాసము)గలవిగా నున్నవి. క్రమముగ (వరుసగ-పరివిడిదు) అథవా అనులోమ విలోమములుగా అయిదు-నాలుగు-మూడు-రెండు-ఒక స్వభావముగలవిగా నున్నవి. అందుచేత ప్రపంచము యొక్క సృష్టి-స్థితి-లయములను ఇవి ఒకటొకటిగా మార్చలేవు. ఇట్టి మార్పులలోనివి సమానముగానున్నవి.

రసరుధిరాది ధాతుమయమబ్బ శరీరమదల్ల లింగ భ
క్తినమితిగెంబ మాతదు దురాగ్రహదు క్తి శివైక్య భ క్తి యో
గ సుఖదొళాంతు దాతుకమధాతుకమెంబుభయాంగ మొంది
తెసెదిహుదైక్యమాగి పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥81॥

తా॥ లింగ భక్తుల దేహములు రస(లక్తము-నీరు)ము-రుధిరము మొదలగు ధాతుమయమైనదిగాదని చెప్పుట దురాగ్రహమైన మాటయనిన యెడల వినుము శివసామరస్యము యొక్క భక్తి యోగము సౌఖ్యమునందు వారాసక్తులై యున్న కారణమున సప్తదాతువులున్నప్పటికిన్ని ధాతు వికారం లేనందున వారి శరీరము ధాతుమయమైనది-సరికాని-ధాతుమయముగూడ అగును.

అనిమిషనస్థి మాత్ర తనువాగిరనే బసవం త్వగాదిసం
జనితవపుష్కనాగిరనెయల్లమనంశకవర్జకాయ నా
గినెళలు హెజ్జెయిల్లదిరనే శివయోగ సుఖ ప్రపూర్ణ వా
సనెయ శరీరమొందె పరమప్రభువే మహాద్రైపురీశ్వరా ॥82॥

తా॥ అనిమిషయ్య ఆస్తి మాత్రము శరీరము గలిగి యుండలేదా? బసవణ్ణ షడ్ధాతుమయమై యుండలేదా? అల్లమయ్య అవయవశూన్యుడై దేహము గలిగియుండి పాదముల నీడ (ఛాయ) లేకయుండెనుగదా! శివయోగి ఆనంద తుందిలుండై (సుఖసంతృప్తి గలవాడై) సంస్కారముగల దేహమెట్లుండినేమి? (అంతయు ఒకే రీతిగానుండునని అర్థము) లింగసాంగత్యముండిన శరీరము ప్రాకృతికముగాదు, పాపయుక్తమైనదిగాదు.

భౌతికమాదొడాగలదకేం బహిరంగదె తొట్టి కంతెష
డ్ధాతుక మాగలల్లదొడె ధాతు వివర్జిత మాగలొందెరల్
ధాతు సమేత మాగలవనీ జలవహ్ని మరున్నభస్సము
ద్భూత శరీరవృత్తి పరమప్రభువే మహాద్రైపురీశ్వరా ॥83॥

తా॥ భక్తుల బాహ్యాంగము భౌతికమైయుండిననేమి? భాక్తికమైయున్ననేమి? షడ్ ధాతుమయమై యుండని, ఉండక పోనిగాక అథవా ఒకటి రెండు ధాతువులున్నవిగానిండు ఎట్లైనను ఉండనిమ్ము అద్దానికి ఎలాంటి దోషము లేదు.

ಬಿಡುವೊಡೆ ಸರ್ವಮಂ ಬಿಡಲೆ ಬೇಕವಸಾನದೊಳೈಕ್ಯ ಸೌಖ್ಯಮಂ
ಪಡೆವೊಡೆ ಪಾರ್ಥಿವಾಂಬು ಘನತೈಜಸ ಮಾರುತ ಮಂತರಿಕ್ಷಮಂ
ಬೊಡಲಿದು ಮೊಂದೆಯಾಸೆತನುಪಾರ್ಥಿವಮಂಬರ ದೇಹಮಾದೊಡೇಂ
ಬಿಡದಿರಬಾರದಯ್ಯ ಪರಮ ಪ್ರಭುವೇ ಮಹದೈಪುರೀಶ್ವರಾ ॥84॥

తా॥ విడిచే సమయమందు ఎంతటి యమూల్యమైన శరీరమై (మునై)నను ఎవరైనను సర్వన్వమును వదలవలెను. సమరససౌఖ్యమును, బడయుటలో అంతే ఈ పంచ భూతాంగము ఒకటే అయి (ఏకమై) అంగ లింగ సామరస్య మేర్పడును, పార్థివాంశమైననేమి? అంజరాంశమైననేమి? మరోభూతాంశమైన నేమి? అన్నియును ఒకటె ప్రసాదకాయమైన బిదప దీనిని వృధా చెరుపగూడదు.

ಇಲ್ಲೆನ ಗುರ್ವಿ ವಾರಿ ಹುತಭುಜ್ಮರುದಂಬರಮೆಂಬಿವೆಂದು
ತನ್ನಲ್ಲಿಯೆ ತಾಂ ಗುರೂಕ್ತಿ ಮತದಿಂ ತಿಳಿದೈದುವನೈಯ್ದೆ ಬಿಟ್ಟು ನಿಂ
ದಲ್ಲಿ ವಿಶುದ್ಧ ನಿಷ್ಕಳ ಶಿವೈಕ್ಯಸುಖಾಸ್ಪದನಪ್ಪನೆಂದು ಕೈ
ವಲ್ಯ ಶ್ರುತಿ ಪ್ರಶಸ್ತಿ ಪರಮಪ್ರಭುವೇ ಮಹದೈಪುರೀಶ್ವರಾ ॥85॥

“నభూమిరాపోనచవహ్నిరస్తి-నచానిలోమేస్తినచాంబరంచ ఏవంవిదిత్వాపరమాత్మరూపం-గుహాశయం నిష్కలమద్వితీయం సమస్త సాక్షింసదసద్విహీనం-ప్రయాతిసద్యఃపరమాత్మరూపం ఆని కైవల్యోపనిషత్తుయొక్క ప్రశస్తిని వేనోళ్ళ పొగడుచున్నది.

నాకు భూమి-అగ్ని-ఆకాశము వీటితో నాకెలాంటి సంబంధము లేదు. అని దెలిసికొన్నబిదప హృదయాకాశమునందు ప్రకాశించె కళాతీతవగు పరబ్రహ్మమును బొందును.

తా॥ శ్రీగురూపదేశమును బడసిన తరువాత పంచభూత వికారము తనలో లేదని నీరసమైయున్నవని తాను శుద్ధమైన లింగకాయమనియు, నిర్మలము నిష్కలము అయిన శివైకసుఖాస్పదుడై విరాజిలుచున్నదై తనకు గలిగినదని కైవల్యశ్రుతి రంగరించినది. నాద-బిందు-కళాతీతము తనకు లభించినది.

దృశ్య జడంగళెందెనిప నాకసమీరణ హవ్యభుక్పయః
కాశ్యపిగళ్ విశిష్ట గుణ వృత్తిగళాదొడెయుత్తరోత్తరం
నశ్వర వస్తుగళ్ ప్రళయ కాలదొళింతివడంగి పోగెనిం
శాశ్వతనాగి బాళ్వపరమప్రభువే మహాద్రైపురీశ్వరా ॥96॥

తా॥ దృశ్యములై, జడములైయున్న ఈ ఆకాశాదిమున్నగునవి. పంచమహాభూతములు తమతమగుణధర్మములతో ఒకదానికంటె మరొకటి ఉత్తరోత్తరముగ ఉత్తమమైనవే-గాని యశాశ్వితములైనవి-ప్రళయకాలమున "లీనమైపోవును. (కనబడకుండ పోవును) పరమ ప్రభువైన నీవొక్కడివి మాత్రమే మార్పు జెందకుండ ఉండెదవు. జీవించి యుండేవాడిని.

ప్రథివి జడం జడం సలిలమగ్ని జడం శ్వసనం జడం జడం
ప్రథమ గుణైకవృత్తి నభమింతివ నాత్మ వివేకశక్తియిం
మథిసి జడాంగమం బిసుటు నిష్కళమప్ప షడంగలింగ సత్
పథగత నప్పనయ్య పరమప్రభువే మహదైపురీశ్వరా ॥87॥

తా॥ నేల (భూమి) జడము, నీరు జడము, అగ్ని జడము. గాలి జడము, శబ్దగుణైక వృత్తిగల ఆకాశముగూడ జడమను నది ఆత్మ తన వివేక శక్తితో విమర్శించి విశ్లేషంచి ఈ జడాంగములను పారదోలి ఆ జడమగు కళాతీతమగు, షడంగము లందుండిన లింగముల సన్మార్గమున నడచువాడు సద్భక్తుడు.

మాడిద పాపమిల్లదొడె మాడువ పాపవదిల్ల ముండె తాం
నోడలుపాపమెంబుదదు మున్నవెయిల్ల బిడాదొడం తదం
మాడలు కర్తనల్ల పరతంత్రనదంతిరలిన్ను నిన్న నాం
బేడువ పాపముంటె పరమప్రభువే మహదైపురీశ్వరా ॥88॥

స్వకర్మ పరిపాకేన-ప్రక్షీణమల వాసనః।
శివ ప్రసాదా జీవోజయం-జాయతే శుద్ధమానస॥।
శుద్ధాంతః కరణేజీవె-శుద్ధ కర్మవిపాకతః।
జాయతె శివకారుణ్యా-త్ప్రస్ఫుటాభక్తిరైశ్వరు. అను సిద్ధాంత శిఖామణి వచనము మేరకు కర్మక్షయా నంతరమే శివ భక్తి జనించితద్వారా మోక్ష మార్గోప దేశము సమకూరిన శర

ఋద్రైన వాడికి పాప సంబంధముమొదలే యుండదు. ఒక వేళ ఇహమందు పాపాచరణయనునది సంభవించినను దానిని జేయుటకు నేను కర్తనుగాను. నీయధీనమునన్నున్నవాడిని. ఇట్లుండగా అస్వతంత్రుడనైన నాకు నిన్ను గురించి ఒక ఇష్టార్థము గావలెనిని ప్రార్థించె పాపము ఎట్లుండును?

తా॥ మొదలు జేసిన పాపమేలేనప్పుడు, ఇక ముందొనర్చెడు పాప మెక్కడిది? విచారింపగా నేడొనర్చిన పాపము మొదట లేనే లేదు అని ఒక వేళ పాపమున్నదని వాదించినట్లౌతె దాన్ని జేయుటకు నేను కర్తనుగాను, పరాధీనుడిని, నీయండజెరిన వాడిని, (నీయధీనుడిని) ఈ వాక్యమట్లుండనిమ్ము ఇకముందు నిన్ను నెను వేడుకొనుటలో నేలాంటి పాపములేదు.

బేడువవం విచారిపొడె భక్తనెయలఖివాంఛితార్థమం
బేడిసికొంబవం కడెగె దేవనెయలుయభయైకమింతివం
కూడుతిరల్ భవం భవమనుళ్ళవనే భవి యాభవి భవిత్వమం
మాడువ భక్తియేకె పరమప్రభువే మహదైపురీశ్వరా ॥89॥

తా॥ విచారించినచో అర్థించువాడు భక్తుడుగాడు, అడిగించుకొనువాడు దేవుడు గాడు, ఈ యుభయులు ఒకటే. ఈ రెండును ఉన్నచోట భవము (సంసారము) గాచుకొనియుండును, భవమున్నవాడే భవియనబడును. ఆ భవిత్వమునకు గారణమై

నది సకామ భక్తి ప్రయోజన కారియైనది గాను. అది భవము నకు మూలము.

బేడద మున్నతానె కుడువాతనె దేవనభీష్టసిద్ధియం
బేడదె కాడదెద్దువనెభక్త నయత్నదినప్రయాసదిం
బేడువ కాడువాయనగొళుత్తిహ భక్తియె పాపమింతిదం
బేడద హాంగె మాడు పరమప్రభువే మహాద్రైపురీశ్వరా ॥90॥

తా॥ అభీష్టము (కోరిక)ను వేడకముందెతానె ఇచ్చునా తడె దేవుడు, ప్రయత్న ప్రయాసములు లేకుండానె ఒకరిని వేడి పీడించనివాడే నిజమైన భక్తుడు, వేడి. పీడించి ఆయాసమునకు గురిజెసేవాడు భక్తుని కంటె వేరె పాపములేదు. కావున ఓ ప్రభూ॥ నన్నుయాచకునిగా జేయకుము.

బేడవుదావుదిల్లదుధ నుళ్ళదదుంటుద నిల్ల మాడి తాం
బేడతదేకె బేడిదొడె బారదుదిల్లదుదిల్ల సర్వథా
బేడదె మాడ్దొడుళ్ళదదు పోగదదిగ యథార్థమింతిదం
బేడదహాంగె మాడు పరమ ప్రభువే మహాద్రైపురీశ్వరా ॥91॥

తా॥ లేని వస్తువును గురించి వేడుటయననేమి? ఉండి నది ఉండే ఉన్నది. ఉన్నదానిని లేని దానిగా మార్చితాను వేడుట ఎందులకు? వేడినచోనదిరాదు. లేనిది లేనేపోయెను. ఏవిధముగను వేడ (కోర) కుండయుండినచో ఉన్నది బోదు లేని ది రాదు ఇది సత్యము. కనుక వేడకుండ జేయుమాస్వామి.

బేడువుదీగ కామమదు బారదుదే కడుగోపమంతద
క్కిడహుదీద లోభ మదరిం మరెదిర్పుదె మోహామల్ల హొ
క్కాడువుదీగ దుర్మదమదం బలిదిర్పుదుతానె మత్సరం
బేడువ పాపమిష్టు పరమ ప్రభువే మహద్దైపురీశ్వరా ॥92॥

తా॥ అడుగుటయే కామము. అడుగినది దొరకమి-కోపము. ఒక వేళ దొరకిన యెడల దానికి దాసుడై (లోబడి) యుండుటే లోభము, లభించిన దానిని మరచిపోవుటె మోహము, అద్దాని నుండి గర్వపడుటే మోహము, దానినుండి గర్వపడుతు వేరొక దాని యెడి తిరస్కార బుద్ధితోజూచుటే మత్సరము, వీటన్నింటిని గోరుకోవడం చేత వచ్చేదే పాపము,

బేడువవంగె బేడుతిహా దైన్యమదొందురె బేడి బర్ప హె
గ్గొడిన విత్తదిందకటుపూర్ణమెనిప్పుదె మత్తె మత్తె తాం
బేడిసుతిర్పుదైసె సినె బేడవవంగదు పూర్ణమాగితై
గూడినుతిక్కు తిర్కు పరమప్రభువే మహద్దైపురీశ్వరా ॥93॥

తా॥ వేడే వాడిక్కియెల్లప్పుడు యాచనా బుద్ధే ఉంటుంది ఆవిధముగ యాచించుట. అన్నింటి కంటెను నీచమైనది. ఒక వేళ యాచనతో నధికముగను గ్రహించినను తృప్తియుండదు. అత్యాశ మళ్ళి మళ్ళి యాచింపదలచును; కోరక వేడకుండు ఉండే వాడికి చాలునిక చాలునను వరకు తనంతకు తానే చేతి కందీ వచ్చును, కాంక్షకులోనుగాక సదాతృప్తిగా నుంచుతుంది,

బేడువదేనుపాపమె సదాశివ నిన్ననె బేడుతన్యరం
బేడద సిద్ధియం పడెయదిర్పుదరింద మే పాపమాదుదా
బేడువ పాపమం మరెదు మాడదె నిస్పృహనాగి నిన్ననాం
బేడదహాంగె మాడు పరమప్రభువే మహదైపురీశ్వరా ॥94॥

తా॥ ఓయీ పరమ మంగళ స్వరూపియైన శివదేవా! లోకమునందు యాచించుటయనునది పాపముగాదు. అదెట్లనగా భక్తవత్సలుడివి. ముక్తి ప్రదాతవు ఐన నిన్నొక్కనినే వేడుట (యాచించుట) తప్పుగాదు. అన్యులను వేడుట (యాచించుట) తప్పగును కాని తృప్తి లేకపోవుట యాచనకు మూలము, అట్లు గాకుండ అనుగ్రహించుము.

పురుషకృతిప్రయత్నముమయత్నముమింతెరడుంభవత్కృపా
పరిణతమాగె సిద్ధిసుగుమల్లదె తాం కృతయత్నమాడదొడం
నిరుపమ సిద్ధిదం కృపెయదిల్లదొడిల్లదరిందయత్నదిం
దిరుతిహ హాంగె మాడు పరమప్రభువే మహదైపురీశ్వరా॥95॥

తా॥ ఓయీస్వామి! వురుషుడు ప్రయత్నమును జేయని జేయకపోనిగాక పురుష ప్రయత్నాప్రయత్నములు ఫలించవలె ననిన నీ యనుగ్రహము తప్పకుండ ఉండవలెను, అదిలేనిసమయమునన్నెంత ప్రయత్నించినను ప్రయోజనకారిగాను, అందుచేత కేవలము భ్రాంతి చేత ప్రయత్నశీలుడిని గానియట్లునాకు నీ దయను అనుగ్రహించుము.

పరుసమహాగుతాగుతకటూ హొన చిన్నద ఘట్టియాదవోల్
నిరుత నిజైక్య భక్తి హొరవేషద భాషెయ డంభ భక్తియా
గురుతర భోగ సిద్ధి కరమాదుదుదు శాంభవ యోగసిద్ధియం
తరిసిదు దేవెనయ్య పరమ ప్రభువే మహాద్రైపురీశ్వరా ॥96॥

తా॥ సిద్ధరసములోహసంబంధము చేత క్రమంగా కొంగొత్త బంగారు ముద్దగా మారినట్లుగా, నిష్కామమగు స్వచ్ఛమైన సమరస భక్తి రాను రాను బాహ్యాడంబరమగు కామ్యభక్తిగా పరిణమించి, భోగ్య భాగ్య ప్రదమై పరిణమించినది, ఈ కారణము వలన ముక్తి ప్రదమగు శివ జ్ఞానము శూన్యమైనది. అకటా నేనేమి జేయను? (నిష్కామ భక్తి నివృత్తి మార్గము గలదై ముక్తినొసగును సకామ భక్తి ప్రవృత్తి మార్గముగలదియై భోగ భాగ్యములను గలుగ జేయునని భావము).

అళినరఘుద్వయక్కె సమవృత్తి సధుృవతదర్మమాదొడం
తిళివొదె బంధమోక్షయుగమాగిహుదాసమవృతితద్వయ
క్కెళెయోళిహంగె భక్తి పథవర్తనసామ్యమభక్త భక్త సం
కుళమెరడక్కె బేరె పరమప్రభువే మహాద్రైపురీశ్వరా ॥97॥

అవతారిక :- ఆత్మ సమర్పణము క్రియారహితమె బాహ్యక్రియతో ఫలపదములను కాంక్షించువారిని ఖండించుచున్నాడు.

కా॥ పై పద్యమున గన పరచిన ఆశయమును ఇక్కడ దృష్టాంతపూర్వకముగ నిరూపించుచున్నాడు. పుష్పమునందు ఉండిన మకరందమును పానమొనర్చునట్టి ధర్మము తుమ్మెద తేనె పురుగునకు సమానక్రమము (పని-పద్ధతి) యున్నప్పటికిని, మకరందమును సంగ్రహించవలెనను ఆశ తేనెపురుగునకుంట వలన అది అందులోనె జిక్కుకొని మరణించును. తుమ్మెద అట్లుగాక పరాగమును సేవించి వెంటనె ఎగిరి పోవును. వాటివలెనె భక్తి మార్గాచరణ గూడ ఒకటే అయినప్పటికిన్ని భక్తి సోపాధిక మైనచొ బంధక మేర్పడును. అదే నిరూపాధికమైన యెడల మోక్ష ప్రదమగును.

(పై పద్యమున సోపాధి-నిరుపాధిక భక్తిని గురించి వివరించియున్నాడు).

**జలకుసుమోదనోపకరణక్రమ పూజె యనోల్దు మాడిత**
**త్పలమనమర్దు కాంక్షివరులోగరమక్కళనిక్కి నోళ్ళవోల్**
**నెలెయనిదావభక్తి యొళగాజల ముఖ్య పదార్థమారదా**
**ఫలవవత్తైసె దేవ పరమ ప్రభువే మహాదైపురీశ్వరా ॥98॥**

అవతారిక:- **ఆత్మ సమర్పణము** క్రియారహితమై. బాహ్యక్రియ చేత ఫల పదములను కాంక్షించునట్టి వారిని మళ్ళి ఖండించుచున్నాడు.

తా॥ ఓశివా! ఇతరుల (వేరెవారి) బిడ్డలనుదెచ్చి బలి ఇచ్చి నిక్షేపమును దీసికొనవలెనని యత్నించువారివలె, నీక్కు-

పువ్వులు, మున్నగు సామగ్రి చేత, దేవ పూజ యొనర్చి, తన్మూ లకముగా లభించిన ఫలమును తాముబొందవలెనని అపేక్షించుచు న్నారు గదా! ఇదెంతటి ఆశ్చర్యము! ఆజలము మొదలగు పదార్థములు తామా? అవితమవా? అవి దేవుడికి సమర్పితము లైన బిదప వాటివలన లభించునట్టి ఫలము వాటికే జెందును గాని ఇతడి కెట్లు లభించును? (అనగాతన ఇష్టదైవమునకు తన ను ప్రధానముగా సమర్పించకుండ ఆత్మవంచనె గావించి, బాహ్యా డంబర పూజను గావించుటయందు ఫలములేదని భావము).

ఓదనమం నివేదిసిద తత్ఫలమోషధిగళ్గె పత్రపు
ష్పాదిసమర్చనాఫలమదై దెవనస్పతిగళ్గె నిర్మల
స్వాదుజలాభిషేచితమ నిత్తఫలంనదిగళ్గె మిక్కవ
ర్గాదవు దెంతదయ్య పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥99॥

తా॥ ఓ ప్రభూ! తనదైవము (దేవుడికి)నకు అన్నము ను నివేదించుటవలన గలిగె ఫలము ఆధాన్యమునకు జెందును, పుష్పపత్రములను ధరించుట (సమర్పించుట)చేత గలగిన ఫలము అట్టి పుష్పములనొసగిన వృక్ష-లతాదులకు జెందును. నిర్మల (స్వచ్ఛమగు) జలము చేత నభిషేక మొనర్చిన ఫలము ఆ జలమునొసగిన నదులకు జెందును. ఇట్లుండగా అట్టి అన్య వస్తు వులను సమర్పించి, తమకువాటి ఫలము గావలెనని గోరుట అదెట్లు పొసగును? ఇదేటి న్యాయము? (అవన్ని అర్పించుటకు మొదట్టధనను దాననర్పించుకొన్నుట ఉచితమైనది.)

క్షితిజలవహ్నివాయు నభమెంబివు నిన్నపూజగీ
క్షితిముఖ పంచభూత కృతమప్ప పదార్థమనిత్తు తమ్మవెం
బతిమమకారదిం ఫలమనీహివరాత్మ సమర్పణక్రియా
మతిరతి హీనరయ్య పరమప్రభువే మహదైపురీశ్వరా॥ 100॥

అవతారిక:- పూజ సాధనములు ఇతరులతో దెప్పించి లింగపూజ యొనర్పగూడదని ఆదేశించుచున్నాడం.

తా॥ ఓస్వామి! ఈ పృథివ్యాది వంచ భూతములు నీ వస్తువులు, నీకు మొట్టమొదట ఆత్మార్పణయొనర్చి పూజించేబుద్ధి లేసదె (లేక) జనులు ఈ పృథివ్యాది భూతములతో జనించిన జల పుష్పాదులను తమవని భావించి. వాటిని నీకు సమర్పించి తన్మూలకమైన ఫలమును తాముబొందవలెనని అభిలషింతురుగదా.

తానె జలప్రసూన ముఖ సర్వ పదార్థమనన్యరంపొగ
ళ్దేనుమనాసెగెయ్యదె నిజేశ్వరపూజెగె కొండుబందుని
త్యానత మర్చిపాత నతనే సుఖిమిక్కవనెద్దె దుఃఖియెం
బానుడి యొళ్ళితయ్య పరమప్రభువే మహదైపురీశ్వరా॥ 101॥

తా॥ అటులైనచో లింగపూజను జలపుష్పాదుల చేత జేయవలదా? అనగా ఎట్లు జేయవలెనను దానిని గురించి ఈ పద్యమున వివరించుచున్నాడు. లింగపూజను జెయువాడు ఎదే

నొక ఫలాపేక్ష చేత జేయక నిర్మలమైన భక్తిగలవాడై వేరొకరి చేత జల-పత్ర-పుష్పాదులను దెప్పించుకొనకుండ పూజోపకరణములన్నింటిని తానెదెచ్చుకొని బూజించవలెను అట్లుగా బూజించువాడె నిత్యసుఖియగును, అట్లుగాక సోపాధికభక్తితో పరులను వేడి పీడించి ఇతరులచేత దెచ్చిన పదార్థములను సమర్పించువాడు దుఃఖితుడగునని శివాగమప్రమాణము ప్రశస్తమైనది.

ಆನುಡಿ ಯೊಳ್ಳಿತಾದವೊಲದೇಂನಡೆಯೊಳ್ಳಿತು ಮಾಗವನ್ಯರ
ಲ್ಲಾನಿಜದೇಹಮುಖ್ಯಕರಣಂಗಳು ತನ್ನವರೇವೃಥಾಖಿಮಾ
ನಾನುಗತತ್ವದಿಂದವರಕೈಯೊಳೆತಾಂತರಿಸಲ್ಕೆಯೋಗ್ಯಮೆ
ನೀನೆ ವಿಚಾರಿಸಯ್ಯ ಪರಮ ಪ್ರಭುವೆ ಮಹದೈಪುರೀಶ್ವರಾ ॥102॥

ఓ పరశివమూర్తి! ఇతరుల చేత దెప్పించి పూజింపవలదని పైన జెప్పిననుడి (వాక్యము) ప్రశస్తమైనట్లుగా నడతగూడ ప్రశస్తముగ ఉండగూడదా! (ఉండాలిగదా!) అదెట్లనగ తన దేహ (కరచరణాదులు) ఇవిగూడతనకుభిన్నమైన వేగదా! అట్టి కరణాదులు తనవని అభిమానించివాటి చెతిలో జల పత్ర పుష్పాదులను తాను దెప్పించుట గూడదగినదేనా? నీవె విచారించి చూడుము.

ತನ್ನವರೆಂದೊಡೇಂ ಕೆಲಬರುಂತೆ ವಿಚಾರಿಸೆ ಲೋಗರೆಂದುತಾ
ನನ್ಯರನೋಳ್ಪರುಂತೆ ಸಕಲರ್ಪರರಲ್ಲ ವಿಭೇದ ಬುದ್ಧಿಯುಂ
ತನ್ನವರೆಂಬುದೊಂದು ಮಮಕಾರದುಮೆತನ್ನ ಮಿಕ್ಕವರೆಲ್ಲರುಂ
ಮುನ್ನಮೆಲೋಗರಯ್ಯ ಪರಮಪ್ರಭುವೆ ಮಹದೈಪುರೀಶ್ವರಾ॥103॥

తా॥ సమస్త పూజోప కరణములు. వాటిని దెచ్చి ఇచ్చే వారు శివాంశ సంభూతులైన కారణమున, శివ స్వరూపులే అను భావము చేత ఇతరుల చేత పత్ర పుష్పాదులను దెప్పించి బూజింపవచ్చును అను దానిని గురించి వివరించుచున్నాడు. ఓ శివ దేవా! విచారించినచో తనవారు కొందరు ఇతరలు కొందరను వారున్నారా? తానుమిగత వారిని పరులనదగునా? అందరును శివస్వరూపులే అగుట వలన తనకందరు ఒకటేయని భావించవలెనుగాని తాను ఇతరులుగా భావించుట అహంకార మమకారముల కవకాశ మొసగినట్లగును.

తన్వవరన్యరెంబుభయ భావమదిల్లదె నోశ్పొదెల్లరుం
నిన్నవరెందవర్గళొలిదిత్త జలప్రసనాది వస్తువిం
నిన్ననె పూజి పాతనవనే సుఖిమిక్కవనెద్దె దుఃఖిమ
త్తిన్న విచారమేసు పరమప్రభువే మహదైపురీశ్వరా॥104॥

తా॥ ఓయీ! జగదశ్వరా! విదారించినచో వీరునావారు, వీరుపరులు అనే భేదభావముతనలో లేకుండ అందరును. శివాంశ సంభూతులే అని గుర్తించి (తెల్సికొని) ఇతరులు ప్రేమతో దెచ్చియిచ్చిన పత్ర పుష్ప జలాదులతో నిన్నొక్కడినే భక్తి మీర బూజించునాతడే పరమానందయుతుడగును. మిగత వారందరు దుఃఖభాజనులగుదురు.

యాచిసి మాడలాగదు శివార్చనెయం జలపుష్ప ముఖ్యకా
లోచిత వస్తువం పరరవెందకటా వుసిమాతనాడితా
వేచపలత్వదిం నుడువినగ్గణెయంగిదువిం ప్రసూనమం
యాచిసితర్పరేకె పరమప్రభువే మహదైపురీశ్వరా ॥105॥

తా॥ ఓ స్వామి! నీరు-పూలు-మొదలగు శివపూజోపకర
ణ వస్తువులను పరులవని తానె మిథ్యగాగల్పించి చెప్పి. తీపి (మంచి) మాటలతో యాచించి ఆ నది నీటిని, చెట్టు పూలను దెప్పించు కొనుటెందుకు? ఎల్లప్పుడు మనుష్యుల్ని పీడించి. యాచించి పధార్థములను దెచ్చి శివార్చనను జేయవలదు.

తానె నిజేష్టలింగయజనోచిత వస్తువనొల్దు కొండుబం
దేనుమనన్యరప్పవరు తందుదనొల్లదె పూజెగెయ్వవం
మానవ నల్లవం శరణనన్యరు తందుదనీసి కొంబవం
మానవనైసె దేవ పరమప్రభువే మహదైపురీశ్వరా ॥106॥

తా॥ ఓ ప్రభూ! తన ఇష్టలింగ పూజకు ఇతరులు దెచ్చి యిచ్చినయే ఒక వస్తువును గూడ దీసికొనక, తనకవసరమైన ఉపకరణములను తానె ప్రీతితో దీసికొనివచ్చి లింగపూజను జేయువాడు మానవ మాత్రుడుగాడు. అతడు నిజముగా శివశరణుడే సరి. (శరణుడే) ఇతరులు దెచ్చి యిచ్చిన వాటితో బూజించినవాడు కేవలం మానవుడుగా పరిగణింపబడును.

కరచరణాదిగళ్వరికిసల్ తసగన్యర వర్గె మత్తదేం
హొరెవనెబాళ్దు తన్న శివపూజెగె తాంతరలొల్ల దన్యరిం
తరిసి జలప్రసూన ఫలవస్తుగళం శివపూజె గెయ్వనె
శరణ నిదావభక్తి పరమ ప్రభువే మహాద్రైపురీశ్వరా ॥107॥

తా॥ విచారించినచో కరచరణాదులు తనకుగావల్సిన వేనా? వాటిని గాపాడుటకయ్యే తాను బ్రదికియున్నాడా లేదు. ఇట్లుండగ శివశరణుడు తనలింగ పూజ కొరకు తాను శ్రమ కోర్చి పత్ర పుష్పాదులను దీసికొని రాక ఇతరలు దెచ్చిన పూజా సామాగ్రితో బూజించునా? అట్లెన్నటికి జెయడు, అట్లు జేయుట శివశరణుడికిఏనాటికిని దగినదిగాదు, అది నిజమైన భక్తియనబడదు.

తన్న సతీసుతానుచరబంధుజనంగళు మిన్నుమత్తెమి
క్కన్యరుమాత్మదేహ కరణాదిగళుం సలెతానుమెల్లరుం
నిన్నవరెందు నిన్నొడవెయెందు నిజేశ్వర పూజెగెయ్వవం
ధన్యసదీగపూజె పరమ ప్రభువే మహద్రైపురీశ్వరా ॥108॥

శ్లో॥ ద్రవ్యార్థంచ మహాదేవః ద్రవ్యరూపోమహేశ్వరః।
ఇతీహభేదోనోనాస్తి-సర్వరూపస్సదాశివః॥ అని ప్రమాణం

తా॥ ఓ ప్రభూ! తన భార్యా పుత్రులు, సేవకులు, బంధువులు మిగతవారు తన దేహేంద్రియములు, తానుగూడ

నీ చెత జన్మించిన కారణమున, నీవారే - నీపదార్థములే యని దెలిసి ఎవడు నిన్ను బూజించునో అతడే ధన్యుడు. అతడు జెసె-పూజనే సార్ధకమైనది.

అవతారిక:-ఇట్లీ సమస్తపదార్థములను ఇచ్చేవాడు శివుడు గాక-వేరుగాదనినిరూపించుచున్నాడు.

కుడువవనారుకొంబువనదారు వృథా భ్రమయేకె బేడమా
ఱ్కుడువవనుంబలాత్కరిసి కొంబవనుం శివనెందు వేదము
గ్గడిసుతె దాతృభోక్తృసకలం నెరెనీనెనుతిర్పవాక్యమం
పిడిపుదె భక్తియయ్య పరమప్రభువే మహదైపురీశ్వరా॥109॥

వేద ప్రమాణము:- "నాహంకర్తా-నాహంభోక్తా నాహం కారయితా" పురాణ వాక్యము "శివోదాతాశివోభోక్తా-శివస్సర్వమిదంజగత్స? శివోయజతితత్సర్వం-తచ్ఛివస్సోహమేవచ,, అని యుంది.

తా॥ ఓ జగదీశ్వరా! భక్తితో అర్పించదగిన పదార్థములనన్నింటిని సమస్త జనులకు అనుగ్రహించువాడెవడు? వాటిని పరిగ్రహించువాడెవడు? వాటన్నింటిని శివునికి సమర్పించువాడినినేనని చెప్పుకొనెడువాడి కేవలము భ్రమింపజేసే మాటలతో ప్రయోజనమేమి? ఇచ్చువాడును. పుచ్చుకొనువాడును. అనుభవించువాడు శివుడుగాక మరొకరు గారని చాటి చెప్పుచున్న

వేద వాక్యమును అనుసరించి అచరించుటే నిజమైన భక్తి
మార్గము.

బర్పుదు బారదెంబుభయ సంశయమిల్ల హుదాగదెంబుది
ల్లొప్పబిభేదమిల్ల శివలింగదొళం మిగెనోడె తనొళ్ళుం
తప్పదెసర్వమం శివముఖార్పితమం నెరెమాడి భోగిసు
త్తిర్పవరాద్యరయ్యా పరమప్రభువె మహాదైపురీశ్వరా ॥110॥

తా॥ తనకిది వచ్చును, ఇదిరాదు, ఇది అగును, ఇదిపో-
వును అను సందేహమునంతటిని బోనాడి. శివలింగమునకుదనకు
లేశ మాత్రము భేదము లేక సమరసముగ (సామరస్య) సమస్తేం
ద్రియముల ద్వారా వచ్చిన విషయములను ఆయా లింగముఖము
లకు సమర్పించి తత్ప్రసాద సౌఖ్యమును అనుభవించుచున్న
వారె నిజమైన-శివశరణులు.

అవతారిక:- గ్రంధ సమాప్తిలో పురాతనుల అను
గ్రహమును ఇమ్మని (ఒసగుమని) శివుని గూర్చి ప్రార్థించుచు
న్నాడు.

ఏసెవ వృషాధిరాట్ చెన్నవృషాంక గుహేశ్వర నల్లమప్రభుపూ
ర్ణసులభయోగినాథ మహాదేవి మహాసతి సిద్ధరామ ముఖ్య
సకల లింగసంగ నిజనిష్ఠ పురాతనరున్నత ప్రసాద
సుఖవనిత్తుకాయి పరమప్రభువే మహాదైపురీశ్వరా ॥111॥

తా॥ ఓ మహా ప్రభూ! శ్రీ బసవేశ్వర చన్నబసవేశ్వరు లు సమస్త ప్రాణుల దహరాకాశమునందు ప్రకాశించునట్టి స్వామి యగు, భక్త సులభుడగు అల్లమ ప్రభు మహాయోగీశ్వరుడు. మహాదేవియక్క మహా శివశరణి, సొన్నలాపురము (షోలాపురము) శ్రీ సిద్ధరామ శివయోగి, వీరెమున్నగు లింగాంగ సామరస్యముగల మహా శివశరణుల గొప్ప అనుగ్రహము వలన లభించునట్టి యెడతెగని ఆనందాన్ని అనుగ్రహించి గాపాడుము

శతకమిద్దై పుర ప్రభుపదాంకితమాద పురాతనోక్తినం
మతమెనలప్రయాసవద బంధనిజాను భవాను బంధనం
శ్రుతి ధవబంధ మాదుదు శివైక్యపరాయణభక్తియోగసం
స్థిత శరణాంఘ్రి పూజె పరమప్రభువే మహాద్దై పురీశ్వరా॥112॥

తా॥ శ్రీమద్దై పురము సోమేశ్వరుని పాదపద్మమునకు అంకితముగా నొసగిన వైరాగ్య ప్రతిపాదకమగు శతకము ప్రాచీన శివాచార్యులైనవారానతిచ్చిన వాక్యములకు ఆమోద యోగ్యమగునట్లుగా అనాయాససిద్ధమగు పదబంధముతో లలితముగాను సహజముగాను శివజ్ఞాన సంపన్నముగాను. వేదవచనార్థగర్భితముగానున్నది. ఇట్టి గ్రంథము శివలింగ నిష్ఠాగరిష్ఠులైన, భక్తియోగతత్పరులైనట్టి శివశరణుల పాదసేవకు సమర్పించనైది.

అప్రతిమ ప్రతిష్ఠ పరిపూర్ణ పరానుభవ ప్రభావభ
వ్యప్రతితార్ణమాదపదబంధపదోత్తర భక్తియోగసౌ
ఖ్యప్రద సద్గురూక్తి మతసిద్ధమిదీశతకక్కె మాయిదే
వప్రభువీగకర్తృ పరమ ప్రభువే మహదైపురీశ్వరా ॥113॥

తా॥ ఈ శతకము సాటిలేని ప్రాశస్త్యముతో గూడిన శివజ్ఞాన ప్రభావముతో ప్రకాశించునట్టి ఆశయము నిండియున్న శబ్దములు గలదై, సాలోక్య-సామీప్యాదిపదవులను మించిన ఐదవ (5) పురుషార్థమగు శివభక్తి యోగము చేత సిద్ధించునట్టి పరమానందమును పతితులకు గలుగ జేయునదై శ్రీ గురూపదిష్టమగు సద్భక్తి గల వీరశైవ మార్గమును అనుసరించియున్నది. ఇట్టి మహత్వముగల శతకమును శ్రీ మగ్గెయమాయి దేవాచార్యుడురచించి (గధించి) యున్నాడు.

ఇక్కడికి వైరాగ్య ప్రశంసాపరమైన
మహదైపురీశ్వర శతకము యొక్క
కన్నడ వ్యాఖ్యానమునకు తెనుగు వ్యాఖ్యాన కర్తయైన
వే॥ పండిత శ్రీ పెద్ద మఠము రాచ వీర దేవర
"తీర్థ. M. O. L.
ప్రణీతం బై సమాప్తమైనది. 25-4-1999.

" ఓం "

# మాహేశ్వర పద నిర్వచనము

"మాయాంహేయాం" శ్వవత్,, యోపరిహరతి
సః మాహేశ్వరః, (సిద్ధాంత శిఖామణి ప్రమాణము)

తా॥ మాయ (ఆశ) అనెడు శ్వానము (కుక్క) వలె అనగా శ్వానము ఇంట్లోకి ప్రవేశిస్తుంటే దాన్ని కట్టితో భయపెట్టి వెళ్ళగొడ్తామో అదేమాదిరి ఆశ్యాసను తన మనసు నుండి తొలగించు కొన్నవాడే మాహేశ్వరుడనబడునని అర్థము.

# జంగమ పద నిర్వచనము

ఆగమ ప్రమాణములు :-

శ్లో॥ జకారం గురురూపంచ
గకారం లింగమేవచ
మకారం జంగమంచైవ
సర్వకర్తాచ జంగమః॥ (వీరాగమే ప్ర.)

శ్లో॥ లింగాధీనంజగత్సర్వం
లింగంబ్రహ్మాండమేవచ

తల్లింగం జంగమాధీనం
జంగమోమమదేవతా ॥ (వీరాగమే ప్ర.)

శ్లో॥ అంగమాశ్రిత్య ఆచారం
తదంగం ప్రాణమాశ్రితం
తత్ప్రాణ మాశ్రితం లింగం
తల్లింగం జంగమాశ్రితం॥ (గరుడపురాణె)

శ్లో॥ కోటితీర్థ నదీస్నానాత్-కోటి లింగార్చనంజపాత్
కోటిక్షేత్రాద్యత్పుణ్యం-విశేషం చరపూజనే॥
(వైయ్యాగమె ప్ర.)

శ్లో॥ ఏరుద్రలోకాదవతీర్యరుద్రా-
మానుష్యమాశ్రిత్య జగద్ధితాయ
చరంతి నానావిధ చారుచేష్టా
స్తేభ్యోనమస్త్ర్యంఒకపూజకేభ్యః॥
(శంకర సంహితె ప్ర.)

శ్లో॥ మాహేశ్వర పదాసక్తం-స్థానం భవతి సంపదాం
పదాహతందధీచేన-విష్ణోర్వక్షశ్రియంపదం॥
(స్కాందపురాణె ప్ర.)

శ్లో "చరంతీతి జంగమాః,, జంగమ పదనిర్వచనం"

# శివనామ సంకీర్తనము

శివశివయనుచు-నుడువుము జిహ్వతో
భవరోగముతాబాయునయా ॥పల్ల॥

వడివడిగా శివశివనామముఁబలికిన
భవరోగముతాదొలగునయా ॥౧॥

మనమున శివశివ-వనమున శివశివ
చేయుడి శివశివ-పూజలను ॥౨॥

ఆడుతు పాడుతు-వడిగా నుడువుము (బలుకుము)
శివశివయని-శివనామమును ॥౩॥

అలసటజెందక-అందరు బలుకుడి
ఆత్మనెరింగి-పరమాత్ముడని ॥౪॥

నుడిలో శివశివ-నడలో శివశివయని
బడయుడు-శివసారూప్యమును ॥౫॥

# ప్రార్థన

దిక్కెవ్వరు రాచవీరునకు
దిక్కెవ్వరు పండితవర్యునకు
దిక్కెవ్వరు పెద్దమఠాధీశునకు
దిక్కుదిక్కనెడువాడు నాయెడద
దిక్కు నాపరమ శివుడే దిక్కు
ఎల్లవేళ్ళలందు ఏమారకుండగ
పరమశివుడేగదా గాపాడువాడు
పార్థివ శరీరము పరమార్థ సాధనకు
పరమ దయాళువైన పరమశివుడు ప్రత్యక్షమై
పరమభక్తులను గాపాడు భవ్యమూర్తి
తరగని భక్తితో నిరతము గొల్చిన
గిరిజా వల్లభుడు మనకండనుండు
నమ్మునమ్ముము నరుడనగజాత
వల్లభుని నమ్మికయే కారణమ్ము
శివుడి ప్రసన్నతకు మహిని॥

కృతికర్త : డా॥ పెద్దమఠం రాచవీరదేవర

ఓం

# ఆంధ్రప్రదేశ్ వీరశైవ ధర్మగ్రంథమాల

హైదరాబాద్ - 500 027 (ఆం. ప్ర.)

అమృత ఆపార్టుమెంటు (ప్రభాత్ టాకీసు) వెనుక భాగము
గది సంఖ్య 10 మరియు 11 గలవి.

## వీరశైవ సాహిత్య భాండారు

## గ్రంథముల సూచి ప్రకటన

1. వీరశైవ భావ గీతికలు (నూతన ఫక్కీలో తెలుగు కన్నడ, హిందీ సంస్కృతముల గేయాలున్నవి) 25-00

2. శ్రీ బసవేశ్వర తత్త్వములు (సంపాదకీయ వ్యాసములు) 15-00

3. వీరశైవ ధర్మాన్వేషణము (కన్నడకు దెనుగు సేత) 10-00

4. నేనెవరు? (వీరశైవసమాజోద్యమము, జి॥ మెదక్) గ్రంథకర్త జీవిత చరిత్ర 1వ భాగము 10-00

5. రత్నత్రయము (నీతిబోధక వ్యాసాలు) 10-00

6. మహాజ్ఞాని చెన్నబసవన్న (కన్నడకు దెనుగు సేత) 10-00

7. అల్లమప్రభు విజయము (నాటిక)

8. వీరవిరాగిణి అక్కమహాదేవి (నాటిక) 20-00

9. ప్రతిజ్ఞా పూర్తి (నాటిక)

10. షష్ఠిపూర్తి విశేష సంచిక, ఇందులో పై నాటికలు మరియు శ్రీ బసవేశ్వర కన్నడ వచనములకు దెనుగు మరియు సూక్తి సుధా సంస్కృత శ్లోకములకు దెనుగు సేత 20-00

11. ఇష్ట లింగార్చన విధిః (సంక్షిప్తము మరియు విశేషోపచారములతో నున్నది) 10-00

12. జగద్గురు శ్రీ రేణుకాచార్యులవారి జయంత్యుత్సవ సందర్భమున శ్రీ స్వామి వీరభద్ర శివాచార్య హాలుగూరుగారి ఉపన్యాసమునకు దెనుగు సేత 5-00

13. జగద్గురు శ్రీ రేణుకాచార్యులవారి చరితామృతము (ఇది వచన కావ్యము) 30-00

14. ప్రాచీన వీరశైవము (దీనిని వీరశైవులందరు తప్పకుండ జదువ వలసినది. వీరశైవ ధర్మము యొక్క పుట్టుక దాని యభివృద్ధిగలదు.) 30-00

15. వీరశైవులాచరించదగిన విధుల సూచనల పట్టిక 5-00

16. వీరశైవుల గోత్ర సూత్ర పటము 5-00

17. జగద్గురు పంచాచార్యుల సంక్షిప్త పరిచయము 20-00

18. స్వయం పురోహితము (తెలుగు) ఇందు శిశు జనన మునుండి వివాహాది మరణానంతరము శాస్త్రో క్తముగా సమాధిక్రియ జ్యోతిష ముహూర్తములు షోడశ సంస్కారములున్నవి. 60-00

19. గ్రంథకర్త జీవితచరిత్ర 2వ భాగము 30-00

20. గ్రంథకర్త జీవితచరిత్ర 3వ భాగము 30-00

21. ఆంధ్ర ప్రదేశ్ వీరమహేశ్వర (జంగమ) మహా సభయొక్క నియమావళి (బైలాసు) 10-00

22. వీర శైవ పురోహితుల హక్కు బాపతుల పట్టిక 5-00

23. బసవ పురాణము (పిడుపర్తి సోమనాథకవి) ప్రణీత పద్యకావ్యము 100-00

24. ఉమామహేశ్వర వ్రత కల్పము. 15-00

25. శివ గీత (సమాఖ్య తెలుగు) 30-00

